శ్రీ ర స్తు

# శ్రీ మ ద్భా గ వ త ము

సులభశైలి ద్విపదలో వ్రాయబడిన
శ్రీమద్రామాయణ, ఉత్తరరామాయణ,
భారత, భాగవతములందు
ఇది నాల్గవ సంపుటము.



కవిభూషణ, కొండేపూడి సుబ్బారావు

మొదటి ప్రచురణ :
దుర్మతినామ సం॥ర కార్తీకము
నవంబరు 1981



వెల రు. 12-00



ప్రాప్తిస్థానము :
శ్రీ కొండేపూడి సుబ్బారావు
47-10-5, ద్వారకానగరు
విశాఖపట్టణము - 16

ముద్రణ :
శ్రీపతి ప్రెస్
కాకినాడ



# కృతజ్ఞత

This book is Published with the
Financial Assistance of
**Sri Tirumala Tirupathi Devasthanams**
under their scheme
Aid to Publish Religious Books.



ఏవిభు నాత్మనెంచి రచియించితినో మహనీయ పుణ్యగా
థావళు లీపురాణకథ లాకరుణాళుఁడు వేంకటేశ్వర
శ్రీవిలసత్కృపామహిమచే లభియించెను వీనికిట్టి శో
భావహమైన రూపవిభవమ్ములు సుందరముద్రణాకృతుల్.



ఈ కావ్యము శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి
ద్రవ్యసహాయమున ముద్రితము.
వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

# భూమిక

## మన పురాణములు - మన సంస్కృతి

ఏ జాతియైనను తన సమాజమునకు ప్రయోజనకారిగా నుండునటుల అలవఱచుకొనిన జీవన విధానమే సంస్కృతి. కేవలము బాహ్యములగు వేషభాషలకే గాక ఆంతరంగిక మగు మనోవృత్తికికూడ సంబంధించిన విషయమిది. భారతీయ సంస్కృతి యందొక ప్రత్యేకత కలదు. ఐహిక సౌఖ్యముతో బాటు ఆధ్యాత్మికానందమును లక్ష్యముగా నెంచుకొనిన జీవన విధానము భారతీయ సంస్కృతి. భారతజాతి నొక్క దానినే కాక విశ్వమానవ జాతిని దృష్టియందుంచుకొని నిర్వ చించిన పవిత్ర జీవన విధానము భారతీయ సంస్కృతి.

భారతీయ సంస్కృతికి మూలాధారములైన వేదోపని షత్తుల యందలి కొన్ని సూత్రములను చూడుడు.

"స్వస్తి ప్రజాభ్యాః పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ
మహిం మహీశాః .... సహనావవతు సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై మావిద్విషావహై,
సర్వేజనాః సుఖినోభవన్తు. ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

మన ధార్మిక గ్రంథము లన్నిటి యందును ఇత్యాదు లనేకములు కలవు. ప్రజా పరిపాలనము న్యాయ్యమార్గమున

జరిగి, ప్రజలందఱు పరస్పర విద్వేషములు లేక సుఖముగా శాంతి సంపదలతో వర్థిల్ల వలయునని వీని కేంద్ర భావము. విశ్వ మానవ కళ్యాణమే ఆశయముగా నిర్వచింపబడిన సార్వజనీన సార్వకాలికములైన శాశ్వతధర్మము లివి. ఈ హేతువు చేతనే భారతీయ సంస్కృతి ప్రపంచ విఖ్యాతి నందినది.

ప్రపంచమందలి ఇతర దేశములు కన్నదెఱవని పూర్వ కాలమునందే ఇట్టి మహనీయ సంస్కృతిని విజయవంతముగ ప్రచారము చేయగల్గినది వ్యాసుడు వాల్మీకి మున్నగు మహర్షులు. బ్రహ్మజ్ఞానులు, తపస్సంపన్నులు, నిస్స్వార్థపరులు, ప్రజాసేవకులు అయిన మహర్షులెందఱో మున్ను ఈ దేశమునం దుద్భవించుట మన భాగ్యము. ఆధ్యాత్మిక చింతనావశ్యకతతో బాటు ఉత్తమ మానవధర్మములను ప్రజలలో విస్తృతముగ ప్రచారము గావించుటకై అనేక పురాణ ఇతిహాసములను వ్రాసి ప్రజల కందజేసిన మహాత్ము లీ ఋషులే.

ఈ గ్రంథములందు భగవన్మహిమాభి వర్ణనముతో బాటు, యుగయుగముల నుండి భారతదేశమున జ్ఞానయోగులు, కర్మయోగులు, ఉత్తమవర్తనులు, ధర్మపాలకులు నైన పెక్కు ప్రసిద్ధ వ్యక్తుల జీవిత చరిత్రములు కలవు. ప్రతి గాథ యందును దైవభక్తి, సత్యము, ధర్మము, త్యాగము మున్నగు నైతిక విషయములెన్నియో ప్రస్ఫుటముగ ప్రకాశించుచున్నవి. ఈ పురాణేతిహాసములు బహుజనములయందు

బహుభాషలందు వ్యాప్తిగాంచి జగత్పూజ్యములై యలరు చున్నవి.

అమరవాణి యగు సంస్కృతమున ఆదికావ్యముగ శ్రీమద్రామాయణమును వ్రాసిన కవి వాల్మీకిమహర్షి. శ్రీ మహాభారత, భాగవతములను వ్రాసినది వ్యాసమహర్షి. నన్నయ, తిక్కనాది మహాకవులు ఎన్నో శతాబ్దుల పూర్వమే వీనిని తెనిగించి ఆంధ్రజాతికి మహోత్కృష్టమగు సేవ గావించిరి. మనజాతి సంస్కృతికి జీవగఱ్ఱలు, ఉత్తమములు, శాశ్వతములు అయిన మానవ ధర్మములను బోధించు ఈ మహాకావ్యములకు ఆంధ్రమునందే పెక్కు అనువాదములు, అనుసరణములు ఆ తరువాత వచ్చినవి. ఇంకను వచ్చుచున్నవి.

ప్రపంచమందలి వివిధ దేశములు ఒకదానికొకటి దగ్గఱకు వచ్చుచు, ఒక జాతిని మఱొక జాతి పరిభావితము చేయుచున్న నేటి కాలపరిస్థితులలో యుగయుగములనుండి అవిచ్ఛిన్నముగ సాగుచు సర్వ మానవజాతి కాదర్శప్రాయమైన మన సంస్కృతి, ధర్మములను మఱింత పటిష్ఠ మొనరింప వలసిన ఆవశ్యకత నేడెంతో యున్నది. ఈ జీవన విధానమునందలి గొప్పతనము, సత్యము ప్రతి వ్యక్తికిని తెలియ వలయును.

ఈ ఆశయముతోడనే, వేదోపనిషత్తుల సారమగు శ్రీమద్భగవద్గీతను, సంపూర్ణముగ సులభశైలి తెలుగు పద్య

తాత్పర్యములతో ననువదించి ఇటీవలనే ప్రచురించితిని. ఆ కావ్యమునకు విశేష ప్రజాదరణ లభించినది - నేడు మరల, సామాన్యులకు కూడ బోధపడు ద్విపదలో శ్రీమద్రామాయణము, ఉత్తరరామాయణము, మహాభారతము, భాగవతములను రచించి ఆంధ్ర ప్రజల కందించుచున్నాను. అనుబంధ కథలను, వర్ణనలను వదలి ప్రధాన కథాంశమునే వీనియందు పొందుపఱచితిని.

ఈ కావ్యములవలన, మన భారతీయ జీవన ధర్మములను నైతికాదర్శములను చదువరులు ఏమాత్రము గ్రహింప గలిగినను నేను కృతకృత్యుఁడనని భావింతును. ఇట్టి యుత్కృష్ట గ్రంథములను సంక్షేపించి వ్రాయుటలో కొన్ని లోపములు దొసగులును రావచ్చును. వానిని పఠితలు సహృదయముతో చూడవలెనని నా మనవి.

ఈ కావ్యముల ముద్రణకు కొంత ద్రవ్యసహాయము శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమునుండి లభించినది. వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతను, వందనములను యిటియొక సారి తెలుపుచున్నాను. శ్రీ వేంకటేశ్వరస్వామి అనుగ్రహమున నా యీ కావ్యములు ప్రజాదరణ పాత్రములు కాగలవని విశ్వసించుచున్నాను.

— గ్రంథకర్త.

# సమర్పణము

దైవసన్నిభులు, భారతదేశ విఖ్యాతికి
మూలకారణులు సర్వజగత్పూజ్యులు అయిన
శ్రీ వాల్మీకి వ్యాసమహర్షుల పాదపద్మసంస్మరణ పూర్వకముగ
ఈ కావ్యము సమర్పితము.

1

శ్రీకర మున్నతాశయవిశిష్టము సర్వజనప్రమోద సౌ
ఖ్యాకర మార్యధర్మపరమార్థమునై విలసిల్లు రామగా
థాకమనీయ కావ్యకవితన్ భువికిచ్చిన పుణ్యరాశి వా
ల్మీకికి కేలుమోడ్చి ప్రణమిల్లెద నాదికవీంద్రమూర్తికిన్.

2

వాసిత ధర్మమార్గవిభవాత్ముడు సర్వపురాణకర్త ప్ర
జ్ఞాసముపేతు డుజ్జ్వలయశఃకలితుం డఖిలాగమార్థవి
న్యాసము లేర్పఱించిన మహామహితాత్ము డనంత శేముషీ
భాసురమూర్తి వ్యాసభగవానుని కంజలివెట్టి మ్రొక్కెదన్.

3

ఆ వాల్మీకియు వ్యాసమౌనియును దివ్యప్రాభవుల్ భారత
క్ష్మావిఖ్యాతికి మూలకారణులు లోకక్షేమ కార్యైక దీ
క్షావేశ ప్రథమానమూర్తులు జగత్సంపూజ్యు లామౌనిరాట్
సేవాసంస్మృతి కీపురాణరచనల్ చిహ్నమ్ములై పొల్చుతన్.

# ప్రార్థన

## శ్రీ విఘ్నేశ్వర ప్రార్థన

విలసితసత్కృపాన్వితుడు విఘ్నములన్ దొలగించు దైవ ము
జ్జ్వల శశివర్ణసుందర శుభాంగుడు భక్తుల పూజనాదులన్
దొలుతగ స్వీకరించు విబుధోత్తముఁ డార్యను ముద్దుబిడ్డడై
యలరిన గుజ్జువేలుపు గజాస్యుని గొల్తు నభీష్టసిద్ధికిన్.

## శ్రీ సరస్వతీ ప్రార్థన

నలువకురాణియై నిగమనాదము లొప్పు పసిండివీణపై
లలితములైన జ్ఞానరుతులన్ బలికించిన వేల్పుటమ్మ వి
ద్యల నిడు తల్లి శారద మదర్పితసత్కృతు లంది కూర్మిమై
వెలయునుగాత నాహృదయవీథుల కావ్యములల్లువేళలన్.

## సర్వ దేవతా ప్రార్థన

సలలితభక్తిఁ గొల్చు జనసంతతికిన్ కరుణాంతరంగులై
కలుములనిచ్చి నిస్తులసుఖమ్ములఁగూర్చి మనోవికాసముం
గలుగగఁజేయు భక్తజన కల్పకరాజి త్రిమూర్తులాదిగా
నలరెడు వేల్పుసాములకు నంజలులన్ ఘటియించి
ప్రమొక్కెదన్.

## పురాణ ప్రశంస

దురితము లెల్లఁ బాపి పరితోష మొసంగుచు కర్ణపేయమై
ధరణిని సౌఖ్యసంపద లుదారముగా నిడు దివ్యగాథ లెం
దఱు రచియించి రేనియు సదా ముదమిచ్చు నటంచు భక్తి నీ
పరమపురాణగాథలనె వ్రాసితి నింకొకమారు వేడుకన్.

## కవి పండిత వందనము

పెద్దలకెల్ల మ్రొక్కి, పృథివిన్ మధురమ్మగు శబ్దసిద్ధితో
పద్దెము లల్లినట్టి కవిపండితకోటికి నంజలించి నే
నొద్దిక నీపురాణ రచనోద్యమమున్ గయికొంటి కావ్యసం
సిద్ధికి చిత్తమం దభిలషించుచు వారలొసంగు దీవనల్.



# భాగవత కావ్యప్రశస్తి

లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతాశోభితమున్ సువర్ణసుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరువుర్విన్ సద్ద్విజశ్రేయమై.

భూషణములు వాణికి, నఘ
పేషణములు మృత్యుచిత్త భీషణములు, హృ
త్తోషణములు, కళ్యాణ వి
శేషణములు, హరిగుణోపచిత భాషణముల్.

వరగోవింద కథాసుధారస మహావర్షోరుధారాపరం
పరలంగాక బుధేంద్రచంద్ర! యితరోపాయానురక్తిం బ్రవి
స్తర దుర్దాంత దురంత దుస్సహ జనుస్సంభావితానేక దు
స్తర గంభీర కఠోర కల్మష కనద్దావానలం బారునే.

శ్రీమదాంధ్ర భాగవతము,

— బమ్మెరపోతన.

# విషయసూచిక

శ్రీరస్తు

# శ్రీమహాభాగవతము

## ప్రథమస్కంధము

### శ్రీమహావిష్ణువు

మంజరి.

శ్రీ విష్ణుదేవుండు శ్రీనివాసుండు
శ్రీవాసుదేవుండు చిద్విలాసుండు
పావనచరితుండు కైవల్యదాత
సేవితచరణుండు శ్రీకరుం డతఁడు
వైకుంఠవాసుండు భక్తావనుండు
లోకైకదేవుండు లోకేశుఁ డతఁడు.
నారాయణుఁడు జగత్కారణ ప్రభువు
ధారుణీప్రజ కెల్ల తండ్రియాతండె.

వర్ణనాతీత మాప్రభువు రూపమ్ము
పద్మపాదములు పట్టుపుట్టములు
నాలుగు చేతులన్ లాలిత్య మొలుకు
శంఖచక్రమ్ములు శార్ఙ్గపద్మములు
వైజయింతీమాల వత్సలాంఛనము

కౌస్తుభహారమ్ము గరుడవాహనము
మణికిరీటమ్మును మధురహాసమ్ము
జగములఁ బ్రోచెడి చల్లనిచూపు
సత్కృపాహృదయమ్ము శ్యామలకాంతి
చెంగట లక్ష్మియు శేషతల్పమ్ము
వైష్ణవీయువతులు పార్శ్వానుచరులు
భాగవతోత్తముల్ భక్తశేఖరులు
దేవఋషీంద్రులు దేవతల్ కొలుచు
విశ్వమోహన మది విష్ణురూపమ్ము.

కరుణాంతరంగుఁ డాహరియె వచించె
"ధారుణీతలమున ధర్మపద్ధతికి
హాని వాటిల్లిన యప్పు డెల్లపుడు
ప్రజలఁ బ్రోచుటకయి ప్రతియుగమందు
భూమిపై తానయి పుట్టుక నంది
దుష్టుల దునుమాడి శిష్టులఁ గాచి
అన్యాయముల నెల్ల నంత మొందించి
ధర్మజీవనమును స్థాపింతు ననుచు.

# భాగవత మహిమము

ఈజగత్పాలన కిట్లుఁ దోడ్పడిన
శ్రీవిష్ణు లీలా విశేషమ్ము లరయ
పరమాద్భుతమ్ములు పరమరమ్యములు
కర్ణపేయమ్ములు కైవల్యదములు
సంపత్కరమ్ములు సౌఖ్యదమ్ములును
పరమార్థబోధముల్ ప్రజల కెల్లరకు.
కరుణాళుఁ డైన యాహరిని వర్ణించు
గాథ లెన్నియొ చాల గలవు లోకమున
తత్కథామకరంద ధారామృతమ్మె
వేదముల్ విభజించి విరచించి నట్టి
పరమఋషీంద్రుఁడు భగవత్ సముండు
వ్యాసుఁడు వ్రాసిన భాగవతమ్ము.

భాగవతమ్మున వ్రాయంగఁ బడిన
ప్రతికథయందున భాసించుచుండు
విష్ణుని వర్ణనల్ విష్ణుని మహిమ
దైవభక్తియు లోకధర్మపద్ధతులు
నిర్మలవర్తనల్ నిత్యసత్యములు
జాతిని రక్షించు నీతిమార్గములు.
కలుషసంభరిత మీకలియుగమందు

ప్రజలకు సన్మార్గపథముఁ జూపించి
దివ్యస్వభావమౌ దేవదర్శనము
కలిగించు శక్తి యీకథలకుఁ గలదు.
జీవనలక్ష్యంపు సిద్ధి నెఱింగి
శాంతిసంపదలతో జనులు వర్ధిల్ల
హరిదర్శనముకంటె నధికమ్ము లేదు.
హరికీర్తనముకంటె సత్యమ్ము లేదు
హరిపూజనముకంటె మఱియొండు లేదు
హరికథాశ్రవణమ్మె అఖిలసాధనము.

కావున జనులెల్ల కడుభక్తితోడ
మనసు లగ్నముఁజేసి మాధవుమీఁద
పురుషోత్తముని మీఁద బుద్ధిని నిలిపి
వీనుల విందుగా విని విష్ణుకథలు
జిహ్వతో కీర్తించి శ్రీహరిమహిమ
కను లిచ్చినందుకు కాంచి శ్రీహరిని
కరము లున్నందుకు హరిని బూజించి
పరమాత్మమయముగా బ్రతుకెల్ల గడపి
పరమపావనమైన భగవచ్చరిత్ర
పఠియించుచు వినుచు భాగవతమ్ము
సర్వ మీయిహలోక సౌఖ్యసంపదలు
పరమున కైవల్యభాగ్యమ్ము నంది

శాశ్వతాత్మానంద సంధాయకమ్ము
హరిపద సాయుజ్య మందుట మేలు.

---

## భా గ వ త ర చ న

భారతావని పుణ్యభాగ్యమ్ము కొలఁది
వినుతచరిత్రులు విజ్ఞానఖనులు
సత్తపోనిధులును శాస్త్రజ్ఞులైన
మునివరు లెందఱో పుట్టిరి మున్ను.
వారిలో వ్యాసుండు ప్రఖ్యాతిమీఱ
దేవుని మహిమను తెలుపఁగఁబట్టి
వేదముల్ నాల్గును విభజనఁ జేసి
భారతమ్మాదిగా బహుకావ్యములను
వ్రాసి వ్యాప్తి నొనర్చె భారతావనిని
పుడమిపై నింతటి పుణ్యకార్యములు
చేసియు వ్యాసుండు చిత్తమ్ము నందు
తృప్తి నందక కడుదీనుఁడై యుండె

అరుదెంచి నారదుం డట కొకనాఁడు
వ్యాసుని మదిఁ గల పరితాప మెఱిఁగి
పరమాదరమ్ముగ వచియించె నిట్లు
"ప్రజ్ఞ మీఱఁగ నీవు వ్యాసమౌనీంద్ర

వ్రాసినాడవు గాని బహుపురాణములు
భగవంతు మహిమను భక్తిభావమున
వినుతిఁ జేసెడువాని విరచింప లేదు.

విష్ణురూపుండైన కృష్ణుని చరిత
రచియింప మీవింక రమణీయఫణితి
హరికీర్తనము కంటె నాత్మశాంతికిని
జగమందు మఱివేఱె సాధన లేదు.
మేలగు నవసికి మేలగు నీకు
విరచింపు మిట్లని వెడలె నారదుడు.

నారదమునివాక్యసార మెట్టిదియొ
వ్యాసుఁ డావాక్యమ్ము లాలించి నంత
మాధవు మహిమలే మనసులో మెఱసె
కనులలో కృష్ణుని గాథలే కదలె.
ప్రారంభ మొనరించె వ్యాసుఁ డాక్షణమె
భగవచ్చరిత్రమ్ము భాగవతమ్ము
తనతృప్తికే గాక జనుల కెల్లరకు
సంపత్కరమ్మును సౌఖ్యద మ్మయిన
పరమార్థముగ నెంచి భాసురరీతి
విష్ణునికథలెల్ల వివరించి కూర్చి
విష్ణునిరూపమౌ కృష్ణుని మహిమ
వర్ణించి కీర్తించి పరమరమ్యముగ

భాగవతము వ్రాసి పఠియింపఁ జేసె
తనసుతుండగు శుకమునివర్యు చేత
ఆనోట నానోట ఆనాటినుండి
బహుప్రచారము నందె భాగవతమ్ము.

---

## శ్రీ శుకునివలన పరీక్షిత్తు భాగవతము వినుట

భారతభూమిని ప్రభవించి నట్టి
మునులెల్లరును మహాపుణ్యపూరుషులు
త్యాగసంపన్నులు ధార్మికోత్తములు
ప్రజలు మేలునకయి భగవచ్చరిత్ర
వ్యాప్తి గావించుటే వారియాశయము
శుకమునివర్యుఁడున్ సూతుఁడు నెల్ల
పఠియించి చెప్పుచు బహుపురాణములు
ధన్యులఁ జేసిరి ధరణివాసులను.

పాండవాగ్రజుఁడును భవ్యగుణుండు
ధర్మపాలకుఁడును ధర్మాత్ముఁ డైన
ధర్మజు తరువాత ధరణీశుఁ డగుచు
అభిమన్యునికుమారుఁ డగు పరీక్షిత్తు
బహుకీర్తిమంతుఁడున్ బలశాలి యగుచు

ధర్మమార్గమ్మున ధరణిఁ బాలించె
పరమయోగిగ ధాత్రిఁ బ్రఖ్యాతిఁగనిన
శ్రీశుకమునికిని శిష్యుఁ డానృపతి
ఆరాజు వేటకై యడవికి నేగి
దప్పిఁ గొని యొకతపసినిఁ జూచి
దప్పి తీర్చుఁడటంచు దరిజేరి యడిగె.
ధ్యానమగ్నుఁడైన తపసి కామాట
తెలియక యట్టులే పలుకక యుండె.
ఆగ్రహావేశుఁడై యా పరీక్షిత్తు
మృతసర్పమును మునిమెడచుట్టు వైచి
తనదారి నేగెను తపసిని విడచి.
మునిపుత్రుఁ డేతెంచి మనుజేశు పనికి
కుపితుఁడై వెంటనే శపియించె నిట్లు
"తపమొనర్చుకొనుచు ధరణిని మఱచి
ధ్యాననిష్ఠుండైన తపసి నీరీతి
అవమానపఱచిన యవనీశుఁ డింక
ఏడురోజులకాల మేగక మునుపె
సర్పదష్టుండయి చచ్చుఁగా" కనుచు
మునిపుత్రు శాపమ్ము విని పరీక్షిత్తు
చింతించుచుండగా చిత్తమ్మునందు
శ్రీశుకుం డేతెంచి చింతతో నున్న
పుడమిఱేనినిఁ జూచి బోధించె నిట్లు

"మరణింతు ననుచింత మానుము రాజ!
పుట్టినవారికి గిట్టుట భువిని
తప్ప దీజన్మమ్ము తప్పించుకొనగ
హరిని ధ్యానింపుచు తరియింపు" మనియె
అధ్యాత్మనిష్ఠుండై నాపరీక్షిత్తు
పుణ్యప్రదమ్మును మోక్షదాయకము
ఆత్మశాంతికిఁ గూడ ననువైనపథము
బరమాత్మచింతగా భావించి మదిని
పుణ్యుండౌ శుకముని బోధించుచుండ
భక్తితో నాలించి భాగవతమ్ము
సంసారవర్తన సర్వమ్ము విడచి
చింతలన్నియుఁ బాసి శ్రీహరియందె
ఆత్మలగ్నముఁ జేసి హరికృపచేత
పుణ్యజీవనుఁడయి పొందెను ముక్తి.

---

## భాగవత వ్యాప్తి

నృపతికై శుకముని నేర్పుమీఱంగ
పఠియించుచుండగా భాగవతమ్ము
ప్రీతితో నాలించె సూతుఁడన్ మునియు
ఆద్యంత మాకథ నాసక్తితోడ

భరతోర్వి కుత్తరభాగమ్ము నందు
రమ్యమా నైమిశారణ్యమ్ము కలదు
మున్యాశ్రమముల కాపుణ్యకాననము
నెలవయి యెప్పుడు పొలుపారుచుండు
శౌనకాదిమునీంద్రు లానైమిశమున
పౌరాణికుఁడు సూతువద్దకు జేరి
పరమపావనమైన భాగవతమును
వినఁగోరి భక్తితో వేడిరి మిగుల.
పరమహర్షము నంది వారికోర్కెలకు
సూతుఁడు తా మున్ను శుకమునివలన
వినిన భాగవతాఖ్య విఖ్యాతగాథ
చెప్పె నర్మిలి మానిచిత్తమ్ము లలర.

ఈభాగవత మిది యిల నుద్భవించి
ఈరీతివ్యాప్తమై యెన్ని వేలేండ్లు
గడచెనో కాలమ్ము గణియింపలేము
బహుజనమ్ములయందు బహుభాషలందు
అంతకంతకు మహావ్యాప్తినిఁ గాంచి
నేఁటికి నట్టులే నిలచిపోయినది.
భక్తితత్పరులైన ప్రజల కెల్లరకు
ఐహికాముష్మికమైన యానంద
మలరంగ జేయుచు నవనికంతటికి

పుణ్యప్రదమ్ములు పూజనీయములు
మార్గదర్శకములై మానవాళికి
ప్రాపయి రక్షించు నీపురాణములై.

శౌరిచరిత్ర మాశౌనకాదులకు
పౌరాణికుఁడు సూతుఁ డీరీతి నుడివె.



# శ్రీ మహాభాగవతము

## ద్వితీయస్కంధము

### విష్ణుని మహిమ

నలినోద్భవుం జూచి నారదమౌని
"ఓచతుర్ముఖదేవ ఓయి మహాత్మ !
ఈవిశ్వమున కెల్ల నెవ్వఁ డీశుండొ
వినఁగోరెదను స్వామి ! వినిపింపు" మనఁగ
బ్రహ్మ యిట్లు వచించె పరమాదరమున.

"నారదా ! వినుము నీకోరిక కిప్పు
డానందభరితుఁడ నైతి నిక్కముగ
శ్రీవిష్ణుచరితమ్ము చెప్పినన్ వినిన
శుభదాయకమ్మయి శోభిల్లుఁ గాన.
వినుము నారద ! సర్వవిశ్వమ్మునకును
ప్రభువొకండు కలండు పరమేశ్వరుండు
అతఁడె విష్ణువు, హరి, యచ్యుతుండు
సకల చరాచర సంఘమ్మునకును
నాయకుం డాతఁడె నారాయణుండు.
శ్రీహరియాజ్ఞను శిరసావహించి

ఈజగమ్మును నేను సృజియింతు నంటె,
కర్తయు ప్రభువును కారణుండయిన
శ్రీరమ్యమూర్తి యా నారాయణుండె.
అన్నిలోకములు నిరంతరగతిని
పుట్టుచు పెరుగుచు గిట్టుచు నుండు
నతని కధీనమై ప్రతికల్పమందు.
విష్ణు మయమ్మయి విశద తేజమున
విశ్వమ్ము సర్వమ్ము వెలుగుచునుండు.
అతనినిఁ దప్పించి యన్యమ్ము లేదు
సర్వజీవులకును సంపూజ్యుఁ డతఁడు.
దుర్మార్గులను ద్రుంచి దురితమ్ముఁ బాపి
ధరణిని స్థిరముగా ధర్మమ్ము నిలుప
విష్ణు వెనోక్కమూర్తు లెత్తి జనించి
తన మహత్త్వమ్మును ధరణికిఁ జూపె
అద్భుతావహలీల లాకథ లెల్ల
విను మాతనివి కొన్ని ఘనకార్యములను
తనివోవ దెంతగా వినినను గాని.

---

## విష్ణుని అవతారములు

మత్స్యమై కాపాడె మహితవేదములు
సత్యవ్రతున కాత్మసత్యమ్ము నుడివె

కూర్మమై వీపున కొండను దాల్చి
అమృతసంపాదన కాధారమయ్యె.
క్రూరహిరణ్యాక్షుని ఘోణియై చంపి
అంబోధి మునిగిన కుంభిని నెత్తె.
నరసింహరూపమై నఖములఁ జీలి
కడతేర్చెను హిరణ్యకశిప రాక్షసుని
వామనుండై పుట్టి వటునిగా నేగి
బలిగర్వ మణగించి వాసవుఁ గాచె,
తల్లికి కపిలుఁడై తత్త్వమ్ముఁ జెప్పె
భార్గవరాముఁడై పరశువు బూని
దునుమాడె దుష్టులౌ మనుజనాథులను
దశరథరాముఁడై ధరణి జనించి
రాజధర్మము నిల్పి రావణుం జంపె,
బలదేవుఁడై చంపె ప్రబలరాక్షసుల.
కృష్ణుఁడై లీలల నెన్నియో చూపి
గీతాప్రబోధమున్ కిరీటికి నుడివె
కలికియై మారి యింక కత్తి చేబూని
వెలయించు ధర్మముల్ కలియుగ మందు

ఇట్టివే వసుధయం దెన్నియో కలవు
హరియవతారమ్ము లవనిఁ బ్రోవంగ
లోకజాలమ్మును లోకు లందఱును

ధ్వంసమ్ము గాకుండ దైత్యులవలన
కాచిన దేవుఁ డాకరుణామయుండె.
వర్ణనాతీతముల్ వైభవోపేత
ఘనమహాత్మ్యమ్ము లాగాధ లన్నియును.
వాసుదేవుని కీర్తి భావించి మదిని
హరిపాదములయందె ఆత్మల నిలిపి
భక్తితో నిత్యమ్ము భజియించువారు
పరమసౌఖ్యములతో వర్ధిల్లగలరు.
జ్ఞానమున్ గ్రహియించు శక్తిగలట్టి
మనుజజన్మమె చూడ మహనీయమంబు
కావున నెల్లప్పు కమలాక్షు మహిమ
చదువుచు వినుచును జన్మసాఫల్య
మందుట కర్తవ్య మండ్రటి కవని
కృష్ణునిమహిమమ్ము కీర్తించు వారి
హృదయమ్ములందున కృష్ణుఁడే నిలచి
సర్వమాలిన్యముల్ క్షాలనఁజేసి
సౌఖ్యసంపదలను సమకూర్చుచుండు.

---

# శ్రీ మహాభాగవతము

## తృతీయ స్కంధము

### సృష్టి విధానము

శ్రీశుకుం డట్లు పరీక్షిన్నృపతికి
విష్ణుని మహిమను వినుతించి కొంత
సృష్ట్యాదిగాగ ఆ శ్రీకృష్ణుకథలు
చెప్ప దొడంగెను చెలువార నిట్లు
ఆద్యంతరహితమై యలరు బ్రహ్మమై
విశ్వమయుండైన విష్ణుదేవుండు.
మునులు దేవతలును కనుంగొన నెంచు
పరమదైవమ్మును పరమాత్మ యతండె.
భావన కందని భాసురమూర్తి
జ్ఞానతేజస్వి ఆసర్వేశ్వరుండు.
బ్రహ్మాండముననుండి స్వయముగా తాన
వెలువడివచ్చి యా విష్ణుదేవుండు
జలమునందున శేషశయన మ్మొకండు
నిర్మించుకొని యోగనిద్రలో నుండె.
నీరమం దాతండు నివసించు కతన

నారాయణుం డనునామమ్ము నందె
యోగనిద్రావస్థనుండి మేల్కొనుచు
వివిధరూపములుగా వెలయుచుఁ దానె
సర్వజగత్సృష్టి సలుపు సంకల్ప
ముదయించె నాహరి హృదయమ్మునందు.
అటుల సంకల్పించి నంతమాత్రమున
విష్ణుతేజమునుండి వివిధాకృతులుగ
సకలలోకమ్ములు సాగరమ్ములును
సర్వజీవులు వృక్ష జంతుసంతతులు
సూర్యుఁడు చంద్రుఁడు చుక్కలు వెలుగు
పంచభూతమ్ములు వస్తుసంచయము
దేవతల్ మనుజులు దివిజులు ఋషులు
అదియిది యననేల నఖిలవిశ్వమ్ము
జీవచేష్టలతోడ భావనతోడ
ఆకారములు గొన్న యటులాయె తుదకు
నారాయణుని దేహనాభియం దొక్క
పద్మమ్ము పుట్టె నాపద్మ ముందుండి
భాసురమూర్తి ఆ బ్రహ్మ జనించె.

ఎందుండివచ్చె తానెటుల జన్మించె
ఎచ్చోటఁ దానుండె నిన్నాళ్ళ దనుక

ఉల్లమం దేమియు నూహింపలేక
తుద కేదిరో తనమదియందుఁ దోచి
మహితసప్తాధ్యానమగ్నుఁడై బ్రహ్మ
కమలమ్ము మీఁదనే కావించె నూరు
దివ్యవత్సరముల దీర్ఘతపమ్ము.

తనతపః ఫలముగా కనుగొనె బ్రహ్మ
ప్రళయసాగరమున స్వచ్ఛవర్ణంపు
పదివేలపడగల పాపపానుపున
శయనించియుండిన శ్యామలవర్ణు
నారాయణుని తన నయనోత్సవముగ.
మణిమయముకుటమ్ము మస్తకమందు
గళమున వనమాల కౌస్తుభమణియు
వక్షమ్మునందు శ్రీవత్సలాంఛనము
విమల చందనచర్చ పీతాంబరములు
సత్కృపాసారమౌ చల్లనిచూపు
నాల్గుచేతులయందు వెల్గుచునున్న
శంఖమ్ము పద్మమ్ము చక్రము గదయు
దివ్యభూషణములు దేదీప్యకాంతి
భక్తులఁ బ్రోచెడి భాసురమయిన
మందహాసము గల సుందరాననము
వేదముల్ కీర్తించు విశ్వరూపమ్ము

సకలజగమ్ములు సర్వజీవులును
తనయందె వ్యక్తమై తనరుచునున్న
విష్ణుదేవుని దివ్యవిగ్రహ మ్మరసి
భక్తితోఁ బ్రార్థించె బ్రహ్మదేవుండు.
"దేవదేవా ! నేను కావింపఁ దగిన
పనియేమి" యని విష్ణుపదముల వ్రాలి
"కర్తవ్యమిది సృష్టిఁ గావింపు" మనుచు
బ్రహ్మకానతినిచ్చె పద్మాక్షుఁ డపుడు
శ్రీవిష్ణు నాజ్ఞను శిరసావహించి
ప్రారంభమును జేసె బ్రహ్మదేవుండు
సర్వజగత్ సృష్టి సత్వరగతిని.

జనియించె నా బ్రహ్మసంకల్ప మందె
సర్వజగమ్ములు సర్వజీవులును
సనకసనందన సంయమివరులు
పద్మాకరండుగుకు రుద్రు లుదయించినారు
పదిమందిఋషులును ప్రభవించినారు
అప్సరల్ దేవతల్ యక్షరాక్షసులు
జనియించి రా బ్రహ్మ సంకల్పమందె
రమణీయరూప సరస్వతి పుట్టి
రాణియై యలరారె బ్రహ్మదేవునకు.
ప్రమథులు పుట్టిరి భాషయు పుట్టె

త్రిగుణమ్ములు జనించె తీవ్రరూపమున
వేదముల్ మంత్రముల్ విహితకర్మములు
విశదమ్ముగా వచ్చె వేధ యందుండి
ఇంత యొనర్చియు నెడదలో బ్రహ్మ
సృష్టి పూర్తిగఁ గాక చింతించుచుండె.
బ్రహ్మదేహమునుండి ప్రభవించి రంత
స్వాయంభువమనువు శతరూప యనఁగ
పురుషుండు స్త్రీయును సురుచిరాకృతుల.
వారల దాంపత్యఫలముగా నపుడు
మహి వృద్ధిగాంచెను మనుజసంతతియు.
స్వాయంభువుం డేలె సర్వభూతలము
అతని వంశస్థులే యాతరువాత
మనువులై యేలిరి మహిసమస్తమ్ము.

అర్కుని గమనమ్మె యాధారమగుచు
పవలును రేలును బ్రహ్మకల్పములు
కాలమ్మె సర్వమ్ము గణనీయమయ్యె.
బ్రహ్మదేవుని కగు రాత్రికాలమున
ప్రళయమ్మై నశియించు బ్రహ్మాండమెల్ల,
బ్రహ్మకల్పమ్మున పవలైన యపుడు
ప్రారంభమగు సృష్టి యఖిలమ్ము మరల.
సృష్టియు విలయమ్ము లిట్లనంతముగ

జరుగుచునుండును జగమునం దెపుడు
ప్రళయకాలమునందు పాలమున్నీట
పవళించు విష్ణుండు పాపహానువున
సుప్రసన్నమ్ముగు సుందరాకృతిని.
బహువిస్తృతములై పరగుచున్నట్టి
విశ్వమ్ము లిట్టి వావిష్ణువునందు
కోటానుకోట్లుగా కొమరారుచుండు.
అవ్యయుం డక్షరుం డచ్యుతుం డతఁడు
సర్వకాలాతీత శాశ్వతుం డతఁడు.

---

## బ్రహ్మదేవుఁ డొనరించిన సృష్టిక్రమము

శ్రీమహావిష్ణువుయొక్క ఆజ్ఞానుసారము బ్రహ్మ తా నుద్భవించిన నారాయణుని నాభికమలము నందుండియే సృష్టి కార్యమును గూర్చి యోచించుచు నలువైపులకు జూచెను. అట్లు చూచి నంతనే నాల్గు ముఖము లేర్పడినవి. బ్రహ్మ చతుర్ముఖుఁ డైనాడు.

తానున్న పద్మమునే బ్రహ్మ భూలోక భువర్లోక స్వర్గ లోకములుగా విభజించి, ఈ మూడును ప్రాణులకు భోగస్థానములుగా నుండు నట్లొనర్చెను. ఇవిగాక ప్రాణులకు నిష్కామ

కర్మఫల స్వరూపములగు మహర్లోక తపోలోక సత్యలోకాదులును ఉన్నవి. నారాయణుని నాభికమలము విశ్వమంతయు పట్టునదిగా కనుపించినది బ్రహ్మకు.

లోకములతో పాటు త్రిగుణ మహత్తత్త్వము, వస్తు సంచయము, పంచభూతములు తన్మాత్రలు ఇంద్రియములు వాని అధిష్ఠానదైవములు సూర్యచంద్రులు తారలు స్థావర జంగమములు వృక్ష జంతు పక్ష్యాదు లుద్భవించినవి.

బ్రహ్మనుండి కామ క్రోధ తమో మోహ ద్వేషాది వృత్తు లుత్పన్నములైనవి. ఇవి ప్రబలములగుట చతుర్ముఖున కంతగా అంగీకారము కాలేదు. సృష్టి యెంతయో కావలసి యున్నది. ఏమియు తోచక దైవచింతనతో బ్రహ్మ కాలము గడపుచుండ ఆతని మానసము నుండి సనకసనందన సనాతన సనత్కుమారులను వా రుదయించిరి. బ్రహ్మ వారినిజూచి ప్రజాసృష్టి కావింపుడని కోరెను. వారు నలువురును నిత్య బాలస్వరూపులు, నిరంతర నారాయణ భక్తితత్పరులు. సంసారబంధమునబడి ప్రజాసృష్టి చేయుటకు నిరాకరించిరి.

తనపుత్రులే తనమాట నిరాకరించి నందులకు చతుర్ముఖుడు కుపితుడైనాడు. కనుబొమలు ముడిపడినవి. ఆమహోగ్రకోపభావము నుండి రోదనము సేయుచు ఒక బాలుడుదయ

యించినాఁడు. వానికి రుద్రుఁడు అని ప్రధాన నామమిడినాడు బ్రహ్మ. పదపడి రుద్రుఁడు ఏకాదశమూర్తిత్వము లందెను. వారే అజుఁడు ఏకపాదుఁడు అహిర్బుధ్న్యుడు త్వష్ట రుద్రుఁడు దారుఁడు శంభుఁడు త్ర్యంబకుఁడు అపరాజితుఁడు ఈశానుడు త్రిభువనుడు అను ఏకాదశ రుద్రులుగా పరిగణింపఁబడు చున్నారు.

ధీవృత్తి ఉశన ఉమ నియుత సర్పి ఇల అంబిక ఇరావతి సుధ దీక్ష రి అను పదార్గొండుగురిని రుద్రాణులుగఁ జేసి, బ్రహ్మ రుద్రుని జూచి "రుద్రా! నీవు ప్రజాపతివి; ప్రజోత్పత్తి నిచేయు" మనెను. ఉగ్రవృత్తులగు రుద్రగణములను రుద్రుడు ముందుగా సృష్టించినాఁడు. ఆరుద్రగణముల యుద్ధతికి లోకములకే హాని వాటిల్లునట్లు తోచినది. ఆసృష్టి నాపించి బ్రహ్మ మరల శ్రీహరిని గూర్చి తప మారంభించినాఁడు.

బ్రహ్మయొక్క వేర్వేఱు శరీర భాగములనుండి పది మంది మహాఋషు లుద్భవించినారు. వారు నారదుడు దక్షుఁడు వసిష్ఠుఁడు భృగువు క్రతువు పులహుడు పులస్త్యుడు అంగీరసుడు అత్రి మరీచి అనువారు. కర్దముడు కశ్యపుడు మున్నగు ప్రజాపతులు, బృహస్పతియు బ్రహ్మచే సృష్టింపఁ బడిరి.

బ్రహ్మనుండి ప్రణవము గాయత్రి ఛందస్సు స్వరములు అక్షరములు భాషయు ఉదయించినవి.

బ్రహ్మనుండి సౌందర్యవతి చక్కనిచుక్క అగు ఒక కన్య సరస్వతి ప్రభవించినది. బ్రహ్మ కామాతురుఁడై ఆమెను మోహించినాఁడు. ఇది తగనిపని అని మరీచి మున్నగు సతని సుతులే బ్రహ్మను విమర్శించిరి. తన కామోద్రేకము నకు తానే సిగ్గుపడి బ్రహ్మ తన దేహమును విడచినాఁడు.

ఆ శరీరమే భాగమంచు తమస్సు అయినది. అందుండి యక్షులు రాక్షసు లుద్భవించిరి.

కాంతిమంతమను వేఱొక శరీరమును బ్రహ్మ ధరించినాఁడు. లోకోపకారమగు సృష్టిని మనస్సునం దుంచుకొని శ్రీహరిని ప్రార్థించినాఁడు. బ్రహ్మయొక్క తూర్పుముఖము నుండి ఋగ్వేదము దక్షిణముఖమున యజుర్వేదము పశ్చిమ ముఖమున సామవేదము ఉత్తరముఖమున అధర్వణవేదము ఉదయించినవి. ఆక్రమములోనే బ్రహ్మ ముఖములనుండి హోత అధ్వర్యుఁడు ఉద్గాత బ్రహ్మ యజ్ఞములందు చేయవలసిన విధికర్మములు పఠింపవలసిన మంత్రస్తోత్రములు వెలువడి నవి. ఆయుర్వేదము, ధనుర్వేదము గాంధర్వవేదము, స్థాపత్య వేదము అను ఉపవేదములు, ఇతిహాసపురాణరూపమగు పంచమవేదము బ్రహ్మనుండి వెలువడినవి,

షోడసి ఉక్థ చయన అగ్నిష్టోమ ఆప్తోర్యామ అతిరాత్ర వాజపేయ గోపనాది యజ్ఞక్రియలును ఆవిర్భవించినవి.

విద్య దానము తపస్సు సత్యము సత్వము అను ధర్మములు, బ్రహ్మచర్యము గార్హస్త్యము వానప్రస్థము సన్యాసము అను ఆశ్రమములు తదాశ్రమాచారములు, ఆహారసేకరణ, కుటుంబపోషణ మున్నగు వృత్తులును ఉత్పన్నములైనవి.

పిమ్మట బ్రహ్మతొడలనుండి అసురు లుద్భవించిరి. వారు కామాతురులై బ్రహ్మదేహముపై బడసాగిరి. శ్రీహరి కరుణచే బ్రహ్మ ఆ దేహమును విడువగా అది సంధ్యాసుందరి యైనది. అసురు లాసంధ్యవెంట బడిరి. బ్రహ్మయొక్క సోమరితనమునుండి భూతప్రేత పిశాచము లుత్పన్నమైనవి.

ఆ సోమరితనమును బ్రహ్మ వానికే వదలి తేజోమయమగు వేఱొకదేహమును గ్రహించి జ్ఞానచింతతోనుండెను. ఆ భావము నందుండి దేవతలు గంధర్వులు సిద్ధులు సాధ్యులు పితరులు కిన్నరులు కింపురుషులు విద్యాధరులు ప్రభవించిరి.

మానవసృష్టి ఇంకను కాలేదని బ్రహ్మ యోచనామగ్నుడయ్యెను. బ్రహ్మనుండి స్వాయంభువ మనువు, శతరూప అను పురుష స్త్రీ రూపములు వచ్చినవి. వారి దాంపత్యఫలముగా ఆకూతి దేవహూతి ప్రసూతి అను పుత్రిక లుదయించిరి. వారు వరుసగా రుచి, కర్దముడు అను ప్రజాపతులకు భార్యలైరి. వారి సంతతియే తుదకు జగమెల్ల నిండినది.

స్వాయంభువ మనువు లోకములకు ప్రథమ సార్వభౌముడు. వారి వారి కాలములలో లోకపాలన సాగించుచు పదునాల్గురు మనువు లుందురు. వారు స్వాయంభువుడు, స్వారోచిషుడు, ఉత్తముడు, తామసుడు, రైవతుడు, రాక్షసుడు, వైవస్వతుడు, సూర్యసావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, రుద్రసావర్ణి, రౌచ్యుడు, భౌచ్యుడు. ప్రస్తుతము వైవస్వత మన్వంతరము సాగుచున్నది. ప్రతిమన్వంతరమున సప్తఋషులు, గంధర్వులు, దేవతలు వేర్వేఱుగ ఏర్పడుచుందురు.

ప్రకృతి మహత్తత్వము అహంకారము అను 3; పంచభూతములు 5; పృథివి, నీరు, తేజము, వాయువు, ఆకాశము. పంచతన్మాత్రలు 5; శబ్ద స్పర్శ రూప రసగంధములు. జ్ఞానేంద్రియములు 5; చర్మము, కన్ను, చెవి, నాల్క, ముక్కు. కర్మేంద్రియములు 5; వాక్కు, చేయి, కాలు, పాయువు, ఉపస్థము. మనస్సు 1. ఈ 24 కలసి బ్రహ్మాండ మేర్పడినది. భగవంతునిలో ఇట్టి బ్రహ్మాండములు కోటానుకోట్లున్నవి. కార్యకారణుడు, ఆద్యంతరహితుడు, అవ్యయుడు అయిన నారాయణుడు ఆ ప్రభువు.

బ్రహ్మకు పగటికాలమున (కల్పము) సృష్టి సాగుచుం ». రాత్రి అగుసరికి ప్రళయ మారంభమై సృష్టి ఆగిపో ›. లోకములు బ్రహ్మయందు లీనమగును. సప్తసముద్రము ుపొంగి త్రిలోకములను ముంచి ఏకార్ణవమగును ఆప్రళయ

సాగరమున భగవానుడు యోగనిద్రలో శేషశయనుడై యుండును.

ఇట్లు సృష్టి ప్రళయములు సాగిన బ్రహ్మయొక్క నూరేండ్ల కాలము పరమాయువు అగును. అది రెండుభాగములు. ఇప్పుడు ద్వితీయపరార్ధము జరుగుచున్నది. మొదటి భాగము బ్రహ్మకల్పమనియు రెండవది పద్మకల్పమనియును చెప్పబడినవి. మొదటి కల్పాంతమున నారాయణుని నాభి సరస్సునుండి పద్మ ముదయించినది. పద్మకల్పారంభమున నారాయణుడు శ్వేతవరాహరూపము దాల్చెను. అందుచే నది శ్వేతవరాహ కల్పమైనది. ప్రస్తుత మీకల్పమే నడచుచున్నది.

బ్రహ్మదేవుని పరమాయువైన ఈ రెండు పరార్ధముల కాలము శ్రీవిష్ణున కొక నిమేషము. ఆ మహావిష్ణువు వాస స్థానము వైకుంఠము.

---

## కాలప్రమాణము

సకల చరాచర భూతసంచయము నందు సూక్ష్మమైన భాగము పరమాణువు. ఇది అవ్యక్తము. ఇట్టి పరమాణువు అవస్థపొందిన సమయమును కాలమానములోగూడ పరమాణు వందురు. సూర్యచలనములో ఇట్టి పరమాణువు ఆక్రమింప బడినంతకాలము పరమాణువుగ మొదలై కాలనిర్ణయము జరిగినది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 2 పరమాణువులు | = | 1 అణువు | 3 అణువులు | = | 1 త్రిసరేణువు |
| 3 త్రసరేణువులు | = | 1 త్రుటి | 100 త్రుటులు | = | 1 వేధ |
| 3 వేధలు | = | 1 లవము | 3 లవములు | = | 1 నిమేషము |
| 3 నిమేషములు | = | 1 క్షణము | 5 క్షణములు | = | 1 కాష్ఠ |
| 15 కాష్ఠములు | = | 1 లఘువు | 15 లఘువులు | = | 1 ఘడియ |
| 2½ ఘడియలు | = | 1 గంట | 24 గంటలు | = | 1 రోజు |
| | | | 60 ఘడియలు | | (రాత్రి – పగలు) |
| 2 దండములు | = | 1 ముహూర్తము | 6 ముహూర్తములు | = | 1 జాము |
| 8 జాములు | = | 1 రోజు | 7 రోజులు | = | 1 వారము |
| 15 రోజులు | = | 1 పక్షము | 2 పక్షములు | = | 1 నెల |
| 2 నెలలు | = | 1 ఋతువు | 3 ఋతువులు | = | 1 అయనము |
| 2 అయనములు | = | 1 మనుష్య సంవత్సరము, దేవతలకొక దినము | | | |

1 సంవత్సరము — భూచక్రము 12 రాసులుగా విభజించి సూర్యునిముందు భూభ్రమణము 12 రాసులతో పూర్తియగు కాలము.

యుగములు నాలుగు

మానవ వత్సరములు :-

| | | |
|---|---|---|
| 1, 728, 000 | = | కృతయుగము. ధర్మమునాలుగు పాదములు గల కాలము. |
| 1, 296, 000 | = | త్రేతాయుగము. ధర్మము 3 పాదములు గల కాలము. |
| 864, 000 | = | ద్వాపరయుగము. ధర్మము 2 పాదములు గల కాలము. |
| 432, 000 | = | కలియుగము. ధర్మము 1 పాదము గల కాలము. |
| 4, 320, 000 | = | ఒక మహాయుగము. |
| 1000 మహాయుగములు | = | కల్పము. బ్రహ్మదినము సృష్టి సమయము. |
| 1000 మహాయుగములు | = | బ్రహ్మకు రాత్రి. ప్రళయ సమయము. |
| బ్రహ్మకల్పము | = | 14 మన్వంతరములు. పదునాల్గురు మునువులు జగమును పాలించు కాలము. |

బ్రహ్మనూరు వత్సరములు = పరమాయువు.
పరమాయువు = రెండు పరార్ధము. విష్ణుదేవుని ఒక రెప్పపాటు.

ప్రస్తుతము ద్వితీయపరార్ధ శ్వేతవరాహకల్ప వైవస్వత మన్వంతర కలియుగ ప్రథమపాదము నడచుచున్నది. కలియుగాది 5082 వ సం॥ రము.

---

## వైకుంఠము

క్రీడాసరస్సులు శృంగార వనులు
మేలిమిబంగారు మేడ లింపారు
వైకుంఠవాసమ్ము వర్ణనాతీత
సౌందర్యధామమై సకలసంపదల
దీపించుచుండు నా దివ్యసౌధముల
శ్రీకాంతతోఁగూడి శ్రీవిష్ణుమూర్తి
నివసించుచు సతమ్ము నిఖిలలోకముల
వాత్సల్య మేపార పాలించుచుండు.
భాగవతోత్తముల్ పరమవైష్ణవులు
దేవఋషీంద్రులు దేవేంద్రుడాది
దివిజముఖ్యులు వచ్చి దీక్షతో నచట

హరికీర్తన మొనర్తు రన్ని వేళలను
శాశ్వతాత్మానంద సౌఖ్యనిధాన
నిర్మలావ్యయ శాంతినిలయ మా స్థలము
జపతపోవ్రతు లైన సంయమివరులు
తత్త్వచింతనులును ధర్మవర్తనులు
పుణ్యకార్యాసక్త భూజనుల్ తుదకు
చేర గోరెడు మోక్షసీమయె యద్ది.

---

## జయ విజయులు రాక్షసులై జన్మించుట

బాలాకృతులతోడ వరలెడు వారు
సంతత హరిచింత నాంతరంగులును
సనక సనందాది సంయమముల్ నలువు
రచ్యుతు దర్శించు నభిలాషఁ గలిగి
వైకుంఠపురి కేగ ద్వారపాలకులు
జయవిజయాఖ్యు లాసంయమీశ్వరుల
కడ్డమ్ము నిలబడి యాంతకపఱచి
పోబోకుఁ డనఁగ నామును లాగ్రహించి
"హరిసేవకుల గ్రోవ కడ్డుగా వచ్చు
మీర లనర్హు లీ ద్వారపాలనకు

పుడమిని పాపులై పుట్టు" డటంచు
జయవిజయుల కుగ్రశాపమ్ము లిడిరి.

"భక్తుల నదలించి భయపెట్టినార
మయ్యయో యెంతటి యపరాధ మయ్యె
మమ్ము క్షమింపు డో మౌనీంద్రులార"
యని ద్వారపాలకు లర్థించుచుండ
హరివచ్చి మునులకు నాదర మ్మొసఁగ
దర్శన మ్మొసఁగి యాద్వారపాలకుల
వీక్షించి పలికె నీవిధమున నపుడు
వారి పశ్చాత్తాపవైఖరి నరసి.
"భక్తులయెడ నాకు పరమాదరమ్ము
హరిభక్తులకు మీర లడ్డుగావచ్చి
చేసిరి పాపమ్ము శిక్ష నొందితిరి.
వారలశాపమ్ము వారింపరాదు
మూడుజన్మములు పుడమిపై మీరు
రాక్షసులై పుట్టి ప్రబలవైరమున
నాపైని పగబూని నాచేతఁ జచ్చి
శీఘ్రమ్ముగా నన్ను చేరెదరనుచు
పలుకగా శ్రీహరి వార లిర్వురును
పతితులై క్రిందికి వసుధపైఁ బడిరి.
పుడమిపైఁ బడిపోయి పుట్టిరి వారె

యసురజన్మల హిరణ్యాక్ష హిరణ్య
కశిపులన్ పేరులఁ గ్రాలి యాపిదప
రావణ కుంభకర్ణాసురు లనఁగ
తరువాత శిశుపాల దంతవక్త్రులుగ.
మూడుజన్మములు పొంది వారిట్లు
దుర్జయులై కడుదుర్మార్గు లగుచు
ప్రజలను మునులను బాధించి తుదకు
హరిచేత హతులయి యరిగిరి మరల
ద్వారపాలకులుగ వైకుంఠపురికి.



## హిరణ్యాక్ష హిరణ్యకశిపులు

బ్రహ్మకుమారుఁడై వరలు దక్షునికి
పలువురు పుత్రికల్ ప్రభవించినారు
వారిలో దితియను వామాక్షి యయ్యె
భార్యగా కశ్యప పరమయోగికిని.
జయ విజయులు తమశాపమ్ము వలన
మొదటిజన్మను వారి కుదయించినారు
కలుషాత్ముఁడు హిరణ్యకశిపుఁడై యొకఁడు
అతనితమ్ముఁడు హిరణ్యాక్షుఁడై యొకఁడు.
క్రూరరాక్షసు లతిఘోరవర్తనులు

లోభమోహులు వారు లోకకంటకులు.
దీక్షతో ఘోరమౌ దీర్ఘతపమ్ము
దిశ లదుర హిరణ్యకశిపుఁ డొనర్చి
జంతు మానవ దేవసంతతి వలన
చావు లేకుండగ చతురతమీఱ
బ్రహ్మను మెప్పించి వరముల నంది
హింసింప మొదలిడె నెల్లలోకములు.
అతిశక్తిమంతుఁడై యవని తానుండ
హరియేల గిరియేల యనుచు ద్వేషమున
హరినామ మనునది యవనిలేకుండ
చేయంగ నాతఁడు చింతించుచుండె.

---

## శ్రీ వరహావతారము

అన్నకంటెను హిరణ్యాక్షుండు మిగుల
దుష్టుఁడై యతులితదోర్దర్ప మలర
తనతోడ తలపడి యని నొనరింప
జగమునం దెవరును సాటి రారనుచు
దిశ లెల్ల తిరుగగా దేవతల్ గూడ
పారిపోఁ దొడఁగిరి వానినిఁ జూచి.
తుదకు సంద్రమ్ములో దూకి యాతండు

వసుధాతలమ్మును బంధించిపట్టి
చాపచుట్టగ చుట్టి సంద్రాన ముంచి
ప్రజలకు నివసించు వసతిలేకుండ
బాధించుచుండెను పలువిధమ్ములుగ.
స్వాయంభువమనువు జగమేలు ప్రభువు
దుష్టహిరణ్యాక్షు దుర్ణయమ్ములను
వారింపగాలేక బ్రహ్మనుఁ జేరి
ప్రార్థించెఁగాని యాబ్రహ్మయుగూడ
దర్పోద్ధతుండైన దైత్యు నెదిర్చి
చేయలేకేమియు చింతించుచుండ
ప్రజలెల్ల పడుచున్న పాట్లు గ్రహించి
కారుణ్యమూర్తి యానారాయణుండు
బ్రహ్మనాసికనుండి బయటకువచ్చె
బొటనవ్రేలంతటి చిటివరాహముగ.
ఒకనిముసమ్ములో నున్నటు లుండి
పెద్దకొండంతగా పెరిగి యాఘోణి
క్రూరదంష్ట్రలతోడ ఘోరరూపమున
అంబుధియందున్న యాహిరణ్యాక్షు
నదలింపఁబోవ నాయసురేంద్రుఁ డొక్క
గదఁబూని వచ్చెను కదనమ్ముసేయ.
యాతనిపై దూకె నావరాహమ్ము
వా రిద్దరారీతి పోరొనర్పంగ

సంక్షుబ్ధమయ్యెను సప్తవార్ధులు.
రాక్షసేంద్రుని యుద్ధరభసమ్ము జూచి
ఆవరాహుం డంత నాగ్రహమ్మెసఁగ
తనపైకి లంఘించు దైత్యునిఁ బట్టి
మున్నీటిలోతుల మునుగంగఁ ద్రొక్కి
దారుణమ్ముగఁ జంపి దంష్ట్రలఁ జీల్చి
ముట్టెతోఁ బైకెత్తి భూమినిఁదెచ్చి
సుస్థిరమ్ముగనిల్పె సొంపుమీఱంగ.
అటుల వరాహమై యవనికి మేలు
చేసిన దైవమ్ము శ్రీ విష్ణుఁ జేరి
బ్రహ్మాది దేవతల్ భక్తితో మ్రొక్కి
వినుతు లొనర్చిరి వినయభావమున
సుప్రసన్నత నిండు చూడ్కుల నింపి
యందఱిం గనుఁగొని యాదరమ్మెసఁగ
నిజరూపమునుదాల్చి నీరజాక్షుండు
పయనమైయేగెను వైకుంఠ పురికి.



## కపిలుని తత్త్వబోధ

బ్రహ్మదేవుని ప్రజాపతులలో నొకఁడు
కర్దముండనుముని ఘనతపశ్శాలి
ఆ మునితపమున కచ్చెరువంది

యాతనికోరిక నాత్మలో నెఱిఁగి
దయమీఱ నతనికి దర్శన మొసఁగి
"స్వాయంభువమనువు వరపుత్రి యైన
దేవహూతిని గొమ్మ వైవాహికమున
పుట్టెద మీకు నే పుత్రుండ నగుచు
నని పంపె కర్దము నత్యాదరమున
కర్దమమునిచంద్రు ఖ్యాతి నాలించి
స్వాయంభువమనువె స్వయముగా వచ్చి
తనసుతన్ కర్దమమునికి నొసంగి
విభవ మేపారగా పెండిలి చేసె
కర్దముఁ డతిపుణ్యకార్యతత్పరుఁడు
పరమపతివ్రత పావనచరిత
అమలగుణోపేత యా దేవహూతి.
హరియంశయందున నాదంపతులకు
కలిగె పుత్రుఁ డొకండు కపిలుఁ డనంగ.
కపిలుని తరువాత కర్దమమునికి
అల అరుంధతియును అనసూయ మొదలు
పుత్రికల్ తొమ్మండ్రు పుణ్యవర్తనలు
ముదము దలిర్పగా నుదయించినారు.
తనపుత్రికల మహామునుల కొసంగి
కడుధన్యుఁ డయ్యె కర్దమమౌని.

యాతనికోరిక నాత్మలో నెఱింగి
దయమీఱ నతనికి దర్శన మొసంగి
"స్వాయంభువమనువు వరపుత్రి యైన
దేవహూతిని కొమ్మ వైవాహికమున
పుట్టెద మీకు నే పుత్రుండ నగుచు
నని పంపె కర్దము నత్యాదరమున
కర్దమమునిచంద్రు ఖ్యాతి నాలించి
స్వాయంభువమనువె స్వయముగా వచ్చి
తనసుతన్ కర్దమమునికి నొసంగి
విభవ మేపారగా పెండిలి చేసె
కర్దముం డతిపుణ్యకార్యతత్పరుండు
పరమపతివ్రత పావనచరిత
అమలగుణోపేత యా దేవహూతి.
హరియంశయందున నాదంపతులకు
కలిగె పుత్రుం డొకండు కపిలుం డనంగ.
కపిలుని తరువాత కర్దమమునికి
అల అరుంధతియును అనసూయ మొదలు
పుత్రికల్ తొమ్మండ్రు పుణ్యవర్తనలు
ముదము దలిర్పగా నుదయించినారు.
తనపుత్రికల మహామునుల కొసంగి
కడుధన్యుం డయ్యె కర్దమమౌని.

సత్యమ్ము నిత్యమ్ము శాశ్వతమ్మగుచు
పరమాత్మ యంశయై భాసించునట్టి
లోనియాత్మ నెఱుంగు జ్ఞానమే సిద్ధి
బంధమోక్షమ్మదే ప్రజల కెల్లరకు
పురుషోత్తమప్రాప్తి పుణ్యయోగమ్ము
జన్మరాహిత్యమా సాఫల్యసిద్ధి
మునులు వాంఛించెడి ముక్తిపదమ్ము.

ధ్యానయోగము :-

ఆత్మయోగ మెఱింగి యాచరించుటకు
మహిలోన కలదొక మంచిమార్గమ్ము.
పలుత్రోవలంబడి పరువులు బెట్టు
మనసును నిశ్చలమ్మొనరించి యుంచి
విషయవాంఛలవెంట వెడల నీకుండ
నిఖిలేంద్రియమ్ముల నియతమ్మొనర్చి
మోహాలోభాదులు మొదలంటఁ గోసి
నిత్య ప్రాణాయామ నియమాది విధుల
అష్టాంగయోగమ్ము లభ్యసించుచును
నయనదృష్టిని నిల్పి నాసికాగ్రమున
నారాయణుని ప్రసన్నాకృతియందు
తలఁపు లగ్నముఁజేసి ధ్యానింపవలయు
హరినాత్మలో నెంచి తరియించుకొఱకు
తగు మంచిమార్గ మీ ధ్యానయోగమ్ము.

భక్తియోగము :-

భగవదనుగ్రహ ఫలముల కంటె
మాయను దాటంగ మార్గమ్ము లేదు
వసుధ దానికి దారి భక్తియోగమ్మె
సర్వమయుండైన సర్వేశురూప
మన్యచింతలు లేని యాత్మలో నిలిపి
భక్తితోఁ బూజించి ప్రార్థనల్ సలిపి
భక్తితో కీర్తించి పరమాత్మమహిమ
భక్తిభావమ్మున పరవశు లగుచు
పరమాత్మ నెఱుఁగుటే భక్తియోగమ్ము.
పరమప్రశాంతమౌ బ్రహ్మపదమ్ము
చేరుట కయ్యదే దారి ధారుణిని
ఈశ్వరు నీరీతి నెందఱో జనులు
ధ్యానించి కీర్తించి ధన్యులైనారు.

అజ్ఞానమున ప్రజ లవనీతలాన
శాశ్వతమ్మని నమ్మి సంసారసుఖమె
మాయలోఁబడి హరిన్ మఱచి చిత్తమున
విషయవాంఛల వెంట వెడలుచు మిగుల
పాపకార్యములందు బ్రతుకులు గడపి
పుట్టుచు గిట్టుచు పుడమి నెల్లపుడు
నరకబాధలయందె నలుగుచుండెదరు,

వైరాగ్య మనునట్టి వాడిఖడ్గమున
ప్రబలమౌ సంసారబంధమ్ము నరకి
భగవానునిపై దృష్టి భక్తితో నిలిపి
పరమేశ్వరుం డైన బ్రహ్మమ్ము నరసి
సత్యలోకమ్మునందు శాశ్వత మ్మయిన
మోక్షమ్మునందుటే ముఖ్యధర్మమ్ము.

తల్లిరో నాపైని ధ్యానమున్ నిలపి
ఈ యోగమార్గాన నెల్లవారలును
పడయఁ గల్గుదురు నాపరమపదమ్ము
చేయుమట్లే నీవు చేయుము జనని!
అనుచు ప్రబోధించె నాత్మధర్మమ్ము
కపిలుడు తల్లికిఁ గడుప్రీతితోడ.
కపిలుని యుపదేశ కర్ణామృతమ్ము
వీనుల విందుగా విని దేవహూతి
వైరాగ్యభావమున్ బడసి నెమ్మదిని
దివ్యసరస్వతీ తీరాశ్రమమున
కపిలదేవుని చిత్తకమలాన నిల్పి
ధ్యానమగ్నాత్మయై తప మాచరించి
పొందెను శాశ్వత ముక్తిపదమ్ము.

———

# శ్రీ మ హా భా గ వ త ము

## చ తు ర్థ స్కం ధ ము

### ద క్ష య జ్ఞ ము

బ్రహ్మసృష్టించిన ప్రఖ్యాతిమంతు
లవని ప్రజాపతు లనువారిలోన
పెద్దయా దక్షుండు ప్రీతితో నొక్క
యాగమొనర్పగా యత్న మొనర్చె
ఆయజ్ఞముం జూడ నాహూతు లగుచు
నరుదెంచి రచటికి సురలును మునులు.
దక్షప్రజాపతి తనయయా సతియె
సర్వేశ్వరుండగు శంభుని భార్య
వెను లోకసభలోన తనకు మర్యాద
శివుం డీయ లేదని చిత్తమం దెంచి
యజ్ఞముం జూడగా సభవుం బిల్వకయె
మొదలిడె దక్షుండు మునులతో క్రతువు.

దక్షయజ్ఞమ్మును దర్శింపం గోరి
అమరు లేగుటం జూచి యాకాశమందు
సతియును పోగోరె జనకు నింటికిని.
పిలువని చోటికి వెడలుటే లనుచు
శివుం డెంత చెప్పిన చెవిం బెట్టకుండ
పుట్టింటిపైంగల మోహమ్ము చేత
తండ్రియజ్ఞముం జూడ తనమది నెంచి

అరుదెంచె సతియును యజ్ఞవాటికకు
తనవెంట నొకవేయి యనుచరుల్ నడువ.

శివునిపై కోపమ్ముచేత దక్షుండు
తనకూతు నచటఁ దాఁ గనుఁగొనికూడ
మర్యాదకై నను మాటాడ లేదు.
తనభర్త శివునకు తనకు నీపగిది
జరిగిన యవమానచర్య గ్రహించి
సర్వేశ్వరుండైన శంభున కిటుల
తగ దవజ్ఞ యటంచు తండ్రికిఁ జెప్పి
తనపుట్టినింటనే తన కీ యవజ్ఞ
యగుటచే పతికడ కరుగంగ లేక
శివునినే దలఁచుచు చిత్తమ్మునందు
ఆయజ్ఞవాటి యందందఱి ముందు
వేగమ్మె సతిజేరి యోగసమాధి
ఉజ్జ్వలమ్మై లేచు యోగాగ్నిశిఖల
ప్రాణముల్ బలిజేసి భస్మమైపోయె.
యజ్ఞమ్ముఁ గనుగొను నాసక్తితోడ
వచ్చిన శంభునిభార్య యిట్లగ్ని
కాహుతి యగుటకు నాత్మలఁ గలఁగి
ఆగ్రహమ్మున నామె యనుచరులెల్ల
అర్చుచు లేవంగ నట్టహాసమున
చంపిరి వారిని సభలోని వారు.

ఈ యజ్ఞవృత్తాంత మెల్లను వినిన
శివుఁ డుగ్రుఁడై తనశిరమున నున్న
జటనొక్కఁటిని త్రెంపి పుడమిపైఁ గొట్ట
ప్రమధగణమ్ముతో ప్రభవించె నచట
వీరభద్రుఁడు రౌద్రభీకరుం డగుచు.
శివునాజ్ఞ శీఘ్రమ్మ శిరసావహించి
భీషణార్భటుఁడయి వీరభద్రుండు
తనసేనతోఁ జేరి దక్షుయజ్ఞమును
వారు వీరని సుంత పాటింపఁబోక
కనుపడ్డవారిని కసిమసంగుచును
ఎదురైన వారిని విదళించి గొట్టి
తలఁద్రుంచి మొలఁద్రుంచి తనువులు ద్రుంచి
గగ్గోలుగావించి క్రతువాటి నెల్ల
క్రతువును ధ్వంసమ్ము గావించి మించి
దక్షునిఁగూడను తల దుల్చి చంపె.
దేవునిసయితమ్ము ధిక్కరించుచును
మంచియన్నది లేక మర్యాద లేక
గర్వించువా డెంతఘనుఁడైన గూడ
తప్పవు శిక్షలు ధరణీతలాన.

బ్రహ్మ దీనినిఁ జూచి పరితాపమంది
జరిగిన యపరాధ మెఱిఁగి చింతించి

దివిజముఖ్యులతోడ శివునొద్ద కేగి
జరిగిన యపరాధచర్య కెల్లరిని
క్షమింప దీనులై శంభుని వేడె.
క్షమియించె శివుడును కరుణాళుఁ డగుచు
మృతులైన వారెల్ల బ్రతికిరి మరల
క్షతగాత్రు లెల్లరు స్వస్థులైనారు.

దక్షుని కొక మేకతలను దగిల్చి
బ్రతికింప నతఁడును క్రతుపూర్తిఁ జేసి
శ్రీహరి నర్చింప శ్రీహరివచ్చి
తనహవ్యమును గొని దక్షునిఁ జూచి
శివుని నిందింపగా చేటింతకలిగె
బ్రహ్మయు విష్ణువు పరమశివుండు
పరమాత్మరూపులు పరమపూజ్యులును
వీరిముగ్వురి మధ్య భేదమ్ము లేదు
శివుఁడు పూజ్యుఁ డటంచు చెప్ప దక్షుండు
అతిదీనుఁడై యేగి యభవునిఁజూచి
యజ్ఞసీమకుఁ బిల్చి యతిభక్తితోడ
హవ్యభాగము లిచ్చి అర్చనల్ సలిపి
తనతప్పు పోఁద్రోలి ధన్యతం గనియె.

శంభునే తలఁచుచు సతియు నచ్చోట
అగ్నియం దాహుతియైన తర్వాత

మహితహిమాద్రికి మఱుజన్మమందు
జగదేకసౌందర్య సంపన్న యగుచు
పార్వతి యనుపేర ప్రభవమ్ము నంది
చేపట్టె ప్రేమించి శివునినే మరల.
కైలాసవాసులు కరుణార్ద్రమతులు
వాత్సల్యమూర్తులు భక్తరక్షకులు
పుణ్యాకృతులు జగత్పూజ్యపాదులును
ప్రజలకు పార్వతీపరమేశు లెపుడు.

## ధ్రువ చరిత్ర

స్వాయంభువమనువు శతరూపవలన
కనియెను ముదమార తనయు లిద్దఱిని.
వారిలో నుత్తానపాదుఁ డగ్రజుడు.
అయ్యె ప్రియవ్రతుం డనుజుఁ డాతనికి
ఉత్తానపాదున కుల్లాస మొదవ
సుందరాకృతులైన సురుచి, సునీతి
యను భార్య లిరువు రాయతివలలోన
నృపతికి సురుచిపై ప్రేమ మిక్కుటము.

తల్లి కిచిత్తమం దుల్లాసమొదవ
ఒప్పుగా నొక్కనాఁ డుత్తానపాదుఁ

డెలమిమై తనయంకతలమందుఁ జేర్చి
సురుచిపుత్రునిపైన కురిసె ముద్దులను
అదిజూచి నెమ్మది ననురాగ మంది
తన్వి సునీతికి తనయుఁ డైనట్టి
ధ్రువుఁడును తనతండ్రితోడ నెక్కఁబోయె
సవతికుమారుని ధ్రువుని చూడగనె
సురుచి యసూయతో చురచుర లాడి
ధరణిపు తొడ నెక్క తగవు నీవనుచు
బరబర ధ్రువునీడ్చి బయటకు గెంటె.
సురుచికి భయపడి మఱుమాట లేక
ఉర్వీపతియు చూచి చూడకయుండె.
పసిబిడ్డ యైదేండ్ల ప్రాయమువాడు
పాపమా ధ్రువుఁడును పరిభవ మంది
వెక్కివెక్కేడ్చుచు వెనుకకుఁ బోయి
జననికి చెప్పెను జరిగిన దెల్ల.

తనయుని మూర్కొని తల్లి సునీతి
తానెఱుంగును గాన భూనాథుమనసు
లోని దుఃఖమ్మును లోనె యణంచి
ధ్రువుని కీరీతిగా వివరించి నుడివె:
"మనభాగ్య మిటులుండె మదిని దీనికిని
చింతింపఁబోకు మో చిన్నారిబిడ్డ,

ఒకరిని బాధల నొందించు వారు
వారలే పలుపాట్ల పాలౌదు రవని
మాధవుండే దిక్కు మనకింక నీదు
తాతముత్తాతలు ప్రీతితో హరిని
సేవించి పొందిరి సిరిసంపదలను.
తనయ! నీవును మది ధైర్యమ్ము నూని
నారాయణుని నమ్మి నడువు మాపగిది
శ్రీయును భాగ్యమ్ము చేకూరు నింక
వగవకు నాతండ్రి! వసుధపై నీకు
భగవంతుఁడే సాయపడుగాక" యనియె.
బాలుఁ డయ్యును తల్లి వాక్యముల్ వినిన
ధ్రువునికిఁ గర్తవ్య మవగత మయ్యె.
తల్లిదీవన లంది తల్లికి మ్రొక్కి
వెంటనే పయనమై వెడలె కానలకు
శ్రీహరిన్ ధ్యానమ్ము సేయగా ధ్రువుఁడు
నారదుం డెదురయి దారిలో ధ్రువుని
యత్యంతదీక్షకు నబ్బురం బంది
"శుభమస్తు బాలకా శుభము నీ"కనుచు
నారాయణుని దివ్యనామమంత్రమ్ము
నుపదేశ మిడి ధ్రువు నుత్సాహపఱచి
అత్యాదరమ్మున నాశీస్సు లిచ్చె
నయమునఁ బాటించి నారదుమాట

యమున కొడ్డున నున్న యడవులఁజేరి
మాధవు రూపమున్ మదిలోన నిలిపి
ధ్రువుఁడు ప్రారంభించె నవిరతతపము
ఆకులున్ జలముచే యాహారములుగ.

చిదిమిన పాల్గారు చిన్నవాఁ డాత
డెచ్చట నేర్చెనో యేమియో గాని
కార్చిచ్చు వచ్చినన్ కదల డావంత
తొణకడు బెణకడు తనదీక్షనుండి.

ధ్రువునిదే సంతృప్తి ధ్రువునిదే భక్తి
ధ్రువునిదే ధైర్యమ్ము ధ్రువునిదే తపము
ధ్రువునిదే నియమమ్ము ధ్రువునిదే నీతి
వడగాలి యైనను వానలే యైన
పెనుతుపా నైనను పిడుగులు పడిన
పెక్కఁడు లీరీతి విపినమధ్యమున
ఒకకాలిపై నిల్చి యొనరించె తపము.

దేవతల్ ఋషులును దిక్పతులెల్ల
రద్భుతమ్మని చూచి రాతపోనిష్ఠ
బాలునిభక్తికి పరమహర్షమున
వైకుంఠమునుండివచ్చి శ్రీహరియు
ప్రత్యక్షమయ్యె నాబాలునిముందు.
పద్మాక్షుఁ గనుగొని పరవశుం డగుచు

మానమున ముదమంది తనభాగ్యమునకు
"నిన్నె నమ్మితి దేవ! నీవె దిక్కనుచు
ప్రార్థించె విష్ణు నాబాలధ్రువుండు.

శ్రీహరి ధ్రువు నంత చెంతకుఁ జేర్చి
ప్రేమ తొల్కాడెడి ప్రియభాషణముల
"వత్స! నీవిక పొమ్ము పట్టణమ్మునకు
నీకోర్కె లన్నియు నేనెఱుంగుదును
సంతసించితి నీదు జపతపమ్ములకు
నీతండ్రి రాజ్యమున్ నీకిడు నింక
నీకెగ్గుఁ దలచిన నీతిలేమికిని
సురుచి యున్మాదినై మరణించు తుదకు.
ఇరువదియార్వేల యేండ్ల కాలమ్ము
పుడమిని పాలించి పుణ్యలోకమున
ధ్రువతారవై నీవు రోచిస్సు లొలుక
విశ్వముండెడి దనక వెలుగుదు" వనుచు
దీవించి వెడలెను శ్రీవిష్ణుమూర్తి
విష్ణునికృప నంది విజయుఁడై ధ్రువుఁడు
వచ్చుచుండిన వార్త వ్యాపించె దిశల.
తనమంత్రి బాంధవుల్ తనవెంట రాగ
రాణి సునీతితో రథముపై నెక్కి
వైభవ మ్మెసఁగంగ వని కేగుదేగి

ఉత్తానపాదుఁ డత్యుత్సాహి యగుచు
ధ్రువునిఁ దోడ్కొనివచ్చి యవనిపుఁ జేసె
పెద్దవాడై సర్వవిద్యల నేర్చి
న్యాయతత్పరుఁ డను ఖ్యాతి నార్జించి
హరి యనుగ్రహమున నకలంకరీతి
ధరణినిఁ బాలించి ధన్యుఁడై ధ్రువుఁడు
ఉజ్వలతారయై యుత్తరదిశను
వినువీధి నేటికిన్ వెలుగుచున్నాఁడు.

స్థిరతరదీక్షకు చిహ్న మాధ్రువుఁడు
దిక్కయి శ్రీహరి దీనుల కెల్ల
సత్కార్యదీక్షకు జయమిచ్చు ననుచు
భువిపైని చాటు నీధ్రువునిచరిత్ర.

---

## పృథు చక్రవర్తి

ధ్రువుని తర్వాత నాధ్రువునంతవాఁడు
గుణశాలి యాతని మునిమనుమండు
పృథుచక్రవర్తి యీపృథ్విఁ బాలించె;
వసుధపై నివసించు ప్రజలకెల్లరకు
క్షేమమ్ము నెదనెంచి ప్రేమతో నేలి,
కన్నబిడ్డలవోలె కాపాడె జనుల.

పృథుజననాథుని విఖ్యాతి కలరి
పృథివియే వశమయి ప్రియభావ మెసఁగ
గోరూపమున వచ్చి కూరిమి మీఱ
గోక్షీరధారలఁ గురిసి యక్షీణ
పశు ధన ధాన్యాది భాగ్యమ్ము లిచ్చె
నిత్యసంతృప్తులై నెగడ భూజనులు.
నిశ్చలభక్తుఁడై నిత్యమ్ము హరిని
ప్రీతితోఁ బూజించి పృథుచక్రవర్తి
నూరశ్వమేధముల్ ధీరుఁడై చేసె.
దేవతల్ ఋషులును దేవేంద్రుఁ డరిగి
పొగడి దీవించిరా భూవిభున్ మిగుల
పృథుచక్రవర్తియు వృద్ధుఁడై నంత
తనరాజ్యమును పంచి తనయుల కిచ్చి
అతిసాధ్వి తనభార్య అర్చితో గూడ
వని కేగి ఘనతప మ్మొనరించుకొనుచు
పరమపదమ్మును బడసెను తుదకు.

ప్రజలెల్ల సుఖముగా బ్రతుకట కొఱకు
పాడిపంటలె సర్వభాగ్యమ్ము లనుచు
ధారుణి కొకమంచిదారిని జూపి
పృథ్వి నేలిన రాజు పృథుచక్రవర్తి.
అతని విజ్ఞానమ్మె యతని యాశయమె

నిత్యసత్యమ్ముగా నిలిచె నీయవని
గోసస్యసంపదల్ కుంభినిమీద
జీవనాధారమై పావనమ్మగుచు
ప్రథమగణ్యమ్మయి ప్రజలకు మిగిలె
పృథురాజు చేసిన కృషివిశేషముగ.

---

## ప్రాచేతసులు

పలుదెసల్ వ్యాపించి ప్రఖ్యాతితోడ
అవనిని పృథువంశ మభివృద్ధిగాంచె
పృథువంశమందున పేరును గనిన
ప్రముఖధాత్రీపతి ప్రాచీనబర్హి
క్షితిమీద యజ్ఞముల్ చేసియు పెక్కు
చిత్తశాంతియె లేక చింతించి యతఁడు
నారద వచనానుసారమ్ము హరిని
పూజించి చివరకు పుణ్యాత్ముఁ డయ్యె.

ప్రాచీనబర్హికి పదిమంది సుతులు
ప్రాచేతసు లనంగ ప్రభవించినారు.
దైవభక్తులు వీరు ధ్యానతత్పరులు
సాగరతీరాన శంభునిఁగూర్చి
నిష్ఠతోఁ జేసిరి నిశ్చలతపము.

నారదుఁ డేతెంచి వారలకడకు
వారల సద్భక్తిభావమ్ము మెచ్చి
శ్రీహరి మహిమను జెప్పి పూర్ణముగ
"శ్రీహరి కొనరించు సేవయే సేవ
మాధవుఁ గీర్తించు మాటయే మాట
జలజాక్షు నెఱిఁగిన జన్మమే జన్మ
పద్మాక్షు నర్చించు వారికే ముక్తి"
యని ప్రబోధము చేసి తనదారి నేగ
నారదు నుపదేశసారమ్ము నెఱిఁగి
ప్రాచేతసులు హరిభక్తులై వరలి
సన్యాసమును బూని జ్ఞానులై మిగుల
హరిని ధ్యానించుచు ననవరతమ్ము
పడయఁగల్గిరి పుణ్యపరమపదమ్ము.

---

# శ్రీ మహా భాగవతము

## పంచమ స్కంధము

### భరత వర్షము

మనువు కుమారుఁడు మహనీయగుణుఁడు
సోదరుం డుత్తానపాదున కవని
ప్రియవ్రతుం డనువాడు పృథ్విఁ బాలించె
రాజధర్మము నిల్పి రమణీయరీతి.
శ్రీహరిన్ నిరతమ్ము హృదయాన నిల్పి
పరమభక్తుండైన వసుధేవుఁ డతఁడు
ప్రజలకు ననువుగా పాలనఁ జేయ
విపుల భూమండల విస్తీర్ణమెల్ల
నేడు సంద్రములుగా నేడు దీవులుగ
ఏర్పాటుఁ గావించి యేడ్గురు సుతుల
కా రాజ్యముల నిచ్చి యాత్మలో హరినె
ప్రార్థించుచును పొందె పరమపదమ్ము.

జగతి జంబూ ప్లక్ష శాల్మలీ క్రౌంచ
శాక పుష్కర కుశ సంజ్ఞలతోడ
విలసిల్లి వెలసె నా ద్వీపసంచయము.
అతని సుతుఁడైన యగ్నీధ్రువుఁడు

భూమీశుఁ డయ్యె జంబూద్వీపమునకు
ఈద్వీపమును సర్వ మితఁడును మరల
భాగించె తొమ్మిదివర్షముల్ గాగ
వానిలో ముఖ్యమౌ భరతవర్షమ్ము
మహానీయ దేశమ్ము మనజన్మభూమి
అజనాభివర్షమై యలరును మొదట
అగ్నీధ్రు మునిమన్మ డైనట్టి ఘనుఁడు
భరతుఁడు ప్రతిభతో పాలించుకతన
భరతవర్షమ్మయి వరలె నీభూమి
గంగయు యమునయు గౌతమి కృష్ణ
కావేరి మున్నగు జీవవాహినులు
శీతగిరీంద్రము సింహాచలమ్ము
వింధ్యమ్ము శ్రీగిరి వేంకటాచలము
నీలమ్ము మున్నగు శైలరాజములు
బహుదీర్ఘమై యొప్పు వార్ధితీరమ్ము
వివిధవృక్షాంచిత విపినసీమలును
ఫలతరు సుమలతా విలసితవనులు
లలితసరోవర జలతటాకములు
మణిగణాన్విత సర్వఖనిజసంపదలు
బహుపక్షికుల జంతు పశుసంతతులును
సస్యకేదారముల్ శాద్వలస్థలులు
అనుకూల వర్ష వాతాతపస్థితులు

బహువిధ ధనధాన్య భాగ్యసంపదలు
కలిగి వర్ధిల్లు నీకమనీయ భూమి
జనులకు భువినొక స్వర్గఖండముగ
జనులకు విజ్ఞాన సంపద నిచ్చు
వేదముల్ శాస్త్రముల్ వివిధవిద్యలును
ప్రభవించె మొదట నీభరతోర్వియందె.
విధ్యుక్త యజ్ఞాది వివిధకర్మలకు
నిలయమై యీదేశ మలరును భువిని
ప్రజల శ్రేయమునకు శ్రమ నొందినట్టి
వీరులు ధీరులు విజ్ఞానధనులు
ఋషిచంద్రులును కవుల్ నృపతివర్గములు
ప్రభవించి రెందఱో భరతవర్షమున.
విశ్వహితార్థియై విష్ణువే పుట్టె
నీభరతోర్వియం దెన్నియో మార్లు
భరతవర్షమ్ము పావనకర్మభూమి
తీర్థముల్ క్షేత్రముల్ తిరిగి చూచుచును
నదులందు స్నానముల్ ముదమునఁ జేసి
వాసుదేవునిపూజ భక్తితో సలిపి
సత్కార్యము లొనర్చి సంపదల్ వడసి
ప్రజలెల్ల ముక్తిని పడయుదు రిందు.

## నరనారాయణులు

తనసుత మూర్తిని దక్షుఁ డొసంగె
ధర్మునకా పుణ్యదంపతు లందు
హరియంశ నుదయించి రిరువురు సుతులు
నరుఁడు నారాయణుండను పేరు లలరి
భరతవర్షమ్మున ప్రజలఁ బ్రోచుటకు.
వారిద్దఱును భువి భక్తులయెడల
పరమసౌజన్యులు వాత్సల్యనిధులు.
దుష్టుల వధియించి దుర్మార్గ మడఁప
అవతారమందిన అతిబలుల్ వారు
జగదేకవీరులు చండకార్ముకులు.
అమృతము గొనిపోవ నమరులపై కి
దండెత్తు దైత్యుల చెండాడినారు.
కడుదుష్టుఁడు సహస్రకవచునిఁ జంపి
ప్రజలఁ బ్రోచిన రణప్రతిభులు వారె.
కల్పాంతమగు దాక కఠినతపమ్ము
నొనరింతు రిలవారు మునిరూపములను
వారితపమ్మును భగ్నమ్ము సేయ
అమరేంద్రుఁ డంపిన యప్సరస్త్రీలు
తగ్గిరి వెనుకకు సిగ్గును బొంది
నారాయణుడు తన యూరువునుండి

యుదయింపఁ జేసిన యూర్వశిం జూచి
నరుని నారాయణున్ నారదుం డెపుడు
సేవించుచుండును స్థిరభక్తితోడ.

---

## ఋషభుఁడు - భరతుఁడు

ఇలను జంబూద్వీప మేలినయట్టి
అగ్నీధ్రుని కుమారుఁడై ననాభికిని
మేరుదేవికిఁ బుట్టె కూరిమిమీఱ
శ్రీహరియంశను ఋషభుండు మిగుల
సద్గుణశాలియు సౌజన్యుఁ డగుచు
పరమార్థముగ నెంచి ప్రజలశ్రేయమును
పాలించె వసుధ నీభవ్యసద్గుణుఁడు.
పుత్రుఁడౌ భరతుని భూపతిఁ జేసి
దైవచింతన యతిదె తనకాల మెల్ల
గడపుచు వైరాగ్యగతి నూని మదిని
వేదాంతియై ఆత్మవిజ్ఞాని యగుచు
దేహసౌఖ్యము లెల్ల దిగఁద్రోసిపుచ్చి
అవనిపై దిరుగుచు నవధూత వోలె
పరమాత్మఁ గలిసిన చరితార్థుఁ డతఁడు
సామాన్యునికి నైన సమాత్రిట్టు కైన
అధ్యాత్మదర్శన మబ్బుట కొఱకు

నిత్యజీవనమున నిర్లిప్తమైన
వైరాగ్య మొక్కటే దారి యటంచు
మహికెఱింగించిన మహనీయుఁ డతడు
పావనచరితుఁడై జీవితమెల్ల
గడపిన బహుపుణ్యకార్యతత్పరుఁడు.

---

## జడభరతుఁడు

నృపతియై భరతుండు ఋషభుని సుతుఁడు
రాజ్యమేలెను మహాప్రఖ్యాతి తోడ.
అతనినామమున నీయవనీతలమ్ము
భరతవర్షమ్మయి యలరిన యట్టి
భవ్యచరితుఁడాభరతుఁ డీజగతి.
పరిపాలన మ్మిట్లు జరిపి యాతండు
ధరణిపాలనమును తనయుల కొసఁగి
అరిగెను తపసియై యడవుల నెంట.

ఒకదిన మాశ్రమనికటమ్ము నందు
జలములఁ బడి మున్గి గిలగిల లాడు
లేడిపిల్లను జూచి లేవనెత్తుకొని
ప్రీతితో దానిని పెంచుచు నుండె.
సర్వమ్ము త్యజియించు సన్యాసులకును

దయ మంచిదేకాని తగ దిట్టి మమత
ఆత్మలో భరతున కాలేడిపైనె
మమత మిక్కుటమయి మఱుజన్మమందు
భరతుండు లేడియై ప్రభవమ్ము నంది
తిరిగి జన్మించె నీధరణీతలాన
విధివశమ్మున నొకవిప్రుని యింట
భరతుఁ డనెడు పేరె మరల ధరించి
పుడమిపైఁ దిరుగుచు జడుని చందమున
ఎవరేమి చెప్పిన నెపుడు చెప్పినను
పనిచేయునే గాని పలుక డావంత.
ఆతనివర్తన కాశ్చర్య మంది
జడభరతుఁ డటంచు జనులెల్ల రనిరి.
విశ్రాంతి గొనకుండ విసుగనకుండ
పనులు సేయును గాని ప్రజల కెల్లపుడు
పట్టించుకొనఁ డెంతపలుకరించినను.

అతఁ డొక్కదినమునం దడవిలో నుండ
నరపశు వొక్కఁడు దొరకె నటంచు
భరతుని దొంగలు బంధించిపట్టి
బలినీయఁ బోవగా వాత్సల్యరాశి
కాళికాదేవియే కరుణాత్మ యగుచు
బందిపోటులఁ జంపి భరతునిఁ గాచె.

అడవియందున్నను పుడమి నెందున్న
అకలంక చరితుల నన్నివేళలను
కాపాడు దైవమే కరుణతో వచ్చి.

ఏమెఱుంగని యట్లు లిలమీదనిట్లు
ప్రజలకు భరతుఁడు శ్రమదాన మిడుచు
జడునిగా కాలమ్ము గడపుచుండంగ
భరతునిఁ గని తనపల్లకి మోయ
బోయీగ నియమించె భూనాథుఁ డొకఁడు
భరతుఁ డోపికతోడ పల్లకి మోసి
సేవ లానృపతికి చేసినప్పటికి
సరిగ మోయుట లేదు జాగ్రత్త యనుచు
భరతునా నరపతి బాధించ సాగె.

భరతుండు మెల్లన పల్లకి దింపి
చిఱునగ వాననసీమ వెలుంగ
ఆరాజు చిత్తమ్మునం దెక్కునటుల
వినుమని నుడివెను వినయుఁడై యిట్లు
"భూమీశుఁ డైనను సామాన్యుఁ డైన
చేయంగవలె గాని చేతనౌ సాయ
మొకరిని బాధించు టుర్వీపైఁ దగదు
అధికారమత్సర మ్మధికారపదవి
పరమార్థములు గావు నగుల కెన్నఁటికి

పరికించు కొలఁది నీవర్తన మ్మిచట
అవనీశ ! ఆశ్చర్య మగుచుండె నాకు.
నరులకు జీవితన్యాయమై వెలయు
విధియున్న దొక్క టీప్రకృతిలోన
విను"మని భరతుఁడు వివరించి చెప్పె.
దేహాభిమానమ్ము దేహసౌఖ్యమ్ము
స్వార్థమ్మువలన నేపాపమున్నదియొ
శాశ్వతాత్మానంద సంధాయకమ్ము
జీవితలక్ష్యమై చెన్నారు నట్టి
స్వర్గమ్ము పుణ్యమ్ము సాధువర్తనము
జ్ఞానమ్ము ధ్యానమ్ము సత్తపఃఫలము
మంచియు చెడ్డయు సంచితకర్మ
మధ్యాత్మ చింతన మనువాని నెల్ల.
భరతుఁడు నుడివిన పలుకు లాలించి
మదిని పశ్చాత్తాప మొదవి యారాజు
తన యపరాధమ్ము మనమున నెఱిఁగి
భరతుని పాదముల్ పట్టి ప్రార్థించి
తనతప్పు క్షమియింపు మని వేడుకొనియె.

మాయలు లేని యమాయకుఁ డగుచు
జ్ఞానియయ్యును కడుసామాన్యువలెన
సరివారి కెల్లప్డు సాయ మొసర్చి

మానవసేవయే మహనీయ కృతిగ
తనబ్రతుకెల్లను త్యాగ మొనర్చి
నీతివర్తనుఁ డయి నిస్వార్థుఁ డగుచు
తిరుగుచుండిన జడభరతునిజన్మ
పరమార్థభరితమ్ము చరితార్థ మరయ.



# శ్రీ మహాభాగవతము

## షష్ఠస్కంధము

### అజామీళుఁడు

కలుషవర్తనుఁ డైన కఠినాత్ముఁ డైన
దురితకర్మరతుఁ డైన దుర్మార్గుఁ డైన
నారాయణుని దివ్యనామాక్షరములు
మనసార నొకమారు స్మరియించి నంత
కలుషభావము లెల్ల తొలఁగి నెమ్మదిని
పాపదూరుం డయి పావనుం డగును.

అవని నజామీళుఁ డనువిప్రుఁ డొకఁడు
సద్వంశజనితుండు సద్గుణరాశి
కడుబుద్ధిశాలియు కలడు పూర్వమ్ము.
ఫలముల కాతఁడు వని కేగుచుండ
కనుఁగొనె దారిలో కామాంధుఁ డైన
విటుఁ డొక వేశ్యతో విహరించుచుంట.
ఆదృశ్యమును చూచినంత నే మిగుల
చంచలమ్మయి యాయజామీళు మనసు
విషయసౌఖ్యములకై వెడలంగ సాగె.
మద్యపానమ్ము దుర్మార్గుల చెలిమి

దుర్వాదజూదముల్ తొత్తులపొత్తు
మెలమెల్ల నాయజామీళున కబ్బె
ఇల్లాలి విడనాడి యింటిని పీడి
వేశ్యవద్దనె యుండి పిల్లలఁ గనుచు
కాలమ్ము నాతఁడు గడపుచునుండె.
ధనమెల్ల వ్యయమయ్యె తాలిమిపోయె
జ్ఞానమ్ము నశియించి మానము చెడెను
భోగముల్ కడముట్టి రోగముల్ హెచ్చి
వెతల పాలగుచు నావిప్రుండు తుదకు
మరణమాసన్నమై మంచము పట్టె.

వేశ్యకుఁ బుట్టిన పిన్నఁటికొడుకు
నారాయణుం డనునామము కలుగు
పిల్లవాఁ డనినచో ప్రేమ యాతనికి
అంత్యకాలము తన కాసన్న మగుట
గుర్తెఱింగి యతండు గొంతెత్తి వడిగ
నారాయణా యని సారెసారెకును
కొడుకును విడలేని కోరికతోడ
పిలుచుచు గట్టిగా ప్రలపించు చుండె.

కలుషచిత్తుఁడు నిత్యకామవర్తనుడు
దురితాత్ముఁడితడని నరకానఁ ద్రోయు

యమదూత లతిశీఘ్రి మరుడెంచినారు.
మరణకాలమునందు మహనీయుఁడైన
నారాయణుని దివ్యనామాక్షరముల
స్మరియించి చేసిన సత్కార్య మెంచి
బ్రాహ్మణుం గొనిపోవ వైకుంఠమునకు
వేగమె వచ్చిరి విష్ణుదూతలును.
వాదముల్ పెరిగెను వారలమధ్య
యమదూతలకు దారి కడ్డుగావచ్చి
వినిపించి రీరీతి విష్ణుకింకరులు.
"ఆదరమ్మున నైన హాస్యాన కైన
తెలియక చేసిన తెలిసి చేసినను
హరియించు పాపమ్ము హరికీర్తనమ్ము
కరఁగించు కలుషమ్ము హరికీర్తనమ్ము
విఱిఁగించు దురితమ్ము హరికీర్తనమ్ము
అలరించు సద్గతుల్ హరికీర్తనమ్ము
నారాయణుని దివ్య నామసంస్మరణఁ
గావించి యీతఁడు పావనుం డయ్యె
నని చెప్పి యమదూతలను పారఁద్రోలి
విప్రుని బ్రదికించి ప్రీతితో మరల
వెడలిరి వెనుకకు విష్ణుకింకరులు

బ్రతుకుచావులమధ్య పడియున్న విప్రు
డంతయు గమనించి యాత్మలో తనకు

తెరదీసి నట్లయి తెలివి లభించె.
ఆనాఁటినుండియు నాయజామిళుఁడు
నారాయణుని నామసార మ్మెఱింగి
హరిరూపమున నె తనయాత్మలో నిలిపి
నిరతమ్ము సలుపుచు హరినామజపము
పరమపదమ్మును బడసె నంతమున.



## ఇంద్రుని గర్వభంగము

అధికార మున్నను ఐశ్వర్య మున్న
గర్వమ్ము తగ దెంతఘనునికి నైన
అధికారమత్తుఁడై యమరవిభుండె
గురువర్యు నవమానపఱచి యాపిదప
బ్రహ్మహత్య నొనర్చి పాపమ్ముబొంది
కష్టాలపాలైన కథయొండు కలదు.

అమరులు గంధర్వు లప్సరల్ మునులు
సిద్ధసాధ్యాదులు చేరి కొల్వంగ
దేవేంద్రుఁ డొకనాఁడు దేవలోకమున
సకలవైభవముతో సభతీరి యుండె.
పావనచరితుండు దైవతుల్యుండు
గురువుబృహస్పతి కొలువు చేరఁగనె

సభ్యులందఱు నమస్కారముల్ సలిపి
భక్తివినమ్రులై స్వాగత మిచ్చిరి.
కాని, దేవేంద్రుఁడు కదలనే లేదు
అమరలోకేశుఁడ ననిన గర్వమున
జరిగిన యవమానచర్యకుఁ గినిసి
అరిగె బృహస్పతి యాసభన్ వీడి.

ఇంద్రుని వర్తన యేహ్యమటంచు
వచ్చిన సభ్యులు పలుకు టాలించి
తనయపరాధమున్ మనమున నెఱిఁగి
గురువును బ్రార్థించి కొనిరాఁగ నింద్రుఁ
డరిగిచూచెను గాని యగపడఁ డతఁడు
గురువె హేతువుగాన కులము వర్ధిల్ల
దమ పురోహితుఁడును తమ మేలుగోరు
ఆచార్యుఁడును లేక అమరు లెల్లరును
బలము గోల్పోయిరి బలహీను లయిరి.
అమరుల దైన్యమ్ము నరసి దానవులు
ద్విగుణీకృతోత్సాహ ధీరులై వచ్చి
దివిజుల నోడించి దివి నాక్రమించి
బాధించుచుండిరి పలువిధమ్ములుగ.
ఉర్విఁ గురుద్రోహ మూరక పోదు
తన గర్వవృత్తియే తనకిట్టి చేటు

చేసిన దనుచును వాసవుఁ డెఱిఁగి
దివిజులఁ దోడ్కొని దీనుఁడై యేగి
కమలాసనుని వేడ కాపాడు మనుచు
అమరుల విజ్ఞప్తు లాలించి బ్రహ్మ
"మేలగు నీకమీాద మీారలు పోయి
త్వష్టపుత్రుఁడు గొప్పతపసియు నైన
విశ్వరూపుని గని విచ్చేయు మనుడు
గురువుగా మీాకని సురలను బంపె
విశ్వరూపున కతివినయులై మ్రొక్క
అమరులట్లే యేగి ప్రార్థించినారు.
అనుకంపతో విని అమరుల వినతి
గురువుగా నరుదెంచి సురలోకమునకు
విశ్వరూపుం డిచ్చె విబుధాధిపతికి
సకలభాగ్యశ్రీలు సమకూర్చు నట్టి
మహిత నారాయణ మంత్రోక్త కవచ
విద్య లన్నింటి నావిద్యలచేత
తిరిగి సంపాదించె దేవవిభుండు
వైభవోపేతమౌ స్వర్గరాజ్యమ్ము.
విద్వన్మనీషి యావిశ్వరూపుండు
సత్కర్మనిరతుఁడై సతతమ్ము ప్రీతి
నాచరించుచునుండు యజ్ఞయాగములు.

భూమీతలమ్మున పుట్టిన యపుడె
మూడుశిరములున్న మూర్తి యతండు
త్రావుచుండును సోమరసముతో బాటు
దనుజులవలె సురాద్రవమును గూడ.
విశ్వరూపుడు యజ్ఞవిధివిధానముల
ఆసక్తి మీఱగ నర్చనల్ సలిపి
యజ్ఞహవిస్సుల నర్పించుచుండె.
తనపితృవరులగు దైతేయులకును
ఆహూతులను జేసి యజ్ఞవాటికకు.

అమరుల శత్రువు లసురుల కేల
యజ్ఞహవిస్సుల నర్పించు టనుచు
దేవేంద్రుఁ డతికోప దీపితుం డగుచు
సకలశాస్త్రజ్ఞుఁడు సద్గురూత్తముఁడు
పండితుం డనికూడ భావించఁ బోక
విశ్వరూపునిపైకి వెడలి వేగముగ
ఖడ్గమ్ము చేబూని ఖండించె నతని
శిరములు మూడును ధరణిపైఁ బడఁగ.
ధర్మవర్తనుఁడును తమమేలు గోరు
గురునిశిరమ్ములు కూల్చినందులకు
ఇంద్రుని గర్హించి రెల్లవారలును
విశ్వరూపునితలల్ విహగమ్ము లగుచు

విబుధేంద్రుపైఁ బడి విడిపింపలేని
బ్రహ్మహత్యాదోష పంకాన ద్రోసె.
ఆపాపఫలముచే నమరేంద్రుఁ డొక్క
వత్సరకాలమ్ము స్వర్గమ్ము వీడి
పరవాసముం జేసి పలుపాట్లు నొంది
భూ జల స్త్రీలను భూరుహమ్ములను
ప్రార్థించి వారి కాపాపమ్ము పంచి
తద్దోషమందుండి తప్పించుకొనియె.



## వృత్రాసుర వృత్తాంతము

ఇంద్రునిమీదకు నింతలోపలనె
విఱుపుకు పడసాగె మఱియొక్క బెడద.
అన్యాయముగ తనయాత్మజునిట్టు
లింద్రుండు వధియించు టెఱిగిన త్వష్ట
వాసవుమించిన బలశాలి యైన
తనయుని బడయంగ దలఁచి వేగమ్మ
యొనరించె దీక్షతో నొక మహాక్రతువు.
ఆయజ్ఞకుండమ్ము నందుండి పుట్టె
తేజ మొక్కటి సర్వదిశ లావరించి
భీకరాకృతితోడ వృత్రుఁ డనంగ.

పుట్టుచె తపవృగా భూనభోంతరము
దద్దరిల్ల నతండు దర్పుఁడై యఱచె
ఆ భీకరధ్వని కఖిలజగమ్ము
వడవడ వణకెను వార్ధి కలంగె.
నాకలోకము గెల్చు నాయకుఁ డొకఁడు
వచ్చె నేఁటి కటంచు పరమహర్షమున
అసుర లందఱు చేరి రతనిపక్షమున.
చచ్చిరి దేవతల్ చచ్చి రటంచు
ఆర్చుచు నురుకుచు నట్టహాసముల.
విశ్వరూపుని తలల్ ప్రిల్చి నందులకు
వాసవుపై దన పగతీర్చుకొనఁగ
తండ్రిదీవన లాది దైత్యులఁ గలసి
ఆయుధమ్ములఁ బూని యంతకాకృతిని
వృత్రుండు దివిపైకి వెడలె దండెత్తి
అరిభయంకరుఁ డయి యత్యుగ్రగతుల
నిప్పులు గ్రక్కుచు నింగిపై నుండి
ప్రళయకాలుని వోలె వచ్చుచున్నట్టి
వృత్రాసురుని రాక విన్నమాత్రమున
పలుపంచలను బట్టి పాఱిరి సురలు.
దిక్కులునిండిన తేజమ్మెసంగ
వృత్రాసురుండు విజృంభించి రేగి

దేవతావరు లేయు దివ్యాస్త్రములను
కడుభీకరాకృతి కబళింప సాగె.
బీరమ్ముతో వచ్చి వృతు నెదిర్చి
వ్యర్థమ్ములయి తన బలశక్తు లెల్ల
దీనుఁడై యరిగెను దేవేంద్రుఁ డోడి.
దైత్యులవశమయి ధ్వంసమైపోయె
నాకలోక మ్మెల్ల నానావిధాల.
అమరుల గెలిచిన యతిశయ మ్మెసఁగి
వృత్రుఁడు తనకెవ్వ రెదురులే రనుచు
చరియింప సాగెను సర్వలోకముల.

దివిలేనిచో లేదు భువి సమస్తమ్ము
భువిలేనిచో లేవు పుణ్యకర్మములు
చెడునింక సర్వ మీచెనటిచే ననుచు
ఘనమైన తపమును గావించి మించి
బ్రహ్మచే వరములు బడసి యీరీతి
ప్రళయకాలుని వోలె పైఁబడి నట్టి
వృత్రుని లోఁగొను విధమేమి లేక
సురపతి సురలతో హరివద్ద కేగి
మ్రొక్కి ప్రార్థించుచు మొఱపెట్టె నిట్లు.
"దేవదేవా! హరీ ! దీనశరణ్య!
అఖిలలోకాధార, అసురసంహార!

వృత్రాసురుం డను పెనుభూత మొకఁటి
ప్రబలి మ్రింగుచునుండె బ్రహ్మాండ మెల్ల
ఆగ లేకుంటి. మా యసురుని ముందు
కమలాక్ష! వరద! యో కారుణ్యభావ
పాహి పాహి" యటంచు ప్రార్థించి నంత
"ఈ దీనదుస్థితి కింద్రుఁడే హేతు"
వనుచును యోచించి హరియిట్టు లనియె,
"ఇంద్రునిజే నింత యెగ్గు వాటిల్లె
తన తపశ్శక్తిచే తనరుచున్నట్టి
వృత్రుఁడు మరణింప డెవ్వరిచేత
కాన నీ దైత్యుని కడ తేర్చుకొఱకు
కావలె నొకత్యాగకర్మ మీజగతి.
ముని దధీచి కలండు ఘనతపశ్శాలి
ఇమ్మని వేడు డాఋషిశరీరమ్ము
ఋషివెన్నెముకచేత వృత్రుండు చచ్చు"
ననుచు ధైర్యమ్ము చెప్పి హరియంపె సురల.

అమరేంద్రుఁ డేగి యాయతివరు కడకు
మునుకొను భక్తితో మ్రొక్కి పూజించి
"ఓమహామహనీయ! ఓమునివర్య!
ఓదయాగుణసాంద్ర! ఓతాపసేంద్ర!
హరియాజ్ఞ గొనుచు మే మరుదెంచినార

మడుగఁగూడనిది నిన్నడుగఁటకొఱకు
స్వర్గరాజ్యము గెల్చి జగతి నదల్చి
పీడించుచుండెను వృత్రాసురుండు
నిర్మూలనముగాడు నీశరీరాస్థి
శాయుధమ్మునఁ గాని యా నిశాచరుడు
కృపఁజూడు మమ్ము నోఋషిచంద్ర" యనఁగ
జగతిశ్రేయము నెంచి సౌఖ్యమ్ము నెంచి
ప్రాణాల కయికూడ భయ పడకుండ
తన వెన్నెముఁక నిచ్చె తపసి దధీచి
ధర యెఱుంగని మహాత్యాగమ్ము జేసి.

వినుత దైవబలమ్ము మునితపఃఫలము
గలుగు నాయస్థికన్ కడు నేర్పుమీఱ
విశ్వకర్మయె వచ్చి ప్రీతిదలిర్ప
సునిశిత శతధార లొనరి దీపించి
అప్రతిహతమయి యలరారు నట్టి
వజ్రాయుధ మొనర్చి వాసవు కిచ్చె.
ఉత్సాహవంతులై యుప్పొంగి యరికి
విబుధసైన్యమ్ములు వెనువెంట రాగ
వజ్రాయుధముబూని వారణ మెక్కి
వెడలె నాకేశుఁడు వృత్రునిపైకి
మరల వచ్చిన యింద్రు నరసి రోషమున

జగమునెల్లను మ్రింగఁజాలిన యట్టి
భీకరాకృతితోడ వృత్రుఁడు వచ్చె
దానవవీరులు తనవెంట నడువ.
దివిజులు చూపిరి దివ్యాస్త్రవిద్య
పెకలించి రసురులు వృక్షముల్ గిరులు.
అమరు లేసిన దారుణాస్త్రమ్ము లెల్ల
పిండిపిండయ్యె నాకొండలక్రింద.
అసురులు మడిసి రాయమరులున్ పడిరి
వణకె బ్రహ్మాండ మారణసమున్నతికి
వృత్రాసురం డొక పెనుకొండ వోలె
వచ్చి యుగ్రుండయి వాసవుపైకి
శూలమ్ము విసరె నాశూలసంహతికి
ఐరావతము తూలె నమరేంద్రుచేతి
వజ్రాయుధమ్ము జారి వసుధపై బడియె
దీనుఁడై యిందు్రుండు దిగులొంది యుండె.
వృత్రాసురం డొక వింత రాక్షసుఁడు
ఆత్మతత్త్వ మెఱుంగు అధ్యాత్మవిదుఁడు
శ్రీహరిన్ నమ్మిన స్థిరభక్తుఁ డతఁడు
హరిని ధ్యానించుచు నని సేయ వచ్చి
అమరేంద్రు నీరీతి నవమాన పఱచె.
దీనుఁడై యుండిన దేవేంద్రుఁ జూచి
హేళనచేయు చావృత్రాసురుండు

“నిలువు మోనాకేశ నిలువు మోయింద్ర!
పారిపోబోకు మీసంభవ మెంచి
విశ్వరూపుని లోకవిఖ్యాత గురుని
నాయగ్రజున్ బట్టి న్యాయ మెంచకయె
చంపఁజాలితి వీవు తెంపరి వగుచు
నీవాయుధము లేక నిలుచున్న తరిని
నినుజంపు తెంపరిన్ నేను గానింద్ర!
పస చెడ లేదు నీవజ్రాయుధమ్ము
కదనమ్ము నకు రమ్ము కైకొమ్ము దాని
ఆత్మలో నిలుచు శ్రీహరియె నాకిపుడు
జయ మపజయమును సమములే నాకు”
అనిన వృత్రునిమాట కద్భుతమ్మంది
నూతనోత్సుకతతో దైతేయు పైకి
ఐరావతమ్మెక్కి ఆయుధ మ్మూని
అమరేంద్రుఁ డేతెంచె ననిసేయుకొఱకు.

వచ్చెనో లేదో ఆవాసవుం డనికి
జగము సర్వము మ్రింగఁ జాలిన తనదు
దారుణోగ్రకఠోర దంష్ట్రా కరాళ
పాటవ జ్వాలదగ్ని వక్త్రమ్ము తెఱచి
ఐరావతముతోడ నమరేంద్రుఁ బట్టి
వృత్రుండు కబళించె భీషణాకృతిని.

హాహాకృతులు రేగె నమరలోకమున
అట్టహాస మెసంగె నసురసైన్యమున
దేవతల్ పాఱిరి దిశల వెంబడిని.
అమరేంద్రుఁ డంతట నాత్మధైర్యమున
శ్రీహరిరూపమ్ము చిత్తాన నిలిపి
కలిత నారాయణకవచ ప్రభావ
పటుతరోద్రేకుఁడై వజ్రాయుధమున
వృత్రుని యుదరమ్ము భేదించి వేగ
ఐరావతముతోడ నరుదెంచె పైకి
వజ్రాయుధస్ఫుట పాటనాహతికి
కొండంత మేనితో కూలిని వృత్రు
దేహమందున దివ్యతేజ మ్మొకండు
వెలువడి వచ్చి శ్రీవిష్ణునిఁ జేరె
అఖిలజగమ్మున కాశ్చర్య మొదవ.
దేవేంద్రుఁ డాత్మలో కావర మ్ముడిగి
భక్తిమీఱఁగ బృహస్పతివద్ద కేగి
తనతప్పు క్షమియింపు మని మ్రొక్కి వేడి
కొనివచ్చె సురలోకగురువుగా మరల
హరికృపచేతనే అమరధామమ్ము
సంపదారామమై పెంపొందె మరల
ననుచు కీర్తించి రా యమరు లెల్లరును
విష్ణునిమహిమను వేనోళ్ళపొగడి.

హాహాకృతులురేగె నమరలోకమున
అట్టహాస మెసంగె నసురసైన్యమున
దేవతల్ పాఱిరి దిశల వెంబడిని.
అమరేంద్రుఁ డంతట నాత్మధైర్యమున
శ్రీహరిరూపమ్ము చిత్తాన నిలిపి
కలిత నారాయణకవచ ప్రభావ
పటుతరోద్రేకుఁడై వజ్రాయుధమున
వృత్రుని యుదరమ్ము భేదించి వేగ
ఐరావతముతోడ నరుదెంచె పైకి
వజ్రాయుధస్ఫుట పాటనాహతికి
కొండంత మేనితో కూలిని వృత్రు
దేహామందున దివ్యతేజ మ్మొకండు
వెలువడి వచ్చి శ్రీవిష్ణునిఁ జేరె
అఖిలజగమ్మున కాశ్చర్య మొదవ.
దేవేంద్రుఁ డాత్మలో కావర మ్ముడిగి
భక్తిమీఱఁగ బృహస్పతివద్ద కేగి
తనతప్పు క్షమియింపు మని మ్రొక్కి వేడి
కొనివచ్చె సురలోకగురువుగా మరల
హరికృపచేతనే అమరధామమ్ము
సంపదారామమై పెంపొందె మరల
ననుచు కీర్తించి రా యమరు లెల్లరును
విష్ణునిమహిమను వేనోళ్ళపొగడి.

అనుచరవరుల కిట్లాజ్ఞల నొసఁగె.
"అసురుల శత్రువై హరియను వాఁడు
తిరుగుచుండెను తానె దేవుఁడ ననుచు.
హరి దేవుఁ డెట్లగు హంతకుం డతఁడు
హతమార్చె నతఁడు నా యనుజునిఁబట్టి
హరిని లోఁగొనక నే నణఁగియుండెదనె.
పట్టుడు కొట్టుడు పరిమార్పు డింక
ఎచటనుండిన నతఁ డెచటఁ గన్పడిన.
హరిమాట లేకుండ నవనిపై నింక
యజ్ఞముల్ క్రతువులు యాగమ్ములెల్ల
ధ్వంస మొనర్పుడు దర్పమ్ము మీఱ.
మనుజులు దేవతల్ మునివరులైన
ఇకమీఁద హరిమాట నెవ్వ రెత్తినను
కాల్పుడు చంపుడు కడిమిమై ననఁగ

రాక్షసరాజాజ్ఞ రయమునఁ గొనుచు
హరినిఁ బట్టెదమంచు నన్నిదిక్కులకు
బయలుదేరెను దైత్యబలము సర్వమ్ము
దేశదేశములందు దిశలవెంబడిని
ధీరులై వీరులై తిరుగుచు వారు
హరియను శబ్దమ్ము నాలించి నంత

పలుబాధలను బెట్టి ప్రజల హింసించి
స్త్రీలను చెఱఁబట్టి శిశువులఁ జంపి
యజ్ఞయాగాదుల నంత మొందించి
సకలబీభత్సమ్ము సలిపి ధారుణిని
హారినిఁ గానఁగ లేక మరలి రింటికిని.

కలుషాత్ముఁడు హిరణ్యకశిపుండు మదిని
తమ్ముని మృతినెంచి తల్లి నోదార్చి
ఏలోకమందున్న నెచట డాగినను
హారిని రణమ్ములో పరిమార్పగలుగు
బలపాటవమ్ములఁ బడయఁ దలంచి
తనకోర్కె లీడేరు ఘనయత్న మమర
బ్రహ్మదేవునిఁగూర్చి పటుదీక్షతోడ
ప్రారంభ మొనరించె ఘోరతపమ్ము.

దనుజేశుఁ డారీతి తపమున కేగ
అమరులు దండెత్తి రసురుల పైకి
గర్భవతి హిరణ్యకశిపుని సతిని
బంధించె నింద్రుఁ డా పడతిగర్భమున
పెరుగు బాలునిబట్టి పరిమార్పఁ దలచి.
అంతలో నారదుం డచటికే తెంచి
"ఇంద్రుఁడా! నీ కేల నీపాడుతలపు

ఘనుండవౌదువె నీవు వనితను బట్టి
ఈమెను విడు మింక నీమెయందున్న
దనుజవీర్యమ్మున జనియించుశిశువు
పరమభాగవతుండు హరిభక్తుం డగును
ఆతనిని జంప నీచేతేమి కాదు
వదలు మటంచు నావనితం గొంపోయి
యాశ్రయమ్మిడె తనయాశ్రమమందు.
దైత్యేంద్రురాణియు తపసి నారదుని
సేవించె సద్భక్తిభావమ్ము లలర.
ఆమెకు నారదుం డత్యాదరమున
బోధించె తత్త్వార్థ పుణ్యధర్మములు
శ్రీహరిమహిమయు శ్రీహరి శక్తి
జ్ఞానియయ్యెను విని లోనున్నశిశువు
సులువుగా నొకనాంటి సుముహూర్తమందు
ప్రహ్లాదుం డుదయించె రాణిగర్భమున.

ఆ హిరణ్యకశిపు నత్యుగ్రతపము
విలయాగ్నివలె లోకభీకరమయ్యె
బ్రహ్మవిచ్చేసి యారాక్షసున్ లేపి
కూర్మితో వరములు కోరుకొమ్మనియె.
జగమున తనకిక చావులేకుండ
యోచించి యోచించి యుల్లమ్ము నందు

నేలను నింగిని గాలినిగాని-
అగ్నిని జలముల నాయుధమ్ములను
సకలజంతు విహంగ చయముల చేత
అఖిలభూతములచే నమరులచేత
మరణమ్ము రాకుండ వరములఁ గొనియె
బ్రహ్మకు మ్రొక్కి యారాక్షసరాజు

బ్రహ్మయిచ్చిన ఘనవరములవలన
దైత్యుండు బలగర్వదర్పితుం డగుచు
హరిమీద కోపాన నంతకంతకును
సకలలోకమ్ముల సంక్షోభపఱచి
ముప్పుతిప్పలు బెట్టి మునులను జనుల
దివికేగి దర్పాన దేవేంద్రు గెలిచి
తనయంతవాడింక ధరణిలే డనుచు
జగదేక వీరుఁడై చరియించు చుండె.
ఆగలేకింక నాయసురేంద్రు ముందు
సురలును మునులును మొఱపెట్టుకొనిరి
విష్ణునికడ కేగి వినయభావమున.
విష్ణుదేవుఁడు వారివినతు లాలించి
ప్రియముగా మాట్లాడి వెనుకకుఁ బంపె
"ప్రబలుఁ డాదైత్యుని పాపమ్ము పండె
చచ్చును నాచేత సత్వరమ్ముగనె
భయము వీడుడు మీకు భద్ర మాననుచు

ఆ హిరణ్యకశిపు నాత్మజులందు
పెద్ద ప్రహ్లాదుండు వినయవంతుండు
సకల సద్గుణరాశి సౌజన్యమూర్తి
రాచబిడ్డ నటంచు రవ్వంతగూడ
కావరమ్మును లేదు గర్వమ్ము లేదు
వివిధసంపద్భాగ్య విభవ ముండియును
వైరాగ్యమే గాని వాంఛలు లేవు
పిన్నల మన్నించు పెద్దలన్ గొలుచు
మహిళల జూచును మాతృభావమున
సకల జీవులయందు సమహితత్వమున
చరియించు సముచిత సద్భావుఁ డతడు
బాల్యమ్మునుండి యాబాలుని కెపుడు
హరిచింతనమె గాని యన్యమ్ము లేదు
హరికీర్తనమె గాని మఱుమాట లేదు
హరిసేవ యాతని కఖిలమ్ము భువిని
హరినె ధ్యానించుచు పరవశుం డగుచు
ప్రార్థించు నొకచోట పడియుండు నొకట
ఒకచోట విలపించు నొకచోట నవ్వు
తనయంత హరిభావ తాదాత్మ్య మందు
ధరణినెల్ల మఱచి తనమేను మఱచి
ఏదియో పరమార్థ మెఱిగిన యటుల.

హరిచింతనమె తక్క యన్యమ్ము మఱచి
తిరిగెడు బాలుని తిలకించి తండ్రి
బాలుని నడతకు వగచి చిత్తమున
అలవడవలెఁ గాని కులధర్మ మవని
తమ కులవైరియా కమలాక్షు పైన
బాలుని కీభక్తి పనికిరా దనుచు
బుద్ధిశాలిగఁ జేయ పుత్రుని వేగ
పనిపె చండామార్కు లనువారికడకు
ప్రహ్లాదుఁ గొంపోయి బడికి వారిర్వు
రనుదిన మ్మతనికి ననురక్తి మీఱ
"మఱచిపొమ్మోబిడ్డ హరిమాట నింక.
నిలుపుము నీవంశ నీతియే మదిని
రాక్షసకులయోగ్య రాజనీతులను
నేర్చి పాలింపు మీ నిఖిలధారుణిని
నీతండ్రి పేరును నిలుపు మటంచు
కూర్మి బోధించి రా గురువులు గాని
చెవికెక్కలే దవి చిఱుతబాలునికి.
మందార మకరంద మధురధారలను
మమతతోఁ గ్రోలెడి మధుపసంతతుల
కిష్టమ్ము లేనట్టు లితర మేదియును
హరిసేవలందున మరగినవాఁడు
హరినామమధురిమ నెఱిఁగినవాడు

హరిచింతనామృత మ్మానెడువాఁడు
ప్రహ్లాదునకు మది పట్టదావంత
హరిభావమేగాని యన్యమేదియును.

పాఠశాలకు వచ్చి బాలురఁ బిలిచి
బోధించుచుండును మాధవసేవ
"పరికింతురే మీరు బాలకులార!
బాలురు కొందఱు బాల్యమ్మునందె
అగచాట్ల నందుచు నపమృత్యు వంది
పడుచుందు రెన్నియో బాధలు భువిని
ధరణిని వీనినిఁ దప్పించుకొనుచు
జీవితలక్ష్యమ్ము చేకూటకొఱకు
మార్గమ్ము చెప్పరు మనగురూత్తములు.
ఇహపరసుఖముల కిరవైనదారి
హరిపూజనము కంటె నన్యమ్ము లేదు.
జన్మసాఫల్యమ్ము సాధించుకొఱకు
మాధవస్మరణమే మార్గమ్ము భువిని
శ్రీహరి కొనరించు సేవయే సేవ
పురుషోత్తముని గొల్చు పూజయే పూజ
ఆతఁడె రక్షకుం డాతఁడె తండ్రి
ఆతఁడె పోషకుం డవని నెల్లరకు
హరిపద స్మరణమే పరమార్థ మవని

హరిని జేరుటయె యీయాత్మకుసిద్ధి
వనజాక్షుఁ గొలువని తనువు వ్యర్థమ్ము
పద్మాక్షుఁ దలవని బ్రతుకెల్ల చేటు
కావున మీరలు కమలాక్షు పూజ
సలుపుచు నిత్యమ్ము శాశ్వతసుఖము
బడయుఁ" డంచును చెప్ప బ్రహ్లాదుమాట
లాలించి తక్కిన బాలురుగూడ
హరిపదభక్తులై తిరుగుటఁ జూచి
పరితాపమందిరి గురువు లిద్దఱును.

ప్రహ్లాదుఁ డారీతి ప్రతినిమేషమ్ము
నిదురించుచున్నను నీరు ద్రావినను
ఆటలాడుచునున్న మాటాడుచున్న
హారమ్ము గొనుచున్న దూర మేగినను.
శ్రీహరి చరణాబ్జ చింతనమ్మందె
మఱగి సర్వజగమ్ము మఱచుచునుండె
కాలమంతటఁ గొంత గడచిన వెనుక
దనుజేశుఁ డొకనాఁడు తనయుని బిలిచి
చదువెంతవఱకును సాగిన దనుచు
ప్రశ్నింపగా చెప్పె ప్రహ్లాదుఁ డిట్లు
"గురువు లిద్దఱు నన్నుఁ గొనిపోయి బడికి
చదివించినారు నేచదివితిఁ దండ్రి

సకలశాస్త్రమ్ములు సకలవిద్యలను
చదువులయందలి సారమ్ము నెల్ల.
వినుమయ్య ఈసర్వవిద్యలయందు
చదువులందునఁ గల సత్యమొక్కటియె.
హరి యఖిలేశుఁడు హరియె సర్వమ్ము
ఆతఁడె రక్షించు నఖిలజీవులను
హరికంటె ధారుణి నన్యమ్ము లేదు
కావున మనకిల కర్తవ్య మొకటె
కరములున్నందుకు హరిని పూజించి
చూడ్కు లున్నందుకు చూచి శ్రీహరిని
జిహ్వతో వర్ణించి శ్రీహరిమహిమ
శిరమువాలిచి మ్రొక్కి శేషతల్పునికి
జన్మ ధన్యముగాఁగ చరియింప వలయు
ఇంతకంటెను ధర్మ మిలయందు లేదు
ఇంతకంటెను సత్య మిలఁ గానరాదు
తనయుని మాటలు విని దైత్యవిభుఁడు
నెమ్మదిలో కడు నివ్వెఱవోయి
"ఇదియేమి బాలకా! యెవరు నీకిట్లు
చెడుత్రోవ లన్నియు చెప్పినవారు.
మన కులమర్యాద వెనుకకు నెట్టి
హరిని దేవుఁడటంచు నర్చింతు వీవు

హరి హంతకుండు నాయనుజునిఁ జంపె
ప్రబలశత్రు వతండు రాక్షసతతికి
మన ప్రాభవమ్మేమి మన కులమ్మేమి
హరినిఁ గొల్వంగ నీకవసరమ్మేమి ?
త్రిభువనమ్ముల గెల్చు ధీరుఁడ నేను
జగము వణంకు నా శౌర్యసంపదకు
హరి పీసమైనను సరిరాడు నాకు
యువరాజువై నీవు జవశక్తు లలర
దేవేంద్రు నోడించి దివి నేలుకొనుము
జగమెల్ల గెలుపుము జగజాణ వగుచు
రాక్షసవంశపు రాణ దీపింప
కనక కాంతా రత్న ఘనభోగభాగ్య
మనుభవింపుము ధాత్రి నంతియే గాని
హరి యంచు మతిలేక తిరిగెద వేల
మాధవున్ మఱచి యీమహి నేలుకొనుము"
అను తండ్రికిని కడువినయుఁడై మ్రొక్కి-
ప్రణతు లర్పించి యాప్రహ్లాదుఁ డపుడు
"మన్నింపుమయ్య నామాటకు తండ్రి !
విను మొక క్షణము నీ విభ్రాంతిమాని.
హరి హంతకుఁడుగాడు కరుణామయుండు
రక్షించు మంచిని శిక్షించు చెడును
సర్వలోకాధార సద్గుణుం డతఁడు

సర్వేశ్వరుఁ డతండు సర్వమయుండు
హరిపదసాయుజ్య పరమార్థ పదమె
జన్మసాఫల్యమ్ము జగతి నెల్లరకు
ఈరాజ్య మీభోగ మివియెల్ల మిథ్య
హరియె సత్యము నిత్య మవ్యయపదము
తారక మ్మానందధామమ్ము తండ్రి!
కావున నీవును కమలాక్షు సేవ
కావించి నినునీవు కాపాడు కొనుము
అజ్ఞానమును వీడి అరయు మీనిజము
వాఙ్మనఃకర్మల పద్మాక్షుఁ గొలిచి
నిర్మూలనము జేసి నీపాపములను
జ్ఞానమ్ము నందుమో దానవరాజ!
మన మేను మన బుద్ధి మన జీవితమ్ము
వ్యర్థముల్ పద్మాక్షు నర్పింపకున్న
అచ్యుతున్ భక్తితో నర్పించి నపుడె
సార్థకమ్ములు మనసర్వాంగములును
చక్రిదాస్యమె బాపు సంసారభయము
హరిపూజనమె మాపు దురితసంఘమును
ఘనవిపత్తులఁ ద్రోలు కమలాక్షు నుతియె
హరిచింతనమె విను మవ్యయమైన
ముక్తిధామమునకు ముఖ్యమార్గమ్ము

కావున నో తండ్రి కమలాక్షుసేవ
సేవింపఁ జాలను నిశ్చయ" మ్మనంగ

నుడివిన దెల్లను పెడచెవి బెట్టి
దనుజలోకమునకు ఘనశత్రువైన
హరిని కీర్తించుచు ననవరతమ్ము
తనముందు నిలబడి ధైర్యమ్ముతోడ
తనకె బుద్ధులు చెప్పు తనయు వాక్యములు
ములుకులై నాటంగ మూర్ఛిల్లి లేచి
తనయుని లోగొన తగునుపాయముల
తలపోయు చుండెను దైత్యవిభుండు.
సుతుని కేగతినైన మతిమారు ననుచు
ఎంతవేచిన గాని యెంతచూచినను
పద్మాక్షుపై భక్తి ప్రహ్లాదు మదిని
పెరుగుచుండెను గాని తరుగుట లేదు
పితరుని వాక్యముల్ పెడచెవిఁ బెట్టి
వెఱవక దేనికిన్ సరకు గైకొనక
హరిని కీర్తించుచు ననవరతమ్ము
కనుపడ్డవారికి దినమెల్ల తిరిగి
హరిపదభక్తినే యలవడఁ జేయు
సుతునివర్తన మెల్ల చూచిన కొలఁది
తలగొట్టినట్లయ్యె దనుజనాథునకు.

"తాఁజెడినఁ గాక తనవారి నెల్ల
చెడఁగొట్టుచుండె నీ చెనటిబాలకుఁడు
కులము నశించు నీకుటిలునివలన
పుత్రుఁ డితఁడు గాఁడు శత్రువు గాని
ఆలోచనము మాని ఆలసింపక యె
ప్రహ్లాదు నతివేగ పరిమార్చ టొకటె
కార్యమ"ని హిరణ్యకశిపుండు తలచి
జాలిసుంతయు లేక బాలుని బట్టి
గజముచేఁ ద్రొక్కించె గదల మొత్తించె
పాములఁ గరపించె వార్ధిలో ముంచె
వేడిమంటల నుంచె విసము ద్రావించె
పర్వత మెక్కించి పైనుండి త్రోసె
శస్త్రాలఁ బొడిపించె శాపమ్ము లిచ్చె.
ప్రహ్లాదుఁ డీక్రూర బాధలఁ బడుచు
హరిహరీ! రక్షింపు మనుమాట కాని
పారిపోవగ లేదు భయమంద లేదు
మనసులో మాధవున్ మఱవంగ లేదు
బాధలన్నింటి నోర్చి పసిపాపఁ డాత
డిసుమంతయును గూడ కసుగంద లేదు.

అయిదేండ్ల బాలుని అతిశయ మ్మెటుల
చూచి దైత్యేశుఁడు చోద్యమ్ము నంది

వ్యర్థమయ్యెను తన యత్నమ్ము లనుచు
భగ్నాశుఁడై తనబలమును చూప
నిప్పులు గురియుచు నేత్రమ్ములందు
పటపట కొఱుకుచు పండ్లు దీటించి
పలికెను గద్దించి బాలుతో నిట్లు
"ఓరోరి డింభకా! ఓరోరి తులువ
ఓరి పితృద్రోహి! ఓరి నీచుండ!
నావంశమెల్లను నాశ మొనర్ప
పుట్టితివి విట పుత్రరూపమున
విసపుతీగగ నీవు వృద్ధినందితివి
హరియంచు హరియంచు నఱచెద వేల
ఉర్వికి ప్రభువు నేనొకడనే గాని
హరిలేడు గిరిలేడు యెఱుగు మీమాట
హరియున్నచో చూపు మవని నెందైన
వాడెందు డాగిన వాడెందు చనిన
వానిని నిన్నును పరిమార్తు ననుచు
ఆగ్రహోన్మత్తుఁడై యట్టహాసమున
గదనెత్తి తనపైకి కదలి రా జూచు
జనకుని గనుగొని వినయభావమున
పలికెను ధీరుఁడై ప్రహ్లాదుఁడిట్లు
"ఎందుడాగెను హరి యెందుండె ననుచు
సందియ మేలను జనక నీకింక

సర్వాత్మకుఁ డతండు సర్వమయుండు
ఎందెందు వెదకిన అందందె కలడు
నమ్ము మీసత్యమున్ నెమ్మది" ననుచు
ప్రహ్లాదుఁ డనినట్టి పలుకుల కులికి
ఉగ్రుఁడై ముందున కురికి దైత్యుండు
"నిలిచి నామ్ముం దిట్లు పలుకుదు వీవు
నీకు కావరమెంత నెగడిన దోరి
హరి సర్వమయుఁడని అఱచుచున్నావు
చూపు మాద్రోంగను చూపుమిం దనుచు
భీషణాకృతితోడ పెనుగద బూని
ఎగసి రోషమ్ముతో నెదురుగా నున్న
స్తంభమున్ గొట్ట నాస్తంభమ్మునుండి
ఒకకోటి మార్తాండు లుదయించి నట్టి
తేజమొక్కటి లేచి దిశలెల్ల నిండి
బ్రహ్మాండమే వ్రీలి బ్రద్దలై నట్లు
దుర్నిరీక్ష్యప్రభాస్తోమ దంష్ట్రోగ్ర
నరసింహరూపమై హరియు వెల్వడుచు
దర్పసమగ్రుఁడై దైత్యుపై కురికి
"కలుషాత్మ! హిరణ్యకశిపరాక్షసుఁడ
వసుధ నిప్పటికి నీపాపమ్ము పండె
చూడు మిచ్చట నీవు చూడఁ దలంచు
హరి నేగుదెంచితి పరువెత్తు" మనుచు

వెఱగంది దైత్యుఁడు వీక్షించులోన
తనయంకతలమున దైత్యుని బట్టి
పెనుగోళ్ళ నాతని ప్రేగులు చీల్చి
అరనిముసమ్ములో నంత మొందించె.
హరిభక్తులకు పెద్దఅవరోధ మైన
క్రూరదైత్యుం డిట్లు కూలినందులకు
దివియందు మ్రోగెను దేవదుందుభులు
భువియందు గురిసెను పుష్పవర్షములు
చూపరు లందఱు చోద్యమందంగ
అసువులఁ బాసిన యసురేంద్రునుండి
దేదీప్యమానమౌ తేజ మొకండు
దివి కేగె నతులిత దీప్తులతోడ.

ఎవ్వనిఁ గాంచగా నీనాఁటి దనుక
ప్రార్థించుచుండెనో ఆకృపాకలిత
హరిరూపమైన శ్రీనరసింహు నరసి
కై మోడ్చి వినయుఁడై కాళ్ళకు మ్రొక్కి
భక్తిభాసురుఁడయి ప్రహ్లాదుఁ డలరి
తాదాత్మ్యమందె నాదైవభావమున.
ప్రజలు హర్షించిరి భయము లడంగె
బ్రహ్మయు రుద్రుఁడున్ వాసవుఁడాది
మునులును దేవతల్ ముదమున వచ్చి

భాగవతాగ్రణి ప్రహ్లాదు మెచ్చి
శ్రీవీర నరసింహ దేవుని కెఱగి
వేయివిధాల నాశ్చర్యమహిమ
వినయవిధేయులై వినుతించినారు
పాహి పాహి యటంచు బార్థించినారు.
అఖిలలోకాధారుఁ డాశ్రితావనుఁడు
దుష్టమర్దనుఁడును శిష్టపోషకుఁడు
భక్తమనోవాసి వాత్సల్యరాశి
ప్రవిమలగుణకీర్తి అవతారమూర్తి
హరియె శరణ్యము మాకఖిలజీవులకు
ఆతంకములు రావు హరిభక్తి కెందు
అపజయములు లేవు హరిభక్తి కెపుడు
భవబంధహరణమ్ము పాపనాశనము
పుణ్యప్రదమ్మును మోక్షదాయకము
అఖిలసంపద లిచ్చు హరిభక్తి యనుచు
జయ జయధ్వానముల్ సలిపిరి హరికి.

ఉగ్రరూపము నంత నుపసంహరించి
నరసింహరూపుఁడౌ హరి ప్రీతితోడ
పరమభక్తుండైన ప్రహ్లాదుఁ బిలిచి
అత్యాదరమ్మున నాశీస్సు లిచ్చె.

విసయులై తనవైపు వీక్షించుచున్న
ప్రజలను మునులను బ్రహ్మ రుద్రాది
దేవతలను ప్రీతి భావించి పలికి
విజయనృసింహుడు నిజరూపుదాల్చి
వైకుంఠమున కేగె వైభవ మ్మొసఁగ.
హరినాత్మఁ దలచుచు నరిగిరి తిరిగి
జనులును మునులును సర్వదేవతలు.

కరుణాంతరంగుఁ డాహరి యాదరమున
పరమభక్తుండయి ప్రజల మేలెఱిఁగి
సకలసంపదలును సౌఖ్యమ్ము లంది
ప్రహ్లాదుఁ డేలెను వసుధఁ బెక్కేండ్లు.

కొండంత రాక్షసోద్దండుని మీద
ఎలుకంత ప్రహ్లాదుఁ డెదిరించి గెలిచె.
అదియె శ్రీహరిభక్తియందున్న మహిమ
అదియె శ్రీహరిభక్తులందున్న బలము.

హరికిఁ బ్రియుండయ్యు హరిభక్తుఁ డయ్యు
వసుధేశుఁ డయి మహాబలశాలి యయ్యు
గర్వమింతయు లేక కడుశ్రద్ధతోడ
సకలధర్మమ్ముల సార మెఱుంగ-

ధరణిని తిరుగుచు తపసి వేషమున
అతులతేజస్వియా యతివరు నొకని
కావేరితీరానఁ గాంచి శిష్యుఁ డయి
యాతని కడనుండి ఆత్మచింతనయు
తత్త్వసారము లోకధర్మపద్ధతియు
భాగ్యభోగ్యములందు వలయు సంతృప్తి
జీవితౌన్నత్యమ్ము చిత్తోపశాంతి
సకలయోగాభ్యాస సత్ప్రవర్తనము
సంపూర్ణ వైరాగ్య సాధువర్తనము
గ్రహియించి ధన్యుఁడై ప్రహ్లాదుఁ డరిగె.

భాగవతాగ్రణి పరమవైష్ణవుఁడు
జ్ఞానియు సద్గుణసంపన్నుఁ డగుచు
ఆచంద్రతారార్కమగు కీర్తి నంది
పిన్నలు పెద్దలు పృథ్వి నెల్లరకు
మార్గదర్శకుఁ డయి మహితాత్ముఁ డగుచు
ప్రథితచరిత్రుఁడై ప్రహ్లాదుఁ డలరె.

---

## త్రిపురాసుర వధ

దుష్టదైత్యుల బాధ దొలఁగఁ జేయంగ
సిద్ధమై యుండును శ్రీహరి యెపుడు.

హరియనుగ్రహముచే నమర సైన్యములు
దితిజుల నోడింప దీనులై వారు
మయు నాశ్రయించిరి; మయ దానవుండు
పటుశక్తిగల మూడు పట్టణమ్ములను
నిపుణత వారికి నిర్మించి యిచ్చె.
త్రిపురమహాత్మ్య సందీప్తులై వరలి
అసమాన వీరులై యసురులు మరల
బాధింపసాగిరి స్వర్గవాసులను.
అమరులు భయమంది యభవునిఁ జేరి
ప్రార్థింప శంభుండు రయమున వచ్చి
త్రిపురాసురులఁ జంపె తీవ్రయుద్ధమున.
బ్రతికించె మరల నా దితిజుల నెల్ల
అమృతసారముగల అంబువు లున్న
బావుల యందున పడవేసి మయుఁడు.
వ్యర్థమయ్యెను తన యత్నమటంచు
శివుడు చింతింపగా శ్రీహరి వేగ
ఆవుగా వచ్చి బ్రహ్మను దూడ జేసి
బావు లందలి నీరు త్రాగె సర్వమ్ము
అమృతసారములైన అంబువుల్ పోయి
అసహాయులైరి యా యసురు లెల్లరును.
శ్రీహరియంతట శివున కొసంగె
దివ్యరథమ్మును దివ్యాయుధములు.

వానితో నేగి యాభర్గుఁడు వేగ
త్రిపురసంయుతముగా దితిజు లందఱిని
రణరంగమునఁ గూల్చి ప్రఖ్యాతివడసె
త్రిపురాంతకుండని త్రిభువనమ్ములను.



## చతుర్విధాశ్రమములు

పుడమిని మానవుల్ పుట్టినదాది
జీవనక్రమమును చెలువుగా గడపి
జీవితలక్ష్యమ్ము చేరుట కొఱకు
నిగమానుసారమ్ము నియతమ్ములయ్యె
ఆశ్రమమ్ములు నాలు గాచరించుటకు.
నరుని పూర్ణాయువు నాల్గుపాళ్ళగుచు
చెల్లు నీయాశ్రమ జీవితమ్ములను.



## బ్రహ్మచర్యము

వానిలో మొదటిది బ్రహ్మచర్యమ్ము
సంపాదనము సేయ సర్వవిద్యలును
సద్గుణమ్ముల నెల్ల సమకూర్చు కొనగ
బ్రతుకునకు పునాది బ్రహ్మచర్యమ్మె.

పృథివిని ముఖ్యముగా విద్యార్జనమ్ము
బ్రహ్మచర్యమునందె పడయంగవలయు.
జనులసందడి లేక శాంతమై యుండు
గురుకులమ్మున మంచిగురువులఁ జేరి
గురునకు శుశ్రూష లిరవుగా సలిపి
వలసిన విద్యల బడసి పూర్ణముగ
గురువుల దక్షిణ నెఱిగి యొసంగి
వినయవిధేయులై విలసిల్ల వలయు.
బ్రహ్మచర్యమ్మున పరగువా రెల్ల
భైక్షుకవృత్తిని బ్రతుకంగ వలయు.
తనువం దలంకృతుల్ తరుణితో చెలిమి
బ్రహ్మచర్యమ్మున పనికిరా వెందు
ప్రతివ్యక్తికిని గూడ పాటింపదగిన
పరమధర్మము లివి బ్రహ్మచర్యమున.

---

## గృహస్థాశ్రమము

తరువాతిదగు గృహస్థాశ్రమ మందు
గృహిణియు దానును ప్రేమతో మెలగి
సత్పుత్ర పుత్రికా సంతతి వడసి
సహజవృత్తుల తగు సంపద నంది
సంతృప్తిగ బ్రతుకు సాగింపవలయు.
జన్మసిద్ధినొసంగు సాధనలందు

కడు సులభమ్మగు కర్మయోగమున
కాశ్రయ మ్మీగృహస్థాశ్రమ మ్మరయ
పడసినవిద్యల ఫలము నందంగ
ననువైన దీగృహస్థాశ్రమ స్థలమె.
సత్య దయా శాంతి శౌచమ్ము లెసగు
అనుదిన వర్తనాభ్యాసమ్ము వలన
శమ దమ నియమముల్ సాధింపవలయు.
సజ్జనులనుగూడి సఖ్యమ్ము నెరపి
సత్కావ్యపఠనాది సద్గోష్ఠి విధుల
నిత్యమ్ము శ్రద్ధతో నెఱపుచునుండి
అతిథుల నర్థుల నాదరించుచును
సత్కృతుల్ నిరతమ్ము సలుపంగ వలెను.
తీర్థయాత్రలుఁ జేసి దేవు నర్చించి
దైవపూజా భక్తితత్పరు లగుచు
దానధర్మము లిచ్చి ధన్యతం గాంచ
ననుకూల మీగృహస్థాశ్రమ విధులె.
తగురీతిపాలించి తనధర్మమెల్ల
సంతతిన్ సద్గుణవంతుల జేసి
ధర్మమార్గమునందు తప్పకనిల్పి
వసుధమీద గృహస్థు వర్తించి నపుడె
తక్కిన ఆశ్రమధర్మము లెల్ల
సాగుటకును గల్గు సదవకాశమ్ము.

## వానప్రస్థము

కామమోహమ్ముల ఖండించి వైచి
సంసారవృత్తులు సమయింపఁ జేసి
చాలించి తమగృహస్థాశ్రమసుఖము
నరు లేగవలయు వానప్రస్థమునకు
నియమవర్తను లయి నిర్లిప్తు లగుచు
జడలను ధరియించి అడవుల కేగి
అనువుగా నిర్మించి ఆశ్రమ మ్మొకటి
లభియించు కందమూలమ్ము లే తినుచు
ఉపవాసదీక్షల నొప్పుగా సలిపి
అధ్యాత్మచింత నాభ్యాసమ్ము నందె
కాలమ్ము నంతయు గడపంగ వలెను
నరుల కీపుణ్యవానప్రస్థమందు
జపతపస్సాధనే సర్వముఖ్యమ్ము.
చిత్తోపశాంతిని చేకూర్చుకొనుచు
దైవభక్తినిగల్గి ధ్యానయోగమున
బ్రతుకుబాటను సిద్ధి బడయుటకొఱకు
వలయుప్రదేశమ్ము వానప్రస్థమ్మె.

---

## సన్యాసము

సర్వమ్ము త్యజియించి సకలమ్ము మఱచి
వాంఛలన్నియు వీడి వైరాగ్యమూని

పరమాత్మ దర్శన పరమార్థ మొకటె
ఆశ్రయం దిడుకొని యన్యమ్ము మాని
నెలవన్నదియె లేక నియతాత్ముఁ డగుచు
సంచరించుటె భువి సన్యాసదీక్ష.
సర్వేశ్వరుఁడు దక్క సన్యాసి కిఁను
భవబంధములు లేవు బంధువుల్ లేరు
కావింపఁ దగినట్టి కర్మముల్ లేవు
సర్వ మీశ్వరమయ మ్మర్వి నాతనికి.
సర్వజీవులయందు సమదృష్టిగలిగి
సమదర్శియగుటయే సన్యాస మరయ.
దండ కౌపీనముల్ దక్క వేఱొండు
ధరియింపఁగారాదు ధరణి సన్యాసి
ఒంటరిగా నుండి ఒకరి సాంగత్య
మభిలషింపంగ రా దన్నిపై నతడు.
దేహాభిమానమ్ము దిగద్రోసిపుచ్చి
త్రిగుణవర్తనల కతీతుఁడై మెలగి
ఏకైకదీక్షతో హృదయమం దెపుడు
బ్రహ్మభావమ్మును బడయంగ వలయు.

జీవనావధియగు సిద్ధి నొసంగి
జగతిపై మఱి పునర్జన్మమ్ము లేని
శాశ్వత పరమాత్మ సాయుజ్య మందు
అవ్యయమ్మైన యాత్మానంద మిడెడు
ఆధ్యాత్మికము తురీయాశ్రమ మిద్ధి.



# శ్రీ మహాభాగవతము

## అష్టమస్కంధము

### గజేంద్రమోక్షము

దిశలు సర్వమ్మును తేజరిల్లంగ
రజత కాంచన లోహ రమ్యదీధితుల
చెలు వెసంగెడు మూడుశిఖరాలతోడ
నలరుచుండె త్రికూటమను పేరు గలిగి
పాలసంద్రమ్మున పర్వత మొకటి.
నదులు సరస్సులు మృదుసమీరములు
చల్లని యుపవనాలు సానువు లొప్పి
సుఖనివాసమ్మయి యఖిలజీవులకు
శోభిల్లుచుండె నా క్షోణీధరమ్ము.

ద్రవిడధాత్రీశుఁ డింద్రద్యుమ్న రాజు
మునిశాపమున నేనుజననమ్ము నంది
గజరాజమై పెక్కు గజయూథములకు
కరిణీచయమ్ములఁ గలసి వేడుకగ
విహరించు నాశైల విపినమ్ములందు
ఒక్కనాడు గజేంద్రు డుల్లాస మెసఁగ
పరివారములతోడ భార్యలతోడ

కాననసీమల కడు విలాసముగ
తిరుగుచు మధ్యాహ్న మరుదెంచు సరికి
తపనుని వేడికి తాళఁగ లేక
చల్లని నీటిలో స్నానమ్ము లాడ
సరగున నొకసరోవరమును జేరి
కేళీవినోదుఁడై క్రీడింపసాగ
తన యేన్గుగుంపుతో మునిగి తేలుచును.

తనుబలవంతుఁడౌ గంధర్వుఁ డొకఁడు
మునిశాపమున పెనుమొసలియై పుట్టి
వసియించు నాసరోవరమందు తానె
కొలనికి ప్రభువుగా తలఁచుచు మదిని.
తననివాసము జొచ్చి తనయాజ్ఞ లేక
సరసిలో నున్నట్టి జలముల నెల్ల
కల్లోల మొనరించు గజరాజు నరసి
ఆయేన్గు కాలిని నందున్న మొసలి
ఆగ్రహమ్మునఁ బట్టి యటునిటు గుంజి
నీటిలోతుల కీడ్చి పాటవ మ్మెసఁగ
తనను పట్టుక యీడ్చు మొనగాడెవండు
గలిగెనో యని యెంచి గజరాజు వేగ
బయటికు లంఘించి పడబోయె గాని
పట్టినపట్టును వదలఁడా మొసలి.

బయఁటకు రాఁజూచు బలముతో నేన్గు
లోనికినీడ్చు నా యేనుగున్ మొసలి.
ఒకదాని నొక్కటి యుగ్రసత్వమున
తాడించి లాగుచు తలక్రిందు లగుచు
కొలను సంక్షోభింప కొండ కంపింప
నీటితుంపురు లెల్ల నింగిపై కెగయ
అన్యోన్యజయకాంక్ష నటుల రెండిఁటికి
సమరమ్ము భయదమై జరిగె వేయేండ్లు.
చూచువారికి కడుచోద్యమై తోఁచె
వాని రెండిఁటి బలప్రాభవోన్నతులు.

ఒకదాని మించి వేఱొక్కటి తనదు
ధీరత్వమును జూపి తీసిపోకుండ
సమముగా పోరుచు సమర మొనర్చె.
క్రమముగా నొకకొంత కాలమి ట్లేగ
వారిచరోత్తమున్ వారింపలేక
లావెల్ల చెడిపోయి కావర మ్మడిగి
ధైర్యమ్ము నశియించి తనువు కృశించి
కడబట్టె ప్రాణముల్ గజరాజవరుఁడు
నిస్సహాయుం డయి నిర్వీర్యుఁ డగుచు
పోరుసల్పగ లేక పొందెను మూర్ఛ
పటుశక్తిమంతుఁడున్ బలశాలి యైన

గజరాజై యీరీతి కడుదీనుఁ డగుచు
మొసలిబాధకుఁ జిక్కి మూర్ఛను మునుగ
కరిరాజు ననుచరుల్ కరిరాజు సతులు
కనులారఁ జూచుచు కరిరాజు బాధ
సాయ మావంతయు సలుపంగ లేక
కసలి దుఃఖించిరి కన్నీళ్ళు గార్చి
తనదుస్థితిం గాంచి తనవెతం దలఁచి
దుఃఖించె కరియును తుదకిట్లు మదిని.

నాపరివారముల్ నాపత్ను లెల్ల
నన్నె సేవించుచు నాతోడనుండ
సుందర వనలతా మందిరస్థలుల
ననువైన నీడల యందుండ లేక
నేనేల వచ్చితి నిటకు నీరాశ
ఏల నీమొసలికి నిట్లు చిక్కితిని.
ఈ వారిచరముతో నేపోర లేక
ప్రాణముల్ కడముట్టి పడియుంటి నిట్లు
మనమున తోంచ దేమార్గ మీక్రూర
వారిచరోత్తమున్ వారించి యింక
నన్ను గాపాడెడి నాథుఁ డెవండు.
నన్ను రక్షించెడి నాయకు లెవరు
ఎవరడ్డుపడు వార లెవరు దిక్కింక

దేవుఁడే తక్క యీదీనుని కనుచు
శ్రీహరిన్ భక్తితో చిత్తాన నిలిపి
ప్రార్థించె గజరాజు పలుమాఱు లిట్లు
"కమలాక్ష! వరద! ఓకరుణాకటాక్ష
దీనజనావన! దీనశరణ్య!
క్రిందుమీఁ దెఱుఁగక నిందుఁజొచ్చితిని
ఉసురుఁ దీయుచునుండె మొసలి నన్నట్టె
నాశక్తి నశియించె నాబల మ్మడిగె
మరణమే తెంచె నోపరమేశ! యింక
నీవె నాశరణమ్ము నీవె నాదిక్కు
దీనుఁడ నయ్య! యోదేవాది దేవ!
ఈశ్వరా! నినుదక్క ఇతరమే నెఱుఁగ
వశమైతి నయ్య నీపాదాబ్జములకు
నా మొఱాలింపవే నన్నావ రావె
వినుదట దీనుల విన్నప మ్మెల్ల
శరణార్థులను బ్రోవ చనుదట వేగ
పలుకుదు వట నిన్ను పిలిచినంతటనె
సాధురక్షణశీల! సత్కృపాలోల!
నీకీర్తి నిండె నీనిఖిలవిశ్వమున
ఏదయ్య నీదయ ఏదయ్య స్వామి!
నీ వెఱుంగని దేమి నిఖిలవిశ్వమున
వారిచరమ్ముతో పోరాడ లేక

ధైర్యమ్ము సడలెను త్రాణ నశించె
ప్రాణముల్ కడముట్టె పలుక లే నింక
దయజూడవే నన్ను దలఁపవే దేవ!
కావవే వరద యో కారుణ్యభావ!
రావే జగన్నాధ రావే మహేశ!
రావయ్య శ్రీహరీ రమ్ము మురారి!
నారాయణా ! నిన్నె నమ్మితి నయ్య
రక్షింపవే యంచుఁ బ్రార్థించె నేన్ను
గజరాజు వేదనన్ కంపించె వనము
గజరాజురోదనల్ గగనమ్ము నిండి
ప్రతినిస్వనము లీనె పదిదిక్కులందు
ఆమూల నెక్కడో అల వైకుంఠమున
సురభిళ మందార సుందర వనుల
సదమల మణిమయ సౌధసీమలను
శ్రీలక్ష్మితో నున్న శ్రీహరి చెవుల
మ్రోగెను గజరాజు మొఱలు సర్వమ్ము
భక్తజనావన భవ్యదీక్షితుఁడు
కరుణాసముద్రుఁ డాకమలాక్షుఁ డంత
గజరాజుఁ బ్రోవగా కదలె తత్క్షణమె
భక్తులఁ బ్రోచెడి బాధ్యత యన్న
ఎంత ఆసక్తియో ఎంత తొందరయొ
ఆయుధమ్మొకటైన హస్తాన గొనక

పరివారమును బిల్వఁబంప కొక్కింత
సిరికైన జెప్పక అరుగు టెచ్చటికో
గరుడవాహనమైనఁ గదలిరమ్మనక
మరణవేదన నున్న కరినిఁ గావంగ
పద్మాక్షుఁ డొంటిగా పయనమై యేగె.
"ఏమిమొనర్చిరో యే దుష్టు లెంట
ఏమహాభక్తుని కెగ్గు కల్గినదొ
ఎచ్చటికేగునో యేమి కారణమొ"
యెఱుగక సిరియును హరి వెన్క నరిగె.
పరివారమెల్లను బయలుదేరినది
కదలె నాయుధములు గరుడుండు కదలె.
అఖిలవైకుంఠమే హరిని వెన్నంటె
అరిగినయట్లయ్యె నాక్షణమె
విష్ణునాయుధములు విష్ణునిఁ జేరె.
విష్ణువల్లదె వచ్చె వినువీథి ననుచు
అబ్బురంపడి జూచి రమరు లెల్లరును.
గజరాజు విలపించుకడకు నేతెంచి
హరి యిసుమంతయు నాలసింపక యె
చయ్యన తనచేతి చక్రమ్ము నంపి
మొసలిని తెగటార్చి ముదముచేకూర్చె
నిజభక్తుఁడైనట్టి గజరాజునకును

మొఱవిని రక్షింప నరుదెంచి నట్టి
హరిపాదముల వ్రాలె కరినాథుఁ డంత
తొండమున్ పైకెత్తి దండముల్ నెట్టి.
కరుణాంతరంగుఁడౌ కమలాక్షు కడకు
బ్రహ్మాది దేవతల్ భక్తితో వచ్చి
"భక్తరక్షక! శ్రీశ! వైకుంఠవాస!
సాధుసజ్జనపాల సత్కృపాలోల
దిక్కు నీవేనయ్య దీనుల కిలను
వర్ణింపఁ దరమె నీవాత్సల్య" మనుచు
పొగడి ప్రార్థించిరి ముక్తకంఠముల
శ్రీహరిచేతిలో మృతినంది నట్టి
మొసలియు తనశాపముక్తిని బొంది
మరల గంధర్వుఁడై హరిని బూజించి
వెడలెను తనదారి వినువీథి బట్టి.
కైవల్యదాతయు కరుణాత్ముఁ డైన
హరికరస్పర్శచే నజ్ఞాన మెడలి
పరమపదమ్మును బడసె నా కరియు.
దేవుఁడే శరణమ్ము దేవుఁడే దిక్కు
దేవుఁడే సాయమ్ము దేవుఁడే రక్ష
యనుచు నిశ్చలభక్తి నాత్మ నర్పించి
ప్రార్థించఁ గలిగిన భక్తసంతతిని
కరుణాళుఁ డాహరి మఱవఁ డెన్నటికి.

మొఱవిని రక్షింప నరుదెంచి నట్టి
హరిపాదముల వ్రాలె కరినాథుఁ డంత
తొండమున్ పైకెత్తి దండముల్ నెట్టి.
కరుణాంతరంగుఁడౌ కమలాక్షు కడకు
బ్రహ్మాదిదేవతల్ భక్తితో వచ్చి
"భక్తరక్షక! శ్రీశ! వైకుంఠవాస!
సాధుసజ్జనపాల సత్కృపాలోల
దిక్కు నీవేనయ్య దీనుల కిలను
వర్ణింపఁ దరమె నీవాత్సల్య" మనుచు
పొగడి ప్రార్థించిరి ముక్తకంఠముల
శ్రీహరిచేతిలో మృతినంది నట్టి
మొసలియు తనశాపముక్తిని బొంది
మరల గంధర్వుఁడై హరిని బూజించి
వెడలెను తనదారి వినువీథి బట్టి.
కైవల్యదాతయు కరుణాత్ముఁ డైన
హరికరస్పర్శచే నజ్ఞాన మెడలి
పరమపదమ్మును బడసె నా కరియు.
దేవుఁడే శరణమ్ము దేవుఁడే దిక్కు
దేవుఁడే సాయమ్ము దేవుఁడే రక్ష
యనుచు నిశ్చలభక్తి నాత్మ నర్పించి
ప్రార్థించఁ గలిగిన భక్తసంతతిని
కరుణాళుఁ డాహరి మఱవఁ డెన్నటికి.

వసుధనెల్లెడఁ గ్రమ్మె వాసుకినుండి
ధూమవహ్నులు లేచి దుర్వారరీతి.

వననిధిమథనమ్ము భయదమై యిట్లు
సర్వసంక్షోభమై సాగుచుండఁగ
హాలహలవిషాగ్ను లావిర్భవించి
వనధినెల్లను గాల్చి వసుధపై బ్రాకె.
వెఱగంది యసురులు పశుపతి నారు
ఏదిక్కు తోచక నీశ్వరువద్ద
సురలెల్ల తమగోడు మొఱవెట్టుకొనగ
కరుణతో నరుదెంచి పరమశివుండు
హాలాహలాగ్నుల నన్నిటిం బట్టి
తాల్చియుంచెను వీక తనగళమ్ముందె
లోనున్న జగతికి హాని రాకుండ.
జగముల రక్షించి శంభుఁ డారీతి
నీలకంఠుండయి నెగడె కీర్తులను
సర్వజగద్రక్ష! సర్వేశ! యనుచు
వినుతించి రభవుని మునిజనుల్ సురలు.

శాంతపరిస్థితుల్ సమకూడి నంత
మరలసాగెను వార్ధిమథనకార్యమ్ము
తీవ్రమ్ముగా నట్లు దేవదానవులు

క్షీరాబ్ధి మథనము సేయుచుండంగ
పరమాద్భుతమ్ముగ వారి కెల్లరకు
ఉద్భవమయ్యె నాయుదధిలోనుండి
వరణీయములు గొప్పవస్తువుల్ కొన్ని
కల్పవృక్షమ్మును కాంత లప్సరలు
ఐరావతము పుట్టె నమరేంద్రుఁ జేరె
సురమునీంద్రులఁ జేరె సురభి జనించి
చంద్రుఁడు జనియించి చదల వెలింగె
బలివద్ద కుచ్చైశ్రవము పుట్టి యేగె.
సకల సంపత్కర సౌభాగ్యమూర్తి
లావణ్యరాశియౌ లక్ష్మి జనించి
వసియించె శ్రీహరి వక్షమ్ముఁ జేరి.

ఉత్సాహవంతులై యుల్లాసమలర
మతికొంతదీక్షతో మథనమ్ము సురల
కావించుచుండిరి దేవదానవులు.
ఫలియించె నీసారి వారియత్నములు.
వచ్చె ధన్వంతరి వార్ధియందుండి
హస్తమ్ములను బట్టి యమృతభాండమును
ధన్వంతరిం జూచి దానవవరులు
త్వరితమిదే యని తలచి నెమ్మదుల
గ్రక్కున నా సుధాకలశమున్ లాగి

సురలను గికురించి పరువెత్తినారు.
నిశ్చేష్టులై సురల్ నిలబడి రచట
దితిజుల మోసము తెలిసికోలేక.
దీనులై యేగి యాదేవతల్ మరల
హరితోడ నుడివి యాయసురుల చేష్ట
రక్షింపుమని వేగ ప్రార్థనలిడిరి.

ఒకరిని మించి మఱిందొక్కరు పడిగ
అమృతము త్రావంగ నసురు లెల్లఱును
వారిలో వారలు పోరాడుకొనట
హరిజూచి యయ్యదే అదనని యెంచి
మోహినీరూపాన మోహనాకృతిని
తళుకు బెళుకుల చూపువలపుల గుఱిసి
జగతిని మఱపించు జవ్వని యగుచు
సవ్వలొల్కుచు వారినడుమకు వచ్చి
మీరలు సోదరుల్ మీకేల తగవు
సురలకు మీకును సరిసమానముగ
పంచెద నని సుధాభాండమ్ముఁ గొనియె.
మందహాసమ్ముల మాధురుల్ గురిసి
పలుకుచు ప్రియమార పయ్యెదఁ జార్చి
రొయ్యారమొలుకు నాయువిదను గాంచి
దితిజులు మెల్లన తీర్చికూర్చొనిరి.

సురలును వేఱొక వరుసఁ గూర్చొనిరి
తనచూపు తనరూపు తనయంద మెల్ల
దైత్యులు జూచుచు తమి మున్గుచుండ
సురలున్నదరి కామె గిరుకున దిరిగి
అమృతమెల్లను వారి కందఁజేసినది.
సురలపంక్తిని రాహు విరవుగఁ జేరి
అమృతము గ్రహియించు టర్కుఁడున్ విధుఁడు
చూచి వచింప నాసుందరి వాని
శిరమును ఖండించె చేతిచక్రమునఁ
గళసీమ నమృతము నిలిచిన కతన
గ్రహముగా బ్రతుకుచు రాహువప్పుడు
తనకోప మాత్మలో దాచియుంచుకొని
అర్కచంద్రుల బట్టి యాతనఁ బెట్టు

తరచి తెచ్చిన సుధ సురలపాలగుట
అరసి యాగ్రహమేచి యసురసైన్యములు
బలిని నాయకుఁ జేసి తలపడిరంత
యుగ్రులై సురలతో యుద్ధమ్ము సలుప
ఇరువాగులకు మధ్య నేపుగా రేగ
కుంభిని యల్లాడు ఘోరయుద్ధమ్ము
అమృతముచే బల మతిశయింపంగ
వజ్రాయుధము బూని వాసవుఁ డేగి

అసురసైన్యము నెల్ల హతమార్చుచుండ
నారదుం డరుదెంచి వారలమధ్య
శాంతివాక్యములతో సమరమ్ము నాపె
ప్రార్థించినంతనే బాధితుల్ వచ్చి
తగునుపాయముననో తగుబలమ్మునవో
దుష్టుల దుర్వృత్తిఁ దొలగింపఁజేసి
శిష్టులఁ గాచులే శ్రీహరిపాతము.

---

## శ్రీ వా మ నా వ తా ర ము

ప్రహ్లాదుమనుమఁ డాబలిచక్రవర్తి
ధర్మవర్తనుఁడును దానతత్పరుఁడు.
అసురసంతతి కెల్ల అధిపతి యగుచు
వసుధ నేలుచునుండె ప్రాభవమ్మలర.

అమరులతో యుద్ధ మాగిన వెనుక
మిగిలిన సేనల మేలుగా గూర్చి
శుక్రుని గురువుగా జూచి పూజించి
ఆచరించుచు పుణ్యయజ్ఞయాగములు
గురువులు పెద్దలు కూర్మి దీవింప
ప్రాభవోపేతుఁడై బలిచక్రవర్తి
మహితసామ్రాజ్యమ్ము మరల చేకూర్చి

పాలించె నధిపుఁడై ప్రభుత మీఱంగ
అమరేంద్రు వలన మున్నవమానపడిన
చరితమ్ము నాత్మలో మఱవంగలేక
దైత్యులబలమును ధర్మబలమ్ము
తనప్రక్కనుండగా ధైర్యమ్ముతోడ
దండెత్తి యమరుల చెండాడె బలియు
బలిధాటి నాపెడి బలశక్తి లేక
అమరావతిని వీడి అమరేంద్రుఁ డేగ
దేవతల్ వెడలిరి దిక్కులఁ బట్టి
ఆ విజయమ్ముతో నతిశయ మంది
తనసరివారింక ధరణి లేరనుచు
త్రిభువనమ్ముల గెల్చి ధీరత మీఱ
తిరుగసాగెను బలి గరువమ్ముతోడ.

దేవత లొందిన దీనత కడలి
తల్లియౌ అదితియు తనవిభుండైన
కశ్యపునకు మ్రొక్కి గద్గద యగుచు
ప్రార్థించె సురలను రక్షింపు మనుచు.
భర్త చెప్పినరీతి భక్తితో నామె
పాలవ్రతమ్మున పద్మాక్షుఁ గొలిచె.
వాసుదేవుం డామె వ్రతమును మెచ్చి

ప్రత్యక్షమై వచ్చి పరమాదరమున
"తల్లి ! నీకడుపున తనయుఁడ నగుచు
అమరుల బాధల నంతమొందింతు
వీడుము భయ"మని వినయుఁడై నుడివె.
కాలమొక్కింతగా గడవంగ భువిని
ఆనందమలరంగ నదితిగర్భాన
వామనుండై పుట్టె వాసుదేవుండు.
ప్రీతినా బాలుని జాతకర్మములు
మునివర్యులే తెంచి యొనరించినారుః
అవతరించు టెఱింగి హరి తమ్ముఁ బ్రోవ
హర్షమ్మునందిరి యమరు లెల్లరును.
అష్టవర్షప్రాయ మలరు బాలునికి
ఉపనయనాచార మొనరించి నారు.
తల్లికిఁ దండ్రికిఁ దనర ముదమ్ము
బ్రహ్మతేజస్వియై వరలె వామనుఁడు.

అతివైభవమ్ముగ నశ్వమేధమ్ము
నాచరించుచు బలి యశము దీపింప
విరివిగ దానముల్ విప్రుల కిచ్చి
బలమునందున దానఫలమునందునను
తనసాటి లేరని తలఁచుచు నుండె.
బలిగర్వ మడఁపఁగా వామనుం డిదియె

యదనని యరిగె నాయజ్ఞవాటికకు
బలిచక్రవర్తియు వామనుం జూచి
ఆతని తేజమ్మున కచ్చెరువంది
బ్రహ్మయొ శంభుఁడో వటువురూపమున
వచ్చెనటంచు నావటునికి మ్రొక్కి
ప్రార్థించె నిట్టుల భక్తిభావమున.
"బ్రహ్మ తేజమ్ముతో భాసించు వటుడ !
ఎవరి బాలుండ వీవేది నీయూరు
ధన్యుండ నైతి నీదర్శనమంది
సత్ఫలమ్మయ్యె నాజన్మమ్ము కూడ
దానధర్మములకు తగుకాల మిద్ది
అడుగుము నీకెద్ది అడుగ కోరికయొ
కరులో హయమ్ములో కాంతలో ధనమొ
ధరణి సర్వమ్మైన తప్పకిచ్చెదను
నీకోర్కె తీర్చుటే నాకు హర్షమ్ము
సాఫల్య మందు నాజన్మయు" ననిన
బలినివీక్షించి యావామనుం డంత
"స్వస్తి సద్గుణసాంద్ర ! బలిరాజచంద్ర !
దానవకులనాథ ! దానవినోద
దివిజమర్దనఖేల ! త్రిభువనపాల !
సత్క్రతుసంచార ! సాధువిచార !
హర్ష మందితిని నీవనిన మాటకును

ఎవరిబాలుఁడ నని యేమిచెప్పుదును
వటుఁడను నాకొక్క వాసమ్ము లేదు
ఒంటివాఁడను నాదె యుర్విసర్వమ్ము
అడిగిన దిచ్చెద నంటివో రాజ!
వటుల కీవసుధపై వాంఛ లేముండు
సకలసంపదలున్న సామ్రాజ్య మున్న
ఆశకంతమ్ము లే దసురేంద్ర వినుము.
కౌపీనమో చేతికట్టియో గాని
తరుణులు నాకేల ధనము నాకేల
మూఁడడుగుల నేల ముదమార నిమ్ము
అడితప్పని వాఁడ వంతియేచాలు
అదియె నాపాలిటి కఖిలవిశ్వమ్ము
అదియె బ్రహ్మాండమై యలరు నాకనగ

ఇదియేటి కోరిక ఇదియేటి యీవి
బలిచోద్య మంది యావటుని మాటలకు
చూచుచున్నంతలో శుక్రుఁడు వచ్చి
"బలిరాజ! నీబలప్రాభవ మ్ముడుప
అమరకార్యార్థమై యరుదెంచి నట్టి
వాసుదేవుడు గాని వటుఁడు గాఁడితఁడు
వటునిమాటలు విని వసుధ నర్పించి
వమ్ము సేయకు మీవి నమ్ము నామాట

ప్రాణమ్ము మానమ్ము భంగమై నప్పు
డాడితప్పియుఁ గూడ నపకృతి లేదు.
నీయధికారమున్ నీరాజ్యపదము
నిలుపనెంచితి వేని నిశ్చింతతోడ
బయటకుఁ బంపు మీవటుని వేగమ్మె
వంచన సేయగా వచ్చె నీతండు
వలదు దానమ్మీయ వలదని నుడువ
కొంతసేపాత్మలో చింతించి బలియు
వినయుఁడై శుక్రుతో ననియె నీరీతి
"గురువరా! నామీద కోపింపఁ బోకు
వటుని కిచ్చెద నంచు వసుధ సర్వమ్ము
సకలమ్ము నీమాట సత్యమే యనుము
రాజులు రాజ్యముల్ ప్రజలు శాశ్వతమె
పృథ్వినేలిన రాజు లెందఱు లేరు
సిరి వెంట నిడుకొని అరిగిరే వారు
ధరణి రాజ్యముగాదు తనువును గాదు
ధరణిపై నిలుచు నీదానధర్మములె
వాసుదేవుఁడు నన్ను వంచించు నన్న
భయము సుంతయు లేదు స్వాంతమ్మునందు
నారాయణుఁడు జగన్నాథుండె వచ్చి
హస్తమ్ము సాచుచు అర్థియై వేడ

అంతకంటెను భాగ్య మవని నేముండు
శ్రీసతిన్ లాలించు చేతియం దేను
దాన మీఁగలుగుట ధరణి మేల్గాదె ?
ఇచ్చెద తప్పక ఈదాన మనుచు
ఇదియె మూఁడడుగుల ఇల నిచ్చి తనుచు
ధారవోసెను నీరు ధీరచిత్తమున
వటునిహస్తమ్ములో బలిచక్రవర్తి.

భూమి మూఁడడుగు లాపొట్టిబాలునకి
ధారవోసెనో లేదో దానవేంద్రుండు
ఆశ్చర్య చకితులై అందఱుఁ జూడ
వామనుం డంతలో పరమాద్భుతముగ
ఇంతింత యగుచు తానంతయై పెరిగి
మేదిని నిండి యామింటినిఁ దాకి
బ్రహ్మాండమంతయు వ్యాపించి తుదకు
సత్యలోకముదాక సాగి వర్తించి
ఉర్వినంతయు గప్పి యొక్కపాదమున
వేఱొక్కపాదాన వినువీధిఁ గప్పి
ఇంకొక యడుగున కేది నేలనుచు
నిలిచిన వటునకు నిశ్చలుం డగుచు
ధైర్యమ్ముతోఁ దన తలను జూపించి
హరికి మ్రొక్కెను బలిధరణీంద్రుఁ డంత

బలిశిరమ్మున తనపాదమ్ము నుంచి
వామనుం డాదృతిన్ బలిని పిల్చి
"బలిరాజ! వితరణ ప్రాభవ తేజ!
నిరుపమానము భువి నీదానగరిమ
నిరుపమానము భువి నీత్యాగమహిమ
పరివారయుతముగ వైభవ మ్మెసఁగ
శుభుఁడవై యుండుము సుతలలోకమున
సావర్ణిమను వేలు సమయమ్మునందు
ఇంద్రుండవై స్వర్గ మేలుదు వీవు
నీకీర్తి నిత్యమై నిలుచును ధాత్రి"
ననుచు నావామనుం డాశీస్సు లిచ్చె.

వామనునకు మ్రొక్కి బలిచక్రవర్తి
విష్ణుదేవా! నీవె విచ్చేసి యిటకు
కరుణతో నన్నని కాపాడినావు
నీపదస్పర్శచే నాపాప ముడిగి
ధన్యుఁడనైతి నోమాన్యచరిత్ర!
మఱవలేనయ్య నీమహిమ మేననుచు
పరివారములతోడ భార్యలతోడ
అతుల తేజస్వియై సుతలమ్ముఁ జేరె.
విశ్వజగద్వ్యాప్త విపులరూపమును
త్యజియించి వామనుం డతిభక్తి నేగి

వినయుఁడై మ్రొక్కుచు వినతు లర్పించె
తల్లికిఁ దండ్రికి తత్యుల్లాస మమర.
తన నోముపంటగా తనగర్భమందు
హరియె వామనుఁడయి అవిర్భవించి
తనకోర్కె తీర్చిన ఘనకార్యమునకు
ఆనందపులకిత యగుచు నాయదితి
ముదమార తనయుని ముద్దాడి పంపె.

దేవేంద్రుఁడాదిగా దేవతల్ మునులు
బ్రహ్మాదులును వచ్చి వామనుం జూచి
మ్రొక్కి పూజించిరి ముదము మీఱంగ
వామనుం డంతట స్వర్గరాజ్యమును
దేవేంద్రున కొసంగి దీవించి పంపి
వైకుంఠమును జేరె వైభవ మ్మెసఁగ.

అమరేంద్రు నోడించి అమరుల నెల్ల
గర్వాన బాధించు కారణమ్మునను
బలి శిక్షితుండయ్యె వామను చేత.
బలికున్న హరిభక్తి బలివదాన్యతయు
నిలిపె నాతనికీర్తి నిలపైన తుదకు.

# మత్స్యావతారము

వెనుకటి కల్పాంతదినముల బ్రహ్మ
నిదురింప నాతని వదనమ్ములందు
వెలువడి వచ్చెను వేదముల్ నాల్గు.
లోకకంటకులయి లోకుల కెగ్గు
చేయుచే దైత్యుల చేష్టలు భువిని.
ఆవేదములను హయగ్రీవుఁ డనెడు
దైత్యుఁడు దొంగిలి దాగె సంద్రమున
ధర్మమార్గము పుణ్యకర్మమార్గమును
ధరణీనివాసుల కెఱిగింపఁ జేసి
జ్ఞానవంతులఁ జేయు సత్ప్రయత్నమున
వచ్చిన వేదముల్ ముచ్చిలి పట్టి
యసురుని చర్యకు నబ్జసంభవుఁడు
చింతించుచుండగా చిత్తమ్ము నందు
హరి మత్స్యమై వచ్చి యంబుధిఁ జొచ్చి
అసురుని వెంటాడి అంత మొందించి
వేదముల్ తిరిగి యావేధ కొసంగె.
ఆదరమ్మున నిట్టు లరుదెంచి హరియె
జగతికి చేసిన సత్కార్యమునకు
ప్రణతు లర్పించుచు ప్రార్థించె బ్రహ్మ.

(ఈ హయగ్రీవుఁడే సోమకాసురుఁడు)

సత్యవ్రతుం డను జననాథు డొకఁడు
హరిభక్తితత్పరుం డవనిఁ బాలించె
ఒకనాఁడతడు తనయుల్లమ్ము నందు
పద్మాక్షురూపమ్ము భక్తితో నిలిపి
జలతర్పణము సేయు సమయమం దతని
కరములందున నొకచిఱుచేప వచ్చి
పెద్దచేపలు తన్ను వెంటాడిపట్టి
భక్షింపకుండగ రక్షింప వేఁడె.
చోద్యమందుచు రాజు చూచుచుండగనె
హస్తమ్ము నందున్న ఆచిఱుచేప
సరసులు సంద్రముల్ చాలని రీతి
పెద్దదై పెరిగిన విధముఁ గన్పట్టి
సంభ్రమమందుచు సత్యవ్రతుండు
"మత్స్యమై వచ్చిన మహానీయ! నిన్ను
పోల్చగాఁజాలని బుద్ధిహీనుఁడను
దయతోడ నాకు నీదర్శన మిచ్చి
రక్షింపు" మని భక్తిఁ బ్రార్థించి నంత
మత్స్య మిట్లు వచించె మనుజేశుఁ జూచి.

"పృథ్వీశ నీభక్తి కెదమెచ్చి యిటకు
నిను గావ వచ్చిన నీరజాక్షుడను
నేఁటి కేశవనాఁడు నిఖిలవిశ్వమ్ము

భయదమహా నేకజలప్రళయాన మునుగు
నాఁడు నీకొఱకొక నావ నంపెదను
సమకూర్చి బీజముల్ సకలోషధులును
సప్తఋషులఁ గూడి జననాథ నీవు
మున్నీటి పొంగుల మునిగిపోకుండ
పడవను బంధించి వాసుకితోడ
నాకొమ్మునఁ దగిల్చి నావపై నెక్కి
ఏకార్ణవమ్మునం దెలమిఁ జరింపు"
మనుచు నంతర్ధానుఁ డయ్యెను హరియు.

ఏగినయంత నా యేడురోజులును
జగము లీన మ్మయ్యె జలగర్భమందు
ఏకార్ణవ మ్మయ్యె లోకమ్ము లెల్ల
వలయు వస్తువులెల్ల వసుధేశు డెల్ల
సమకూర్చి ఋషులతోఁ జని నావనెక్కి
మత్స్యావతారుఁడౌ మాధవుం గాంచి
భక్తితో మ్రొక్కి యాపరమాత్మనుండి
ఆత్మతత్త్వ మెఱింగి ఆసక్తితోడ
చరితార్థుడై జన్మసాఫల్య మందె.
ప్రళయమ్ము ముగిసెను బ్రహ్మ మేల్కనియె

సరసిజాక్షుని దయ సత్యవ్రతుండు
అవని వైవస్వతుఁ డనునామమొంది
మనువుగా ప్రభవించి మహినేలుచుండె.

భక్తివిశ్వాసముల్ పరగ శ్రీహరిని
స్థిరభక్తితో నమ్మి జీవించునట్టి
భక్తవరేణ్యుల బాగోగు లెల్ల
హరియె చూచును తగుతరుణమ్ము నెంచి.



# శ్రీ మహా భాగవతము

## నవమ స్కంధము

### అంబరీషుఁడు

కోపమ్ము తగ దెంతగొప్పవానికిని
ఆవేశమున నైన హాస్యానకైన
హరిభక్తులకు కీడు జరిగించు నెడల
ధరణి నెవ్వారి కేని తప్పదు శిక్ష.

అంబరీషుం డనుహరిభక్తుఁ డైన
భూపతి పాలించె పూర్వ మీభువిని
నియమవ్రతుండయి నిష్ఠతో నతఁడు
వాసుదేవునిఁగొల్చి ద్వాదశీవ్రతము
సలుపును తప్పక శాస్త్రోక్త విధుల
అతిథుల ముందుగా నర్చించి కాని
భుజియింపఁ డాతఁ డాపుణ్యదినాన
ఒకనాఁటివ్రతమునం దొప్పుగా తాన
ద్వాదశిభోక్తగా వచ్చెద ననుచు
నుర్వీశుతోఁ జెప్పి దుర్వాస మౌని
స్నానమ్ము సేయగా నదికడ కేగి
రా డెంతకాలము రాజు వేచినను.

ద్వాదశిగడియలు దాటునటన్న
భయముతోఁ దక్కినవారికిఁ జెప్పి
వినయుఁడై వారల యనుమతి వడసి
వ్రతభంగదోషమ్ము బాపుకో దలఁచి
రాజు గ్రుక్కెడు నీరు త్రావులోపలనె
దుర్వాసుఁ డేతెంచి దుర్వారకోప
భరితాత్ముఁ డగుచును నరపతిం జూచి
ఘోర! నాకింత యవమాన మేల
చేసినాడవు నిన్ను శిక్షింతు ననుచు
అంబరీషుని బట్టి హతమార్ప నొక్క
శక్తిని సృజియించి సత్వర మ్మంపె.
పటురయమ్మున మహాభయదోగ్రచటుల
ధూమవహ్నులతోడ దుర్నిరీక్ష్యముగ
అవనీశుపైఁబడ నరుదెంచె శక్తి.

అపరాధమెఱుఁగని యంబరీషుండు
భయమింతయును లేక హరిహరిహరి
శక్తినావంతయు సరకు గైకొనక
హరిని ధ్యానించుచు నచటనే నిలిచె.
ఎటనుండి వచ్చెనో యెఱుక లేకుండ
హరిచక్రమంతలో నరుదెంచి యటకు
జననాథుపై కేగు శక్తి నణంచి

తీక్ష్ణమై భయదమై తీవ్రవేగమున
దుర్వారముగ వచ్చె దుర్వాసు పైకిఁ
దారుణోగ్రమ్మయి తనపైకి వచ్చు
హరిచక్రముం గాంచి యాజడదారి
పారిపోవుచు నుండ వాని వెంబడినె
కొండల నెక్కిన కొండల నెక్కి
గుహలందు దూరిన గుహలందు దూరి
వినువీధి కెగసిన వినువీధి కెగసి
అంబుధిం జొచ్చిన నంబుధిం జొచ్చి
అతఁడెట కేగిన నచటి కేగుచును
తపసిని వెంటాడి తఱుమంగ సాగె.
తనకోపమే యిట్లు తనమృత్యు వగుచు
వచ్చెనదని చాల వగచి చిత్తమున
ప్రాణావశిష్టుఁడై పరువెత్తి వచ్చి
దీనాతిదీనుఁడై భూనాథు నరసి
తప్పుఁ జేసితిని ఓ ధరణీశ చంద్ర!
నన్ను వెంటాడుచు నాప్రాణములను
బలిగోరుచుండె నీ భయదచక్రమ్ము
రక్షింపుమని ముని బ్రతిమాలుకొనియె.
ఆదరమ్మునఁ జూచి ఆ యతీశ్వరుని
భయపడవలదని వారించి చెప్పి
చక్రమ్ము నాపి యాసంయమిన్ బ్రోవ

హరిని ధ్యానించె నా యంబరీషుండు
హరియనుగ్రహమున యతివరున్ వదలి
వెనుకకు మరలె నా విష్ణుచక్రమ్ము.

నిష్కారణమ్ముగ నిందలొనర్చి
హరిభక్తులకు కీడు జరుపఁ దలంచు
మూర్ఖుల కేగతిమూడునో దాని
నంబరీషునికథ యువనికిఁ జాటు.

## గంగావతరణము

ఆశయమ్మును మఱి యత్నమ్ముగూడ
పావనమ్ముగుచును భాసించి నపుడు
సదమల సంకల్ప సాధుచిత్తునకు
కలుగును తప్పక కార్యసంసిద్ధి.

ఇక్ష్వాకువంశమం దిల కీర్తి గనిన
చక్రవర్తులలోన సగరుఁ డొకండు
అశ్వమేధము నతఁ డాచరింపంగ
ఈర్ష్యతో నచ్చటి కింద్రుఁడు వచ్చి
యజ్ఞాశ్వమును బట్టి యవల గొంపోయె
యజ్ఞ పూర్తికి నయి యశ్వమున్ వెదక

అరిగిరి రాసుతు లఱువది వేలు
అశ్వమ్ము కొఱకయి యన్నిచోటులకు
వెదకుచు వెదకుచు విసువెత్తి తుదకు
పాతాళమును జేరు బాటలో వారు
తనయాశ్రమమ్మున తపము నొనర్చు
కపిలుఁడుండిన చోటఁ గాంచి యశ్వమును
కపిలుఁడే దొంగని కారించఁ బోయి
కాలి బూడిద యైరి కపిలుకోపమున.
అశ్వమ్ముకొఱకయి అరిగిన వారు
మరలి రాకుండుట నరసి చింతించి
సగరుఁడు మనుమని సత్వరమ్మంపె
సగరునిమనుమఁడు సద్గుణవంతు
డంశుమంతుం డేగి యాదారి వెంట
కపిలమునీంద్రునిఁ గాంచి పూజించె.
కూర్మిమై కపిలుఁ డాగుఱ్ఱమున్నట్టి
తావుఁ దెల్పంగ నాదారిని బట్టి
అశ్వమంతుం డేగి అశ్వముం దెచ్చి
సగరునకిచ్చి యాసగరునిసుతులు
మునిశాపమంది యా వనవీథులందె
భస్మమై పడియున్న వార్తను జెప్పె.

సగరుఁడు జన్నమున్ సంపూర్తి జేసి
మనమున యోచించె తనకుమారులకు
సద్గతుల్ కలిగించు సన్మార్గవిధము
దివినుండి గంగను భువికి దోడ్తెచ్చి
ప్రవహింపఁ జేయుచో భస్మమ్ములందు
పుత్రులు సద్గతుల్ పొందు టెఱింగి
చేసెను యత్నముల్ వాసిగా నెన్నొ
పుణ్యులఁ బిలిపించి పూజ లొనర్చె
అంశుమంతుండును యత్నించె చాల
కాలేదు సఫల మాకార్యమ్ము తుదకు
వారలేగిన వెన్క వసుధేశుఁ డైన
ఘనుఁడు దిలీపుఁడున్ కడుప్రయత్నించి
చాలించె నాపని సాధ్యమ్ము కాక.

దైవభక్తుండును ధార్మికోత్తముఁడు
సగరుని మునిమన్మ డగు భగీరథుఁడు
కడుదీక్ష గలవాడు కార్యదక్షుండు
భస్మంపు రాసులై పడియున్న తనదు
పితృవర్యుల కెటులో గతులు కల్పింప
సంకల్పమును జేసి స్వాంతమ్ము నందు
గంగానదిని గూర్చి కఠినతపమ్ము
దీక్షతో నొనరించె దీర్ఘకాలమ్ము.

ఫలియించె నాతఁడు పడినపాట్లెల్ల
శ్రీహరిపాదాల చెలువారు గంగ
ఆకాశవీథులం దలరారు గంగ
ప్రత్యక్షమై తాను వసుధపైఁ బడిన
వేగమ్మునకు పృథ్వి ఆగదు గాన
తన వేగధాటికి తాళఁగ జాలు
శివుని వేడు మటంచు చెప్పె రాజునకు.
తనపట్టు విడువక ధరణీశుఁ డపుడు
శివునిగూర్చి తపమ్ము చేసెను మరల
నృపతిభగీరథు నిశ్చలతపము
చూచి మెచ్చిరి సర్వసురలును మునులు
నృపతితపమ్మున కెదలోన మెచ్చి
కైలాసముననుండి కరుణాళుఁ డగుచు
ప్రత్యక్షమయ్యెను పరమశివుండు.
తరళజృంభోద్వేగ ధారాప్రవాహ
సదమలాంభఃపూర సారమ్ము లెగసి
దివినుండి పడుచున్న దివ్యవాహినిని
ఆపద లేకుండ నవని కేపగిది
తనజటాజూటాన తాల్చె శివుండు
గంగాధరుండని గాంచె సత్కీర్తి.
గౌరీశునకు మ్రొక్కి గంగకు మ్రొక్కి
మునుముందు భక్తితో జనపతి నడువ

గంగానదీ పుణ్య కమనీయ ఝురులు
ప్రవహించె నాభగీరథుని వెన్వెంట.
కొండలఁ జీల్చుచు కోనలఁ గడచి
పరవళ్ళు ద్రొక్కుచు కెరటాల తోడ
పొంగెత్తి పొర్లాడి పుడమిపై గంగ
జహ్నుని యాశ్రమస్థలము ముంపంగ
కడుకిన్కతో సర్వగంగాజలమ్ము
జహ్నుఁ డాపోశించె సడిచేయకుండ
గంగాజలమ్మును కాన కారాజు
జహ్నుని కడకేగి సత్కృతుల్ సలిపి
జహ్నుని వేడగా జహ్నుఁడా జలము
చెవినుండి వదలంగ భువిపైకి గంగ
చనుదెంచి ప్రవహించె జాహ్నవి యనఁగ.
సగరపుత్రులు కాలి చనిపోయి నట్టి
భస్మరాసులమీద భక్తి మీఱంగ
ప్రవహింపఁజేసి యాపావనాపగను
పితృదేవతలకు సద్గతులు కల్పించె
నసమాన సద్యశుం డాభగీరథుఁడు
ఆభగీరథరాజు యత్నమ్ము వలన
పుణ్యగంగానది భువి కేగుదెంచి
భాగీరథి యనంగ ప్రఖ్యాతిఁ గాంచె.

హరిపాదములనుండి అభ్రమందుండి
శరభునిజటనుండి జగతి కేతెంచి
సకలభాగ్యము లిచ్చి సంపద లిచ్చి
పావనమ్మొనరించె భరతోర్వి నెల్ల
సాధుసజ్జనసంగ సదయాంతరంగ
మహితోన్నతతరంగ మహనీయగంగ

---

## పరశురామావతారము

జగతిపై విలసిల్లు చంద్రవంశమున
జననమ్ము నందెను జమదగ్నిమౌని
రేణుక యాతని ప్రియతమ పత్ని
కలిగిరి వారికి పలువురు సుతులు
వారిలోఁ గడపటి వాడుగా పుట్టి
హరియవతారమై పరశురాముండు.
భర్గునితోఁ గూడి బాణవిద్యలను
నేర్చిన యోధుఁడు నిరుపమబలుఁడు
బ్రహ్మతేజస్వి యాపరశురాముండు
పరశు వాతని దివ్య పరమాయుధమ్ము.

హైహయనృపతుల యన్వయమందు
కడుగొప్పవాఁడగు కార్తవీర్యుండు

వేయిచేతులు గల వీరవర్యుండు
మాహిష్మతీ పుర మనుజేశుఁ డతఁడు.
కానల నొకనాఁడు కార్తవీర్యుండు
వేటకై యరిగి యావిపినమ్మునందు
జమదగ్ని యాశ్రమస్థలమున నున్న
కామితార్థము లిచ్చు కామధేనువును
కాంచి యసూయతో కన్నులు గుట్టి
కొనిపోయె ముచ్చిలి తనపురమ్మునకు
అటుదెంచి యింటికి పరశురాముండు
కార్తవీర్యుని దుష్టకార్యమ్ము నెఱిఁగి
మునుల కెగ్గొనరించు ముచ్చులుగాని
నరనాథులా యిట్టి దురితాత్ము లనుచు
గండ్రగొడ్డలి బూని కార్చిచ్చువోలె
నిప్పులు గురియుచు నిముసమ్ములోన
మాహిష్మతికి నేగి ఆహవమ్మునకు
కార్తవీర్యునిఁ బిల్చి కదనరంగమున
ఖండించి యాతని కరములున్ శిరము
తమధేనువును దెచ్చి తండ్రి కర్పించె.

సత్త్వగుణాఢ్యుఁడౌ జమదగ్ని మౌని
ధరణిపులే దాన ధర్మపాలకులు.
తనయుఁ డొనర్చిన పని సైపలేక

ప్రభువును జంపిన పాపమ్ము తొలఁగ
తీర్థయాత్రలు జేసి తిరిగిరమ్మనుచు
పరశురామునకుఁ జూచి పలికె తీవ్రముగ.
పటుదీక్ష వెలయంగ పరశురాముండు
తలఁదాల్చి భక్తితో తండ్రి యానతిని
తీర్థముల్ క్షేత్రముల్ తిరిగి సేవించి
విగతకల్మషుఁ డయి మగిడి యేతెంచె
ఒకనాడు రేణుక యుదకమ్ము తేర
వాహిని కేగి యా వాహినియందు
గంధర్వుఁ డొక్కఁడు కాంతలఁగూడి
క్రీడించుచుండుట క్రీగంటఁ జూచి
మది చంచలింప నానదియొడ్డునందె
గడపె కాలము తనకార్యమ్ము మఱచి.
తన నిత్యపూజలు దాటిన వెనుక
ఇంటికి తడవుగ నేతెంచి నట్టి
సతిమనోచేష్టలు జమదగ్ని యెఱిఁగి
ఆగ్రహించి సుతుల కాజ్ఞ యొసంగె
పాపాత్మ రేణుకన్ వధియింపుఁ డనుచు.
తల్లిని వధియింప తనయు లెవ్వరును
సాహసింపగ లేదు చయ్యన నపుడు
పరశురాముఁడు లేచి పరశువు బూని
తండ్రికి ముదమొప్ప తల్లినిఁ జంపె

తనయాజ్ఞ మీఱిన తనయు లందఱిని
శాపమ్ము లిడి చంపి జమదగ్నిమౌని
పరశురాముని పితృభక్తికి మెచ్చి
పరమాదరమ్మున వరము లీయంగ
బ్రతికించె మరల నాపరశురాముండు
తనతల్లితో పాటు తనసహోదరుల
జనకుఁ డిచ్చిన వరశక్తుల వలన.

కార్తవీర్యార్జునున్ కడ తేర్చి నట్టి
పరశురామునిమీఁద పగఁబూని మిగుల
కార్తవీర్యుని సుతుల్ కలసి యేతెంచి
పరశురాముఁడు లేని తఱుణమ్మునందు
చంపిరి క్రూరులై జమదగ్నిమునిని.
రేణుక యాఘోరదృశ్యమ్ము నరసి
గుండెలు బాదుక గొంతెత్తి యేడ్చె
తల్లిరోదన విని త్వరగ నేతెంచి
తల తెగి పడియున్న తండ్రినిఁ జూచి
నృపతుల మనుచు నీవిపరీతములను
చేయు క్షుద్రులఁ బట్టి శిక్షింపకుండ
ఊరకుందునె యని యుగ్రుడై లేచి
ప్రళయరుద్రుని పోలె పరశురాముండు
పరశువు చేఁబూని పరువెత్తి యేగి

కార్తవీర్యుని పుత్రకాండమ్ము నెల్ల
శిరములు ఖండించి చీల్చిచెండాడె.

ఆయాగ్రహావేశ మాపగ లేక
క్షత్రియుం డనుమాట జగతి లేకుండ
నొనరింతునని లేచి యుగ్రుండై వచ్చు
పరశురామునిధాటి కరిముఠి యగుచు
క్షత్రియకుల మెల్ల గడగడ వణఁకె.
పరశువు గొని కోపపరవశుం డగుచు
కాలరుద్రునివోలె కాలాగ్నివోలె
అరిభయంకరుఁ డయి పరశురాముండు
ఇరువదియొకమారు లిలనెల్లఁ జుట్టి
కన్నుల కెదురైన క్షత్రియు నెల్ల
హాలియింపఁ జేసి యీభూభార ముడిపె
ఏరులై పారిన వారిరక్తముల
మడుగు లేర్పఱచి యామడుగులవద్ద
తండ్రి కా రుధిరంపుతర్పణల్ జరిపి
తండ్రిఋణముదీర్చి ధన్యుడై యలరె
పరమశౌర్యోగ్రుఁ డా పరశురాముండు.
అల కురుక్షేత్రమం దానెత్తుటేర్లె
పరగుచుండె శమంతపంచక మనఁగ

దురితులై ధరణిని చరియించు నట్టి
క్షత్రియవర్గమున్ సమయింప జేసి
తానుగెల్చిన సర్వధరణి నర్పించె
పరమధార్మికుఁడయి పరశురాముండు
యజ్ఞమ్ము లొనరించి యధ్వర్యతతికి.
పరమపావనమైన బ్రాహ్మ్యతేజమ్ము
శౌర్యధుర్యమ్మైన క్షాత్రతేజమ్ము
విపులమై రెండును విలసిల్లి నట్టి
లోకపూజ్యుండు సుశ్లోకవర్తనుఁడు
హరియవతార మాపరశురాముండు
మహితకీర్తుల గొన్న మహనీయమూర్తి.

తనవలె విష్ణ్వంశ జనితుఁడై యలరి
జగదేకవీరుఁడై శంభు విల్విఱిచి
జనకుని పుత్రిక జానకిన్ గొనిన
దశరథరాముని ధైర్యమ్ము మెచ్చి
ఆతని నెదిరించి అడ్డుగా నిలచి
ఆనెపమ్మున తనహరితేజమెల్ల
రాజితచరితుఁ డారామచంద్రునికి
దీవించి యిడినట్టి ధీరచిత్తుండు
భవ్యచరిత్రుఁ డాపరశురాముండు

నిత్యుఁడై ఘనతపోనిష్ఠ నేఁటికిని
వసియించును మహేంద్రపర్వతమందు.

పరశురాము నితండ్రి పరమతపస్వి
సప్తర్షిమండల సప్తమఋషిగ
చదల వెల్గుచునుండె జమదగ్నిమౌని.

---

## రంతిదేవుఁడు

ముని భరద్వాజుని వినుతవంశమున
రంతిదేవుఁడు పుట్టె రమణీయగుణుఁడు
దానధర్మములందు త్యాగమ్మునందు
నతనిసమాను లీయవనిలో లేరు.
తనకు లేకున్నను తడయక కర్థులకు
నిచ్చుటే యాతని కెక్కుడు ప్రీతి.

తనకుఁ గల్గిన దిట్లు దానమ్ము సంగి
నలుబదియెనిమిదినాళ్ళేకమారు
బంధుసమేతుఁడై పస్తుండె నతఁడు.
ఎట్టకేల కతని కెట్టులో దొరకె
పాయసమ్ము జలమ్ము నేయియు కొంత.
దానిని భుజియింపఁ దనవారిఁ బిలిచి

రంతిదేవుఁడు వచ్చునంత లోపలనె
ఆకలితో నటకరుదెంచి నట్టి
యవనీసురునిఁ జూచి యాతిథ్య మిచ్చి
తృప్తిఁ గావించెను ప్రీతితో మొదట.
రగిలెడు క్షుత్తుతో మిగిలిన దాని
రంతిదేవుఁడు కొంత గ్రహియింపఁ బోవ
క్షుద్బాధతో నొక్క శూద్రుఁ డేతేర
తాను భుజించుట మాని యాక్షణమె
అతనికి వలసిన యాహార మిచ్చె
ఇంతలో నొక్కరుఁ డేతెంచి యటకు
తనశునకమునకు తనకును గూడ
హారమ్ము లేదని యడుగుటే తడవు
తనయొద్ద మిగిలిన దాని నొసంగె
స్వల్పమ్ముగా నున్న జలము మాత్రమ్మె
త్రావుటకై రంతిదేవుండు లేవ
అతిదీనుఁడై యొక్కఁ డచటికే తెంచి
గ్రుక్కెఁడు నీళ్లైన గొంతులోఁ బోసి
ప్రాణమ్ము నిలుపగా బ్రతిమాలు కొనియె
ఉన్ననీరమ్ముల నొసఁగి యాతనికి
సంతసించెను మది రంతిదేవుండు

జనులైన మఱి క్షుద్రజంతువులైన
జీవులన్నిఁటిలోన దేవుఁ డొక్కండె.

అభిలాష యొక్కటే ఆత్మపోషణకు
కులనామభేదముల్ గొప్పకా దవని
తనకుమాలిన యట్టి ధర్మమేయైన
అర్థులై దీనులై యరుదెంచి నట్టి
వారి కొసంగుటే పరమధర్మముగ
రంతిదేవుం డెంచి బ్రతుకెల్ల గడపె.
మానవసేవయే మాధవసేవ
ఇంతకంటెను పుణ్య మిలయందు లేదు.

వేల్పులై యటు మాఱువేషాల బూని
రంతిదేవుని దానరక్తిని జూడ
కఠినపరీక్షలు కావించి తుదకు
రంతిదేవునిముందు ప్రత్యక్షమైరి
సంతోషచిత్తుఁడై రంతిదేవుండు
వారిపాదములకు భక్తితో మ్రొక్కి
నిలుచుండెనే గాని నిష్కామి యగుచు
వరములకొఱకయి ప్రార్థింప లేదు
అఖిలసంపదలకై యర్థింప లేదు

సకలసౌఖ్యమ్ము లిచ్చి సద్గతులిచ్చి
దేవత లతనిని దీవించి చనిరి
రంతిదేవుని త్యాగరమ్యవర్తనమె
రంతిదేవుని కృపారాజితగుణమె
ప్రజల కాదర్శమై పఱగు నేఁటికిని.

## శిబిచక్రవర్తి

ఘనుఁ డుశీనరునకు తనయుఁడై మున్ను
క్షితినిఁ బాలించెను శిబిచక్రవర్తి.
శరణార్థులను బ్రోచు సద్గుణాన్వితుఁడు
త్యాగశీలియు నను ఖ్యాతినార్జించి
కావించె భక్తితోఁ గ్రతువులు పెక్కు
ఏడుదీవులయందు నెవ్వారు గూడ
శత్రువుల్ లేకుండ సలిపె పాలనము
అతనికీర్తిని మెచ్చి యభవుఁడే వచ్చి
అతులసంపదలిచ్చి ఆశీర్వదించె

అతిదీక్షతో నొకయశ్వమేధమును
చేయుచున్నప్పు డాశిబిచక్రవర్తి
పావురమ్మొక్కటి భయముతో వచ్చి
వణకుచు శిబిరాజు పాదాల వ్రాలి
"రక్షింపుమయ్య యోరాజేంద్ర వేగ
నన్ను వెంటాడుచు నన్నుఁ జంపంగ
వచ్చెనయ్యదె డేగ పారిపోలేక
శరణుఁ జొచ్చితి నిన్ను ధరణీశ" యనఁగ
ఆపుల్గునకు శిబి యభయ మొసంగె
ఇంతలో నాడేగ యేతెంచి యటకు
"ఇదియేమి రాజ నీ వెఱుఁగని దేమి

నీతిమంతుఁడ వీవు ఖ్యాతిమంతుఁడవు
ఆహార మీపక్షి యవనిని నాకు
నాతిండి చెడగొట్ట న్యాయమా? యనగ
"శరణు! జొచ్చినది యీచిఱుపుల్గు నన్ను
అభయమిచ్చితి నని" యవనీంద్రుఁ డనియె
భూనాథ అటులైన దానికి బదులు
నీశరీరముకోసి నీమాంస మిపుడు
వేగమే యిమ్మని డేగకోరంగ
ఆలసింపక శిబి యాదీనపక్షి
నొకప్రక్క త్రాసులోనుంచి వేఱొకట
తన దేహమాంసమున్ తఱిఁగి ముక్కలుగ
ఎంతతూచినగాని సుంతైన గూడ
సరిపోక యాపిట్ట బరువుకు తుదకు
తనగుండె నే కోసి తఱిఁగి యీబోవ
"ఆగుమో శిబిరాజ! ఆగు" మటంచు
శిబిరాజు నట పరీక్షింపఁ దలంచి
ఆపావురమ్ముగా నాడేగరీతి
వచ్చిన యింద్రాగ్ను లచ్చెరు వెసగ
ప్రత్యక్షమగుచు నారాజును జూచి
అనుపమానము రాజ! అవనిని నీదు
త్యాగమ్ము నీతియు ధర్మగుణమ్ము
మెచ్చితిమోయి! నీసచ్చరిత్రమ్ము

శాశ్వతమ్ముగా నీకు సద్గతుల్ కలుగు
ననుచు నాతని దేహ మాతని కొసఁగి
ఆశీస్సుల నొసంగి యరిగిరి వారు.

శ్రీ. తిమిాద నేఁటికిన్ శిబిచరిత్రమ్ము
ఆదర్శవంతమై యలరి నిల్చినది
ధారుణిలో జీవ కారుణ్యమునకు
త్యాగమ్మునకు నీతిధర్మపద్ధతికి.

---

## శ్రీ రా మా వ తా ర ము

### ఇ క్ష్వా కు వ ం శ ము

శ్రీమహావిష్ణువే శ్రీరాముఁ డనఁగ
దైత్యోద్ధతి నణంచి ధర్మమ్ము నిలిపి
భూమికి సమకూర్ప క్షేమరాజ్యమ్ము
ఇక్ష్వాకువంశమం దిల నుద్భవించె
రాముని చరితమ్ము రమ్యామృతమ్ము
సర్వజనామోద సంపత్కరమ్ము.

ఇనునివంశమ్మున మనువుజనించె
మనువున కిక్ష్వాకు తనయుఁడై పుట్టె
ఇక్ష్వాకు కులజులై ఇలను పాలించి
రాజులెందఱో మహాప్రఖ్యాతిఁ గనిరి

సగరదిలీపులు సత్యవాక్యాలు
డల హరిశ్చంద్రుండు నాభగీరథుఁడు
మాంధాత రఘువును మహనీయుఁ డజుఁడు
మున్నగు నృపతు లత్యున్నతగుణులు
ప్రముఖు లాయిక్ష్వాకు రాజవంశమున
కోసలదేశాన కొమరారు నగరి
ఆయయోధ్యయె వారి కందతి కవని
మానితమ్మగు రాజధానీపురమ్ము.

రా వ ణ కుం భ క ర్ణు లు

సనకసనందన సంయమివరుల
శాపానుసారమ్ము జయవిజయులను
వైకుంఠమందిర ద్వారపాలకులు
పృథ్వి జనించిరి రెండవమారు
రావణకుంభకర్ణాసురు లనఁగ
విదితయశస్కుఁడు విశ్రవోమునికి
జనులకు మునులకు స్వర్గవాసులకు
ప్రబలశత్రువు లయి బాధించు నట్టి
రక్కసిమూకకు రాజు రావణుఁడు
బ్రహ్మచే కడుగొప్పవరముల బడసి
త్రిభువనమ్ముల గెల్చి ధీరుఁడై మిగుల
లోకకంటకుఁడైన భీకరుం డతఁడు.

వెఱగంది రావణాసురుని చేష్టలకు
దేవతల్ ఋషులును దీనులై యేగి
"రావణాసుర నుండి రక్షింప కున్న
అఖిలవిశ్వమె యింక ఆగబో దనుచు
విష్ణుని దర్శించి విజ్ఞప్తు లిడిరి.
హరి వారిమాటల నాలించి పంపె
"భయము వీడుడు మీరు వసుధపై బుట్టి
అంతమొందింతు నే నసురుల ననుచు.

శ్రీ రాముని జననము

ఇక్ష్వాకు వంశపు నృపతులయందు
అజునికుమారుఁడై యవని జన్మించె
విశదవిఖ్యాతుఁడౌ దశరథరాజు
అమరుల సాయమై యసురుల గెల్చి
ప్రఖ్యాతినందిన బలశాలి యతఁడు.
భార్యలు మువ్వు రావసుధాధిపతికి
కౌసల్యయు సుమిత్ర కైకేయి యనగ
పుత్రులకోఱకయి పుత్రకామేష్టి
నొనరించి నలువురు తనయులం బడసె
దైవసమానులన్ దశరథరాజు.

అమరుల కిడినట్టి యభయమ్ము నెంచి
నారాయణుఁడె పుట్టె ధారుణి నపుడు

రాముఁడై కౌసల్య రమణి గర్భాన
పడతి కైకేయికి భరతుండు పుట్టె
కాంత సుమిత్రకు కలిగిరి కవలు
సద్గుణుల్ లక్ష్మణ శత్రుఘ్ను లనఁగ
గురువువసిష్ఠుని కొమరొప్పఁ జేరి
చదివి రానలువురు సర్వవిద్యలును
విలువిద్య నేర్చిరి వీరికి సాటి
పృథ్వి నెవ్వరు లేని వీరు లనంగ.

రాముని బాల్యము

నలువురు సోదరుల్ లలితసద్గుణులు
వీరాధివీరులు వినయవర్తనులు.
రాముఁ డన్నను ప్రీతి ప్రజలకెల్లరకు.
శ్యామసుందరమూర్తి రామచంద్రుండు
ప్రాణమ్ము దశరథ రాజవర్యునకు.
బాల్యమ్మునుండియే ప్రాభవమ్మలర
నొనరించె రాముఁడు ఘనకార్యములను.

అనుజుఁడు లక్ష్మణుం డనుసరింపంగ
గాధేయుతోఁ జని కాననమ్ములకు
వీరబలోద్రేక విక్రమం బడర
ధైర్యమ్ముతో దుష్టతాటకం దునిమి
ప్రమోదించుచు సుబాహు మారీచుఁ ద్రోలి

రాముఁడు రక్షించె నామునిక్రతువు
ప్రథితబలాఢ్యు లారామలక్ష్మణుల
బలశక్తి మెచ్చి విశ్వామిత్రమౌని
దివ్యాస్త్రముల నిచ్చి దీవనలిచ్చి
వీరాగ్రణులఁ జేసె వారినిద్దఱిని
జనకభూపతి చేయు జన్నమ్ముచూడ
మునితోడ మిథిలకుఁ జనిరి బాలకులు.
భర్తశాపమ్మున పాషాణ మగుచు
పడియుండె వనిలోన పడతి యహల్య
రామునిచరణ మారాతిని సోక
సతియహల్యయు పొంది శాపవిముక్తి
కీర్తించె రాముని కృప భక్తితోడ.

పూర్వరాజులకథల్ పుణ్యగాథలును
వచియించి చాల విశ్వామిత్రమౌని
జ్ఞానవంతులఁ జేసె భూనాథసుతుల.

## సీతాకల్యాణము

మిథిలకు నరపతి పృథులయశస్వి
జనకమహారాజు మునుపొకనాఁడు
జన్నమ్మునకు భూమి దున్నుచునుండ
భూగర్భమందుండి పుణ్యదేవతగ
అసమానసౌందర్య మలరెడు నొక్క

బాలిక నాగంటిచాలున దొరకె.
ప్రీతితో పేరిడి సీత యటంచు
పెంచె నాబాలికన్ పృథ్వీశవరుఁడు
చంద్రునికళవోలె జనకుని యింట
పెరిగి జవ్వని యయ్యె విమలాంగి సీత
లావణ్యరాశియు లక్ష్మిస్వరూప
సీతకు పెండిలి చేయఁ దలంచి
జనకుఁడు చాటించె తనవద్దనున్న
హరువిల్లు మోపెట్టు ఉరుబలాఢ్యునికి
సీతమ్మ నిడి పెండ్లి సేయుదు నంచు
అవనీశు లెందఱో యరిగి యత్నించి
విఫలులై వెడలిరి విల్లెత్తలేక.
మిథిలకు వచ్చిన మేటిబాలకుడు
భీమబలాఢ్యుఁడా రామచంద్రుండు
శివునిచాపమ్మును చేతితో నెత్తి
మోపెట్టి నంతనే ముక్కలై విఱిగె
చూపరులెల్లరు చోద్యమందంగ
ప్రీతెను దిక్కులా భీషణధ్వనికి.
సీత సంతోషించె శ్రీరాము నరసి
శ్రీరాముఁ డలరెను సీతనుజూచి
జనకమహారాజు తన యమాత్యులను

పంపి రప్పించెను పలుకానుక లిచ్చి
తరుణుల తోడను తనయుల తోడ
దశరథరాజును తనపురమునకు
వైకుంఠమే దిగి వచ్చినయట్లు
జానకీరాముల కానాఁడు జరిగె
పరిణయ మ్మసమానవైభవ మ్మలర
జనకుని యింటనే జరిగె పెండ్లిండ్లు
తక్కిన దశరథాత్మజులకుఁ గూడ.

కొడుకులతో క్రొత్త కోడండ్ర తోడ
దశరథుం డేగెడి దారికడ్డముగ
బాణహస్తుండైన పరశురాముండు
వేగమ్ముగావచ్చి భీషణాకృతిని
శివుని విల్విఱిచిన శ్రీరాము బలము
కనుగొందు ననుచును గద్దించి పలుక
పరశురాముని గర్వభంగ మొనర్చి
రాముఁడు విజయాభిరాముఁడై యలరి
చేరె నయోధ్యకు పౌరులెల్లరును
స్వాగతవచనముల్ పలికి నుతింప.

శ్రీరాముని వనవాసము

సర్వసమర్థుఁడు సద్గుణుఁడైన
రాము నయోధ్యకు రాజుగాఁ జేయ

దశరథనరపతి తలపెట్టుచుండె
పరమసమ్మదమయ్యె ప్రజలకీమాట
కాని యాతనిపత్ని కైకేయి వచ్చి
దశరథేశుఁడు మున్ను తనకిచ్చినట్టి
వరములు రెంటిని నెఱవేర్చగోరె
తనసుతున్ భరతుని మనుజేశుఁ జేసి
వనికి రాముని బంప పదునాలుగేండ్లు
రాముఁ డయోధ్యకు రాజగు వేళ
కైకకోర్కెకు రాజు శోకించి యుండె.
తండ్రి వాగ్దానమున్ తలదాల్చి వేగ
పెద్దల కెల్లను వినయుఁడై మ్రొక్కి
సీతయు లక్ష్మణుం డేతేర వెనుక
వని కేగె రాముడు మునివేషమూని
రాముని కనుగొని ప్రణతు లర్పించి
నదిని దాటింపగా నావపై గుహుడు
తమ్మునితోడను తనసతితోడ
నడవిదారుల బట్టి యరిగె రాముండు.
రాజ్యసంపద వీడి రాముఁ డారీతి
పడతితో నడవులఁ బట్టి యేగంగ
శోకాన మునిగెను సాకేత మెల్ల
పుత్రశోకమ్మున పొగులుచు మిగుల
తనప్రాణముల్ వీడె దశరథేశుండు.

భరతుండు తనతల్లి పనికి చింతించి
చిత్రకూటమ్మును చేరి వసించు
రాముని కడకేగి ప్రార్థించె మిగుల
రాజ్యమేలగ నీవె రావలె ననుచు.
జవదాటనని చెప్పి జనకుని మాట
తనకుమారుగ నిచ్చి తనపాదుకలను
భరతుని వెనుకకు పంపె రాముండు
పాదుకలకె రాజ్యపట్టమ్ము గట్టి
భరతుఁ డేలుచు నుండె వసుధాతలమ్ము
శ్రీరాము నేనిల్పి చిత్తమ్ము నందు.
మనమున దుఃఖించి జనకుని మృతికి
పితృతర్పణమ్ముల నతిభక్తి సలిపి
వనినుండి వనికేగె వరుస రాముండు
మునివర్యులకు పూజ లొనరించుకొనుచు.

శ్రీహరిరూపమ్ము శ్రీరామ మూర్తి
ఎచటికేగిన మునులచటికే తెంచి
చెప్పిరి దైత్యులు చేయు దౌష్ట్యములు
దౌష్ట్యమ్ము లొనరించు దైత్యుల నెల్ల
పరిమార్తు ననిచేసె ప్రతిన రాముండు
మునికుల మ్మెల్లను ముదమంది పొగడ
అత్రియాశ్రమమున కరిగిరి వారు

అంగరాగములిచ్చి యనురాగ మెసఁగ
జనకజన్ దీవించి అనసూయ యచట.
అనఘునగస్త్యుని అతని సోదరుని
శరభంగునినిగూడ అరసి పూజించి
వారలవాక్యానుసారమ్ము తుదకు
దండకాటవిఁ జేరి తాపసాశ్రమము
నిర్మించి గౌతమీనీర తీరమున
శ్రీరాముడు వసించె సీతను గూడి
అన్నకు వదినకు నతిభక్తి తోడ
సౌమిత్రి సేవలు సలుపుచు నుండె.
సీతకా యడవుల చెలువు చూపుచును
పొలుపార నుడువుచు పుణ్యగాథలను
కాలమ్ము రాముఁడు గడపుచు నుండె.
క్రూరదైత్యుల నెట్లు కూల్పంగవలెనొ
నిత్యమ్ము దలచుచు నెమ్మదిలోన.

### కాకాసురుఁడు

అవనిజ యొకనాఁ డాశ్రమమందు
నిదురించు చుండిన యదను గన్పెట్టి
కాకాసురుఁ డొకండు గాలియై వచ్చి
పయ్యెట తొలగించి వక్షమ్ము నుండి

చీల్చెను గోళ్ళతో చెలుకండ నొకటి
సీత వేదననొంద శ్రీరాముఁ డరసి
కాశమ్ముపై నేయ గడ్డిపోచొకటి
అది మహాబాణమై యసురునిబట్టి
త్రిప్పుచు ప్రాణముల్ తీయబోవంగ
తనను రక్షించు నేఘనుఁడును లేక
కడుదీనుఁడై వచ్చి కాకాసురుండు
క్షితి నమోఘముగాన శ్రీరాముశరము
గడ్డిపోచకు తనకన్నొకఁ డిచ్చి
శరణార్థియగుచును కరుణాళుడైన
రాముపాదములంటి ప్రార్థించి చనియె.

శూర్పణఖ

రాముడా యాశ్రమసీమలం దుండ
రావణుసోదరి రాక్షసవనిత
శూర్పణఖ యొకర్తు సుందరాకృతిని
"ఈ కొకిబకి సీత నీకేల రామ
అనుభవింపు సుఖమ్ము ననుగూడి" యనుచు
విడువక వేధింప విసివి రాముండు
లక్ష్మణుచేత నారాక్షసాంగనకు
ముకుచెవుల్ గోయించి పోఁద్రోలె వెలికి
తనకై నశిక్షకు కినిసి శూర్పణఖ

వెంటనే ముప్పదివేల రక్కసుల
ఖరదూషణులతోడ కలిపి పంపించె
రాముని వధియించి రండని వేగ
సురలనే యెదిరించి స్రుక్కింపఁజేయు
నిరుపమ వీరు లాఖరుఁడు దూషణుడు
అగ్నులే వర్షించి రారాముపైన
వీరకోదండోగ్ర నారాయణుండు
భీమబలుండయి రాముఁ డొక్కండె
వధియించె రణమున వారినందఱిని.

### సీ తా ప హ ర ణ ము

ఇది పనిగాదని యేగి శూర్పణఖ
అన్నరావణుతోడ నెన్నియో నుడివె
తనవికృతాస్యమ్ము కనుగొను మనుచు
శ్రీరాముశౌర్యమ్ము సీతయందమ్ము
ఖరదూషణాదుల మరణవార్తయును
ఆలించి రావణుం డావార్తలెల్ల
మనుజమాత్రుఁ డొకండు తనవారి కింత
యపకృతిఁ జేయునే యని యాగ్రహించి
రాముని వంచించి భూమిజన్ గొనగ
మదినెంచి మాయావి మారీచుతోడ
రాముని యాశ్రమ ప్రాంతమ్ము జేరె.
బంగారువన్నెల పస మీఱుచున్న

యాయలేడిగ మాఱి మారీచుఁ డచట
తిరుగాడుచుండుట తిలకించి సీత
మనుజాశనుల మాయ మదినెంచ లేక
వేడెను రాముని లేడిఁ దెమ్మనుచు
నెడలె రాముఁడు లేడివెన్వెంట వడిగ
అటునిటుఁ బోవుచు నందకా లేడి
శ్రీరాము గొనిపోయె దూరభూములకు
ఇది దైత్యమాయయే మృగముగా దనుచు
బాణ మొక్కటి రాముఁడేసెపై నేయ
హాజానకీ! లక్ష్మణా! యని యార్చి
మృగము మారీచుఁడై పృథివిపై గూలె.
ఏమైనదో యట రాముని కనుచు
భయపడి లక్ష్మణున్ పంపెను సీత.
ఒంటిగా నున్నట్టి యుర్వీజం జూచి
యతివలె రావణుం డరుదెంచి యటకు
మిథిలజన్ గొనిపోయె రథముపైఁ బెట్టి.
సీతను బలిమిని చెఱబట్టి యేగు
దనుజుఁ గాంచి జటాయువను పక్షిరాజు
దైత్యాను నెదిరింప దైత్యుండు ప్రబలి
పక్షేంద్రుఁ బడనేసె పక్షముల్ నరకి.
ధరణిజ మూర్ఛిల్లి దనుజరథాన
తెలివొంది లేచి యా దితిజుఁగఁజూచి

"చోరునివలె వచ్చి యోరోరి నీచ!
శ్రీరామవిభుఁ డట్లు దూరమేఁగంగ
పిరికిపందవు నన్ను చెఱబట్టినావు.
రాముఁడేతెంచి నీప్రాణముల్ దీయు
ననుచును పలుమార్లు దనుజు నిందించి
తనదుస్థితికిఁ గ్రుంగి తనవిభుం దలఁచి
ధరణి నొక్కెడ కపుల్ తిరుగుటఁ జూచి
తనసగల్ మూటగా నొనరించి విసిచె.
సీతను లంకకుఁ జేర్చి రావణుఁడు
నరుఁడు నీకేల నోనలినాక్షి సీత!
నా కేలు గ్రహియించి నారాణి వగుచు
త్రిభువనమ్ముల నేలి దీపింపఁ గలవు
అటులఁ గాదేని నీయసువులఁగొందు
యోచించు కొనుము నీయుల్లమ్మునందు
గడు వొకయేడని నువిడి తాఁ జనియె
సీతకు బుద్ధిని చెప్పుడటంచు
కాపుంచి రాక్షసకాంతల నచట.

మారీచుఁ డారీతి మహినిఁ గూలంగ
దనుజుల మాయగాఁ దలఁచి సర్వమ్ము
ఉర్వీజ యేమయ్యెనో యని వచ్చు
రాముని కెదురయ్యె సౌమిత్రి యచట.

పృథ్వీజ నొంటిగా విడచి నీవిటకు
రానేల లక్ష్మణా ! దానవు లేమి
చేసిరో యనిమదిన్ శ్రీరాముఁ డడలి
ఆశ్రమమ్మున కేగ యవనిజ లేదు.
సందియ మ్మిక లేదు జానకీదేవి
దనుజులపాలయ్యె తమ్ముఁడా యనుచు
భూమిపై మూర్ఛిల్లె రామచంద్రుండు.
శ్రీరాము డొకకొంత సేదదేరంగ
ధరణిజన్ వీడి తా నరిగినవిధము
సౌమిత్రి వచియించె రామునితోడ.

ధారుణీజాతకై వార లిర్వురును
వెదకంగసాగిరి విపిన మెల్లెడల
పక్షిజటాయువు వారిని జూచి
దనుజుఁడు సీతనుగొనిపోవు టెల్ల
వచియించి తన కొనప్రాణముల్ వీడె.
విహగేంద్రునకు సల్పి దహనసంస్కృతులు
భూమిజన్ దలఁచుచు రాముఁడు మరల
"కొనివచ్చితినిగాని వనికి నాతోడ
కాపాడలేనైతి భూపుత్రి! నిన్ను
నినువీడి నేనిక మనజాల" ననుచు
విలపించె బేలయై పలుమారు లచట

సౌమిత్రి యంతట రామునిఁ జూచి
క్షితిని దేవుడ వీవు శ్రీరామచంద్ర
ప్రాకృతువలె నిట్లు పలవింప నేల
దితిజులఁ జంపు నీ ప్రతిన యేమయ్యె
అవనిజం గొనివత్త మసురులఁ జంపి
లెమ్మని రాముని లేపి తోడ్కొనుచు
విపినవీథుల వెంట వెడలుచుండంగ,
వెనుకనుండి కబంధుఁడనువాడు వచ్చి
వారిని బంధించి వారిచేఁ జచ్చి
శాపముక్తినిఁ బొంది సౌమ్యుఁడై నుడివె
కీశేశు రాజ్యము కిష్కింధ కడకు
చేరుడచ్చట మేలు చేకూరు ననుచు.

కి ష్కిం ధ

శ్రీరామలక్ష్మణు లారీతి వనుల
నరుగుచు కిష్కింధ కరుదెంచి నంత
ధృతిమంతుఁడును మహాతేజస్వి యైన
హనుమంతుఁ డనుకపి యరసి వారలను
కపినేత సుగ్రీవుకడకుఁ గొంపోయి
చేసెను వారికి స్నేహమ్ము నచట
జనకునాజ్ఞను తాను వనికి వచ్చుటయు
దనుజుండు సీతను కొనిపోవు టెల్ల

వచియించె రాముఁడు వానరాగ్రణికి.
దనుజుండు జనకజన్ గొనిపోవు నపుడు
యవనిజ వదలిన యాభరణముల
తనకుఁ జిక్కినవాని గొనివచ్చి చూపి
సీత నన్వేషించి ప్రీతితోఁ దెత్తు
ననుచు నాశపిపీరు దినకులేశునకు
వాగ్దాన మొనరించి భయమును బాపె,
సుస్నేహమూర్తి యాసుగ్రీవుఁ డంత
తనయన్న యగు వాలి దర్పమ్ముతోడ
తన్నీవలకు నెట్టి తనసతిన్ బట్టి
యొనరించుచున్నట్టి యనుచిత మెల్ల
చెప్పెను దీనుఁడై శ్రీరాము తోడ
వాలిబలమ్మును వర్ణించి యతఁడు
శంకించె రాముని శక్తియుఁ గూడ
శ్రీరాముఁ డంతట ధృతిమీఱ లేచి
వాలిచే మృతినంది పర్వతమట్టు
లగుపించు దుందుభి యస్థిసంచయము
వినువీథి కెగయించె గొనగోట మీటి,
ఏకబాణమ్మున నేడు తాళముల
గొండతో పాటుగా గొట్టి ఛేదించి
పంపెనొక్కమ్మడి పదియోజనములు.
సుగ్రీవుఁ డదిచూచి చోద్యమ్ము నంది

భక్తితో రాముని పదములఁ బ్రాలె.
పంపి సుగ్రీవుని వాలితో పెనఁగ
వెనుక రాముండుండి సునిశితాస్త్రమున
వాలిని వధియించి వానరరాజ్య
మొసఁగె సుగ్రీవున కొప్పుమీఱంగ
వాత్సల్యమునఁబిల్చి వాలికుమారు
నంగదున్ నియమించె యౌవరాజ్యమున.

## లం కా ద హ న ము

వానరసేనను పంపె సుగ్రీవు
డన్నిదిక్కులవంక కవనిజన్ వెదుక
అబ్ధిని లంఘించి హనుమంతుఁ డేగి
లంకాపురి నశోక లలితోపవనిని
రాముని ధ్యానించు భూమిజన్ జూచి
ఆనవాలుగ రాము నంగుళీయకము
సీతకొసఁగి రాము క్షేమమ్ముఁ దెలిపి
వేగమె రాముఁడు విచ్చేయు ననుచు
సీతకు ధైర్యమ్ము చెప్పి బీరమున
తనను బంధింపగా చనుదెంచి నట్టి
అసురులఁ బరిమార్చి యసమశౌర్యమున
లంకనెల్లను గాల్చి లావున మెఱసి

తునియలుగ నశోకవనమును పెరికి
వేగ కిష్కింధకు విజయుఁడై వెడలి
ఆనవాలుగ తన కవనిజ యిడిన
చూడామణి నొసంగి క్షోణిజ వార్త
శ్రీరామునకుఁ జెప్పి ప్రీతిదలిర్ప
హనుమని యుపకృతి కాత్మలోన నలరి
కౌగిటఁ బూని యా కపివర్యు నెలమి
గౌరవ మ్మొసఁగెను శ్రీరామ విభుఁడు.

రావణుని దుర్మార్గము

ఒకకోతి తనముందె యొనరించె నింత
శ్రీరాముఁ డింకెంత చేయునో యనుచు
జడియుచు బాధింపఁదొడగె రావణుడు
అనుదిన మ్మలుకతో నవనిజం జూచి
రామలక్ష్మణు లిదె రణమున నేఁడు
మడిసిరంచును జూపె మాయబొమ్మలను
తనకున్న శాపమున్ తలచి చిత్తమున
దరిజేర బోవడా ధరణిజ నంతె.
పరివారయుతుఁడయి వైభవమ్మొసఁగ
అనురేంద్రుఁ డొక్కనాఁ డవనిజం జూచి
కత్తి నిర్ఘుళిపించి కటువుగా పలికి
తనమూట నెలలోన వినకున్న యెడల

పరిమార్చి గ్రద్దల కెఱవేతు ననుచు
పలురీతులను పల్కి భయపెట్టి యేగె.
వినక రావణుమాట పెడమొగ మ్మగుచు
రాముని స్మరణమ్మొ రాత్రింబవళ్ళు
సేయుచుండెను సీత చిత్తమ్మునందు
జానకింగాంచి త్రిజటయను నామె
చింతింప కమ్మ నీ శ్రీరాముఁ డిటకు
వచ్చి రావణుఁ బట్టి వధియించినట్లు
కలగంటినని యామె కలతను బాపె.

## రామరావణ సంగ్రామము

కపిరాజు సమకూర్చె కపిసేన నెల్ల
కపిసేన తనవెంట కదలి యేతేర
వార్ధిపై రాముఁడు వారధిఁ గట్టె
పుణ్యుఁ డగస్త్యుండు బోధించి నట్లు
ఆదిత్యు నర్చించి యతిభక్తి తోడ
లంకపై దండెత్తె బింకమ్ము మెఱయ.
నిరసించి రావణు దురితమ్ము లెల్ల
ఆరావణునిచేత నవమాన మొంది
యాతని సోదరుం డావిభీషణుఁడు
శరణుఁబొందెను రామచంద్రునిఁ జేరి
"ధరణి దుష్టులఁ జంపి ధర్మమ్ము నిలువ

అవని జనించిన హరి రామవిభుఁడు
జగదేకవీరుఁడు సర్వవద్యుండు
త్రిభువనపూజ్యుఁడు దేవుఁ డాతండు
శరణని వచ్చిన శత్రువు నైన
కరుణించి రక్షించు కరుణాళుఁ డతఁడు
అసురేంద్ర నీకేల నతనితో పోరు
రాముని సీతను రామునికిచ్చి
శరణొంది బ్రతుకు మీ జగతిని గాని
సర్వనాశన మేల సలుపుదు వీవు"
అనియెందఱో వేడిననుగూడ వినక
తనకున్న వరములు తనకున్న బలము
తలఁచి దర్పమ్ముతో తనరథమ్మెక్కి
కఱుపాత్ముఁడును క్రూరకర్ముతుం డయిన
రావణుం డనికేగె రామునిపైకి
కుంభద్బలుండగు కుంభకర్ణుండు
ప్రతిలేని మాయావి సుతుఁ డింద్రజిత్తు
దైత్యసేనలతోడ తనవెంటనడువ.
వానరసేనపై దానవసేన
తలపడె దారుణదర్పోగ్రు లగుచు.
తరుశైలములనెల్ల తరలించి తెచ్చి
గుప్పించి రసురుల గుంపుపై కపులు
దారుణ మారణాస్త్రమ్ములతోడ

అగ్నులే కురిపించి రసురులు రేగి
రామచంద్రుఁ డటు రావణుఁ డిచట
రామరావణ ఘోరరణమహోద్భటుల
కలఁగె నంభోనిధుల్ కంపించె ధరణి
దానవుల్ మడిసిరి వానరుల్ పడిరి
పీనుఁగు పెంటలు వినువీథి నంటె.
కాలరుద్రునివోలె గవిసి లక్ష్మణుఁడు
హతమార్చుచుండగా నసుర సేనలను
ప్రబలమా శక్తిని పంపి రావణుఁడు
క్షితిపైన మూర్ఛిలఁ జేసె లక్ష్మణుని
ఆంజనేయుఁ డేగి సంజీవి దెచ్చి
బ్రతికించె లక్ష్మణున్ బ్రమద మ్మెసంగ.
తెలివొంది లక్ష్మణుం డలుకతో నెగసి
దనుజసైన్యమ్ముల ధ్వంసమ్ము జేసి
ఇంద్రజిత్తునిబట్టి పృథివిఁ గూల్చె
అంగద సుగ్రీవ హనుమదాదులును
హతమార్చి రేపున నసురవీరులను
అమరేంద్రుఁ డంపిన అరదమ్మునెక్కి
దిశ లావరించిన తేజమ్ముతోడ
ఘోర కార్ముక వీర నారాయణుండు
రామచంద్రు డేగె రణరంగమునకు
తన వరమ్ములశక్తి తన తపోబలము

తోడుగా దనుజుండు దోర్దర్ప మలర
బాణాగ్నితో నింపె భూనభోంతరము.
దితిజేంద్రునస్త్రముల్ తెగనేసి యెగసి
రావణుశిరములు రాముండు నఱకె
తెగిపడు శిరములు తిరిగిరావణుని
కంఠమ్ముఁ జేరుట గాంచి రాఘవుఁడు
మహినిరావణుఁ డీల్గు మర్మము నెఱిగి
మారణాస్త్రమ్మొండు మంత్రించి వదలె.
కుపిత రాఘవ ఘన క్రూర బాణాగ్ని
కసువులు వీడుచు నవనిపైఁ ద్రెళ్ళి
కూలిరి రావణ కుంభకర్ణులును.
లోకకంటకుఁ డైన రాకాసిఱేఁడు
భూమిఁ గూలినయంత రామబాణమున
హర్షమందిరి ప్రజ లమరులు మునులు
పుడమిపైఁ గురిసెను పూవుల వాన
దివిపైన మ్రోగెను దేవదుందుభులు
దైత్యవర్గము లెల్ల తనరి హర్షింప
అభిషిక్తు నొనరించె నావిభీషణుని
రాజుగా లంకకు రాఘవేంద్రుండు.

రామునివిజయమ్ము రావణుమృతియు
హనుమవిభీషణు లరిగి వచించి

దనుజాంగన లొనర్ప తగిన సేవలను
శుభ్రభూషణవస్త్ర శోభితయైన
సీతను దెచ్చిరి శ్రీరాము కడకు
శ్రీరామునకు మ్రొక్కి సీత నిల్వంగ
"పరవాసమందున్న పడతి జానకిని
గ్రహియించు టెటు"లని రాముఁ డనంగ
వెఱగంది రాపల్కు వినిన వారెల్ల.
తనశీలసంపద ధరణికిఁ దెలుప
అగ్నియందునఁ దూకె నవనిజసీత
అగ్నిప్రత్యక్షమై యందఱి యెదుట
చాటెను జానకి సౌశీల్యమహిమ
సీత సౌశీల్యమ్ము క్షితినెల్లరకును
తెలిసినందుల కెద నలరి రాఘవుఁడు
సీతను దరిజేర్చి చెలువ మింపార.
ధరణిపై రాక్షసదురితమ్ము లణగె
జానకీరాముల సంయోగ మెనసి
ఆనందమున పొంగి రచటి వారెల్ల
బ్రహ్మాదు లరుదెంచి రాముని కెఱఁగి
వినుతించి రాతని ఘనకార్యములను
రణమున మృతిఁగొన్న వనచరవరుల
వాసవుఁ డరుదెంచి బ్రతికించె మరల,

## శ్రీరాముని పట్టాభిషేకము

స్నేహితుల్ వెంటరా శ్రీరాముఁ డంత
భూమిజన్ దోడ్కొని పుష్పక మెక్కి
చేరె నయోధ్యను చెలువు మీఱంగ
భరతశత్రుఘ్నులున్ పురజనులెల్ల
రాముని రాకకు ప్రమదమ్ము నంది
స్వాగత మ్మొసంగిరి వైభవమ్మెసఁగ
ఉల్లాసమందిరి తల్లులు మువురు.
పౌరులు మంత్రులు పరివారములును
సామంతనృపతులు చనుదెంచి కొలువ
గురువులు మునులును కూర్మి దీవించి
వేదశాస్త్రోచిత విధివిధానముగ
కోసలరాజ్య సింహాసనాధీశుఁ
జేసిరి వేడ్కతో శ్రీరామవిభుని
తనకృతజ్ఞతఁ దెల్పి తగుకాన్కలిచ్చి
బంధులన్ మిత్రులఁ బంపె రాఘవుఁడు
హనుమంతుఁడును తమ్ములతిభక్తితోడ
సేవింప ధాత్రిని శ్రీరాముఁ డేలె
పదొకండు వేలేండ్లు ప్రాభవమ్మలర
సర్వవర్ణమ్ములు సంయమివరులు
సహజధర్మమ్ముల సకలసంపదల

పొంది సుఖించి శేషాచ్చ్యముల్ లేక
జగతినెల్లెడ వెల్గె శాంతిసౌఖ్యములు.

కుశలవుల జననము

శంక యింతయు లేక స్వాంతమ్మునందు
పరవాసమందున్న భార్యను మరల
చేకొనివచ్చెను శ్రీరాముఁ డనుచు
పౌరుఁడొక్కఁ డెవండో పలికినమాట
చెవినిబడ్డంతనె శ్రీరామమూర్తి
ఆ యపనిందల కాత్మలో కలఁగి
అవనిజ గర్భిణియని యైన సుంత
తలపక జానకిన్ త్యజియించె వనుల.
కానలోఁ బడియేడ్చు జానకిం గాంచి
వాల్మీకిమునిరాజు వాత్సల్య మెసఁగ
తన యాశ్రమమునకు గొనిపోయి యచట
మునిపత్నులకుఁ జెప్పి యనుకూలరీతి
సమకూర్చె సీతకు సకలసేవలను
శ్రీరాము నే నిల్పి సీతచిత్తమున
ప్రత్యాహారహామును భక్తితోఁ గొలిచి
దినములు గడపె నామునివాటియందె.
సులువుగా నొకనాఁటి సుముహూర్తమందు

కనియెను జానకి కవల లిద్దఱిని
కుశలతో దీవించి కుశలవు లనుచు
వారికి పేర్లిడె వాల్మీకిమౌని.
కంటికి ఱెప్పగఁ గాచి జానకియు
పెంచుచుండెను తనబిడ్డలిద్దరిని.
రమణీయమూర్తులు రాజలక్షణులు
లవకుశుల్ రాజిత లలితసద్గుణులు
విలువిద్యతోఁబాటు విద్య లన్నిఁటిని
పడసిరి శ్రద్ధతో వాల్మీకి వద్ద.
జానకీరాముల సచ్చరిత్రమ్ము
రామాయణమ్ముగా రమణీయఫణితి
వ్రాసి వాల్మీకి యాబాలురచేత
గానమ్ముఁ జేయించె కర్ణపేయముగ.

భూదేవి జానకిని కొనిపోవుట

సీతావియోగమ్ము శ్రీరామపతికి
భరియింపగాలేని పరితాప మయ్యె
ముఖ్యబంధుల బిల్చి మునుల రావించి
అవనిశ్రేయమునకై యశ్వమేధమును
చేయ సంకల్పించె శ్రీరామవిభుడు
తనవెంట కుశలవుల్ జనకజ రాగ
వాల్మీకితపసియు వచ్చె నచ్చటికి

ఆ నాఁడయోధ్యయం దన్నిచోటులను
రామునిచరితమ్ము రమ్యకంఠముల
లవకుశుల్ పాడి రాలాలిత్యమునకు
బాలురపాటను బాలు రిద్దఱిని
పొగడిరి ముదమంది పురజను లెల్ల
వార లాక్రతువాటి చేరినంతటనె
వాల్మీకి రామునివద్దకు వచ్చి
"శ్రీరామ! నీవిల నారాయణుఁడవు
భూజను లెల్లరు పూజింపఁ దగిన
సాధ్వి యాజానకి సద్గుణుల్ సుతులు
సందియమ్మెడబాసి స్వాంతమ్మునందు
శ్రీరామ వీరిని చేకొను" మనియె
శ్రీరాముఁ డంత నాఋషిచంద్రుఁ జూచి
తనవర్తనము గూర్చి జనకజ మరల
శపథమ్ము చేయుట చాల మేలనగ
విభ్రాంతినొందిరి వినినవారెల్ల.
నిశలాత్మయై పతి వింతమాటలకు
జనియించుటాదిగా సౌఖ్యమ్ము లేక
వనములపాలైన జనకజ సీత
సుతులిద్దఱిని జూపి పతి కప్పగించి
జనుల సంభావించి మునులకు మ్రొక్కి
శ్రీరామునకు మ్రొక్కి చిత్త మర్పించి

"శ్రీరామునే నేను చిత్తమ్మునందు
దైవమ్ముగా నెంచి భావింతు నేని
ఏపాప మెఱుంగని యిల్లాలి నేని
నన్ను జేకొనిపోవె నాతల్లి!" యనఁగ
పుడమి బ్రద్దలు జేసి భూదేవి వచ్చి
సీతనలంకృతన్ జేయించి వేగ
సింహాసనమ్మున సీతను బెట్టి
పొలుపారఁ గొనిపోయె భూగర్భమునకు
అద్భుతాశ్చర్యమ్ము లావహిల్లంగ
తమతల్లి తమరాణి తమదైవమూర్తి
సీత లేదని జనుల్ చింతించినారు
బంధువుల్ దుఃఖించి వగచిరి మిగుల.
ఎవరికై యత్నమ్ము నింతగాఁ జేసి
దుష్టరాక్షసులను దునుమాడినాఁడో
తనబహిఃప్రాణమ్ము తనభార్య సీత
పుడమిగర్భమునఁ బడి లీనమయ్యె
భార్యకై రాముఁడు వగచి దుఃఖించె
ఆగ్రహమ్ముగ మాటి యాదుఃఖ మెల్ల
తనసీత నారీతి గొనిపోయి నట్టి
వసుధాతలమ్మును భస్మమ్ము సేయ
ఘోరకార్ముకమెత్తె శ్రీరామమూర్తి.
బ్రహ్మాది దేవతల్ పరువున వచ్చి

"ఆగుమయ్యా రామ! అవని నేయకుము
ఉర్వి నాశనమగు నోకసీతకొఱకు
సకల లోకాధారశక్తివి నీవు
నారాయణుఁడ వీవు శ్రీరామచంద్ర!
కారణజన్మ యాధారుణీజాత
మీవల్లనే కాదె మేదిని మీద
దైతేయు లణగిరి ధర్మమ్ము నిలిచె.
భూమికి శాశ్వతక్షేమరాజ్యముగ
ఆదర్శనృపతివై యవని నేలితివి
త్యాగమ్ము నీతియు ధర్మవర్తనము
సౌజన్య మకలంక శౌర్యసంపదయు
తనరి వర్ధిల్లిన ధర్మదేవతగ
మానవధర్మమ్ము మహిని నిల్పితివి
నీసద్గుణమ్ములు నీమహాత్త్వమ్ము
వర్ణింప నెవరికిన్ వలను కాదిలను
నీపేరు నీకీర్తి నీచరిత్రమ్ము
ఆచంద్రతారార్క మవనిపై నిలుచు.
సీత యెచ్చటికేగె సీత నీయందె
చేరియున్నది రామ! శ్రీలక్ష్మియగుచు
శాంతింపుమిక రామ! జగమెల్ల నిలువ
సర్వజగన్నాథ సర్వేశ" యనుచు
బ్రహ్మాదు లేగిరి ప్రస్తుతుల్ సలిపి.

రాముఁడు శాంతించె బ్రహ్మ మాటలను
పరమప్రశాంతమై వరలెను ధరణి
ఒకవిరాగము రాముసుల్లమ్ము నందు
కడుబలీయమ్మయి పొడసూపెనంత
మున్నెగతించెను కన్నతండ్రియును
ధరణిజ యేగెను తల్లులున్ చనిరి
తనకేమి మిగిలెను ధాత్రిపై నింక
తనపని ముగిసిన దనుచు యోచించి
శ్రీరాముఁ డెద పూర్ణవైరాగ్య మందె.

శ్రీరాముడు వైకుంఠమున కేగుట

పరమేష్ఠి యొసఁగిన వార్తఁ గైకొనుచు
యముఁ డంతలో నొకయతివలె వచ్చి
"నీకయి శ్రీరామ ! వైకుంఠమందు
వేచియున్నా రిక విచ్చేయు మనుచు
కదురహాస్యముగ నుడివి తా వెడలె
కోసలావని పంచి కొడుకుల కిచ్చి
తమ్ములసుతులకు తగురాజ్య మిచ్చి
బంధుమిత్రుల నెల్ల పరివారములను
పిలిచి సంభావించి పలికిశుభమ్ము
దానధర్మము లిచ్చి మానితరీతి
కూర్మితో దీవింప గురువులు మునులు

చేరినప్రజలెల్ల జేజేలు పలుక
నారాయణాకృతి శ్రీరామమూర్తి
విజయమ్ము ధర్మమ్ము వెనువెంట నడువ
తనదివ్యతేజమ్ము దశదిశల్ నిండ
బయలు వెడలి మహాప్రస్థానమునకు
సరయూజలమ్ములం దరిగి ధ్యానమున
తనదివ్యరూపమ్ము తలచినయంత
శ్రీవిష్ణురూపమ్ము చెలగిదీపించె
కడురయమ్మునవచ్చె గరుడవాహనము
బ్రహ్మయు శివుడును వాసవుఁ డాది
అమరులెల్లరు వచ్చి అతిభక్తితోడ

గరుడవాహన మెక్కి కమనీయగతిని
చేరె వైకుంఠమ్ము శ్రీరామమూర్తి
భాగవతోత్తముల్ పరమవైష్ణవులు
వైభవమ్మున వచ్చి స్వాగత మిమ్మయ.
అంతకుమున్నె యనంతునిఁ గలసె
లలితసద్గుణరాశి లక్ష్మణస్వామి.
భరతశత్రుఘ్నులు సరయువుఁ జేరి
అచ్యుతతేజమం దైక్యమై చనిరి.
విడలేక రాముని వెనువెంట నడచి
వాహినిం బడి చాల బంధుమిత్రులును

ధన్యులయిరి ముక్తిధామమ్ముఁ జేరి.
ఏదేవతాంశయం దిల బుట్టినారొ
ఆదేవతలయందె యైక్యమై చనిరి
వరుస సుగ్రీవాది వానరవరులు
రామావతారమ్ము భూమిపై ముగిసె
హరియవతార మీయవని రాఘవుఁడు
పదునాల్గువేలేండ్లు వసుధఁ బాలించె.
మనుజుల కాదర్శమానవుం డతఁడు
నృపతుల కాదర్శనృపతి యతండు
ధర్మమ్ము వర్ధిల్లె దాస్యమ్ము లడఁగె
శాంతిసౌఖ్యమ్ములు జనులకుఁ గలిగె.
క్షేమరాజ్యమ్మైన రామరాజ్యమును
మఱవగ జాలరు ధరణి నెన్నటికి.

రామునిసుతులన్న ప్రఖ్యాతి బడసి
లవకుశుల్ జేసిరి యవనిపాలనము
సకలసంపదలతో జనులు వర్ధిల్ల
శాశ్వత సత్కీర్తి సమ్మాన్య మగుచు
రాముని వంశమ్ము భూమిపై నిలిచె.
రామునిచరితమ్ము భూమినెల్లరకు
సకలకల్యాణైక సంపత్కరమ్ము
భవబంధహారణమ్ము పరమపూజ్యమ్ము.

# శ్రీమహాభాగవతము

# దశమస్కంధము

## శ్రీకృష్ణావతారము

### బ్రహ్మదేవునితో భూదేవి మొఱ

కృతయుగము గతించె త్రేతయుఁ గడచె
ధరణిపై నడుగిడె ద్వాపరయుగము.
దైత్యోద్ధతు లెసంగె ధాత్రిపై మరల
పాపవర్తనములు ప్రబలమ్ము లయ్యె
భరియింపజాల కీపాపభారమ్ము
దేవతల్ వెంటరా గోవురూపమున
బ్రహ్మవద్దకు నేగి వసుధామతల్లి
మొఱలిడె నీపాపభరమును బాప.

పరమేష్ఠి కరుణతో వారిని జూచి
"వీడు డీభయమును వెతలుడు మీరు
యాదవవంశమం దవనిపై నింక
వసుధాభరము బాప వసుదేవునకును
శ్రీహరి జనియించు శ్రీకృష్ణుఁ డగుచు
ఆదిశేషుఁడు బుట్టు నతని కగ్రజుఁడు

బాహువిక్రమశాలి బలరాముఁ డనఁగ
హరిపూజకోటికయి యదుకులమందు
జనియింతు రప్సరల్ సకలదేవతలు
పుట్టును మాయయు భూమీతలాన
శ్రీకృష్ణలీలా విశేషమ్ము లెల్ల
అద్భుతావహములై యలరును ధరణి
ఆదేవు మహిమచే నవనిపై నింక
దైత్యోద్ధతు లడంగి దౌష్ట్యమ్ము వెడలి
శాంతిసౌఖ్యమ్ములు జగతిపై నిలుచు"
ననిచెప్పి వారల ననిపె నాబ్రహ్మ.

దేవకీ వసుదేవుల కారాగృహవాసము

యదుకులసంజాతుఁ డమలవర్తనుఁడు
మధురవాసమ్ముగా మహనీయరీతి
ధారుణిఁ బాలించు శూరసేనునికి
వసుదేవుఁ డుదయించె భవ్యసద్గుణుఁడు.
ఉగ్రసేనుని సుతుఁ డుగ్రవర్తనుఁడు
కంసుఁడు దుష్టుఁడున్ కఠినాత్ముఁడగుచు
మధురాపురిని గెల్చి మహి నేలుచుండె.
కంసుని చెల్లెలు కమనీయగాత్రి
దేవకి వసుదేవు దేవేరి యయ్యె.
ఓకనాఁడు మధురకు నుల్లాస మొదవ

మఱుదినిని చెల్లెలిన్ అరదమ్ము మీద
కంసుండు కొనిపోవు కాలమ్ము నందు
వినవచ్చె నొక వాణి వినువీథినుండి
"కంసుడా! దేవకిగర్భానఁ బుట్టు
అష్టమసుతుఁడు నిన్ హతమార్చు" ననుచు
కంసుఁ డామాటకు కడు వెఱగంది
కత్తి చేఁబూని యాకాంత దేవకిని
చంపనుంకింప నాక్షణమందె నచట
వసుదేవుఁ డడ్డమైవచ్చి కంసునికి
"భయమేల కంస ! యీవాక్యాల కిట్లు
నిజమౌనె ధరణి నీ నినదమ్ము లెల్ల?
చిన్నారి యీతన్వి చెల్లెలు నీకు
చీరలు మాడలు కోరిన విచ్చి
యాదరింతురుగాని యభిమానముంచి
చానల నెందైన చంపుదు రయ్య ?
భయమేని నీకు నావచనమ్ము వినుము
దేవకి శిశువులన్ తెచ్చి నీకడకు
ఇచ్చెద నీచేతి కేమిచేసినను
కరుణించి విడువు మీతరుణి ననంగ
కంసుఁ డింటికి బోయి కారవాసమున
బంధించి దేవకిన్ వసుదేవుతోడ
కఠినులౌ భృత్యులఁ గాపుంచె నచట

వరుసగా నార్గురు పసిపిసుంగులను
పుట్టినక్షణమె యాపొలఁతి దేవకికి
కఠినాత్ముఁడై చంపె కంసుండు వచ్చి
తల్లిదండ్రులమదుల్ తల్లడిల్లంగ.
ఇంతికి పొడసూప నేడవచూలు
వెడలించి శిశువును వ్రేపల్లెయందు
వసుదేవుని మొదటిభార్యయై యున్న
రోహిణిగర్భాన రూఢిగానుంచి
యోగమాయయు చనె నుడువీథికెగసి.
ఆబిడ్డయే భువి నసమానశౌర్య
బాహుబలాఢ్యుఁడు బలరాముఁ డయ్యె
ఏడవశిశువును చూడంగ లేక
దేవకిగర్భమ్ము దిగెనంచుఁ దలఁచి
కావలివాండ్రెల్ల గమనించుచుండి
రష్టమశిశువున కాసక్తి తోడ.

## శ్రీకృష్ణ జననము

ధరణీతలమ్మున తరుణి దేవకికి
హరియుద్భవమ్మందు తరుణమ్ము వచ్చె
జగతియందత్యంత సంతోష మొదవ
పంచభూతమ్ములు భాసిల్లఁ దొడఁగె
కాంతిమంతమ్మైన గగనమ్మునందు

శోభిల్లె గ్రహరాజి శుభవీక్షణముల
శ్రావణ బహుళాష్టమీ విద్యుద్విమల
రోహిణీతారయు రుచిరమై వెలిఁగె.
ఆనాఁటి నడిరేయి హరియుదయించె

కన్నులవెలుగుగా కన్నవారికిని
నాల్గుచేతులవేల్పు నగుమోముతోల్పు
మేలిపట్టులవాఁడు నీలవర్ణుఁడు
శంఖచక్రగదాబ్జ సంయుతుఁడతఁడు
విష్ణువే జనియించె బిడ్డడై యనుచు
పొగడిముద్దాడి రాపుణ్యదంపతులు
బాలుని దేవకీ వసుదేవు లరసి
తనతల్లియుం దండ్రి కనుచుండగాన
మఱపించి వారిని మాయలో ముంచి
దివ్యరూపము వీడి దేవకి యొడిని
అనుఁగుబిడ్డండయి యలరె నాశిశువు
అనతి దూరమ్మున నాక్షణమందె
గోపకుల్ నివసించు వ్రేపల్లె యందు
సుందరాంగి యశోద నందునిభార్య
కుదయించె నుర్విపై యోగమాయయును.

ధారుణి గంభీరతంద్రతన్ మునిగె
ఘననిద్రమునిఁగిరి కావలివాండ్రు

తాళముల్ విడివడె తలుపులు విడెను
భగవదనుజ్ఞగా వసుదేవుఁ డెటేఁగి
శిశువును పైకెత్తి శిరమునఁ దాల్చి
దయతోడ యమునయు దారినీయంగ
వేగమ్ముగా దాటి వ్రేపల్లె కరిగి
ఒడలెఱుంగక యున్న యువిద యశోద
ప్రక్కలో బాలుని చక్కగా నుంచి
యోగమాయను దెచ్చి యొసగె దేవకికి.
తలుపులు బిగిసెను తాళముల్ పడియె
యెలుగెత్తి కెవ్వున నేడ్చె నాశిశువు.
గట్టిగా నఱచిరి కావలివాండ్రు
కనియె నష్టమసుతున్ కాంత యటంచు.
క్షణములోనచటికి కంసుండు వచ్చి
బలిమి నాశిశువును బయటకు లాగి
ఖడ్గమ్ము పైకెత్తి ఖండింపఁ బోవ
చోద్యమై కంసుఁడు చూచుచుండగనె
కదలి యాకంసుని కరములందుండి
బిడ్డతనంతట వినువీథి కెగసి
"కలుషాత్మ కంస ! నిన్ కడతేర్చు శిశువు
పెరుగుచునుండెను వేఱుగా" ననుచు
అభ్రవీథి నదృశ్యమయ్యె నాక్షణమె.
కంసుని కొడలెల్ల గడగడ వణకె

మరణమే తనవెంట తఱుముచున్నట్లు
కారాగృహమ్మున కంసుఁడు వేగ
దేవకిన్ భర్తతో తిరిగి బంధించి
మంత్రులన్ బిలిపించి మంతనంబుండి
తనచేతిశిశు వట్లు వినువీథి కెగసి
పలికినమాటలు వచియించి వగచి
అంతకంతకు రోష మతిశయింపంగ
తనకురాగల మృతిం దప్పింప నెంచి
శిశువు లెందున్నను దిశలందు వెదకి
చంపుఁడంచును తీవ్రశాసన మ్మిచ్చె.

శ్రీకృష్ణుని బాల్యక్రీడలు

మన యశోదకు చిన్నమగవాడు పుట్టె
కడుముద్దుబిడ్డఁడు కట్టివాఁ డనుచు
గోపిక లెల్లరు వ్రేపల్లెయందు
నొనరించి రింపుగా నుత్సవమ్ములను.
తనసుతున్ రోహిణీతనయునిఁ గూడ
బలరామకృష్ణుల పరమాదరమున
సంరక్షణ మొసర్చి సకలవిధాల
పెంచుచుండె యశోద ప్రేమ పెంపార.

పూతన వధ

కంసుపంపున నొక గడ్డురాకాసి
పూతన సొగసైన పొలఁతిగా వచ్చి

తొట్టిలోనున్నట్టి చిట్టిపాపండు
కృష్ణుని పైకెత్తి ప్రేమ నటించి
విసపుచన్నిచ్చి యానిసుంగును చంప
యత్నించునంతలో నాకృష్ణుఁ డెఱిగి
మూపునపూతన మోయగాలేని
బరువయి యామెను పడగొట్టి అమ్మ
బడబడ బాదుచు ప్రాణముల్ తీసె.
తననిజరూపమున్ దాల్చి ధారుణిని
తాటిచెట్టంతటి తనువుతో కూలి
పడియున్న పూతనన్ పౌరులు చూచి
పోయె నాపద చాలు పుణ్య మటంచు
దృష్టినితీసి రాకృష్ణున కపుడు.

గోపికలెల్లరు కూర్మిమై వచ్చి
మురిపెమ్ము జూపించి ముద్దులాడంగ
నడకల నేరిచి నవ్వుల నేర్చి
పలుకుల నేరిచి పాటల నేర్చి
ఆటల నేరిచి అల్లరి నేర్చి
దినదిన మొకక్రొత్త తేజముతోడ
పెరుగుచు కృష్ణుఁడు పెద్దవాడయ్యె
కృష్ణుఁ డేగని యిల్లు వ్రేపల్లె లేదు
శ్రీకృష్ణునల్లరి చెయిదమ్ము లరసి
ముద్దమున వ్రేపల్లె మురిసిపోయినది.

అంతకంతకు కృష్ణు నల్లరిపనులు
వ్రేపల్లెవారికి విసువు పుట్టించె
వత్సమ్ములను విప్పి పాలను త్రావు
పగులగొట్టును వచ్చి పాలకుండలను
వెన్నలు దొంగిలి పిల్లల కిచ్చి
వానరమ్ముల కిడి తా నింత దినుచు
తల్లిని బిడ్డకు తంపులు పెట్టు
కోడలి కత్తకుఁ గూర్పు కయ్యములు.
మగ డావలకు నేగ మగువల ప్రక్క
చేరి పరుండును చెలిమి చేయుచును;
లీలగా కేళిగా బాలకృష్ణునకు
ఆనందమయ్యె నీయల్లరియెల్ల
భయపెట్టెచూచిన బయట కంపినను
ఆపకు కృష్ణుఁ డాయల్లరిపనులు
వ్రేపల్లె గోపికల్ విసువెత్తి తుదకు
కినుకతో నందుని గృహమున కేగి
"ఓయమ్మ మాయమ్మ ఓయశోదమ్మ
మేమింక పడలేము మీబిడ్డ పనులు
చెప్పనట్టివి కావు చెప్పగా లేము
గట్టిగా కృష్ణుని కట్టడిబెట్టి
బుద్ధిచెప్పవ యేని పోయెదమమ్మ

నోయూరికైన మేమెల్లర "మనగ
"ఎఱుఁగడు మాయలు చిఱుతవాడితఁడు
ఎవరేమిచేసిరో యీతడు కాదు
నేరముల్ నుడివెద రూరకే మీరు
మాబిడ్డననకుఁడు మంచివాఁడ"నుచు
బ్రతిమాలి వారిని పంపి యశోద
చిన్నికృష్ణుని లేతచిబుకముల్ బుడికె.

మద్దిచెట్లు

తనకు పాలిచ్చుచు తల్లి యశోద
పనిమీద పోవగా బయట కొకింత
పాలకుండల నెల్ల బ్రద్దలు గొట్టి
వెన్నముద్దలు కోతిపిల్లల కిడుచు
నిల్లెల్ల శ్రీకృష్ణు డల్లరి చేయ
తల్లిచూచి యిదేల తనయ ! నీకనుచు
పట్టబోవ నతండు పరువులు బెట్టె
అడుగులు తడబడ నడుము వడంక
జారెడు సిగపూలు జలజల రాల
ఆతని వెనుకనే యరిగి యశోద
మానులు పట్టగా లేని మాధవుని
చిన్నారికృష్ణు నా వెన్నలదొంగ
నెట్లెట్టులో పట్టి కట్టె రోలునకు

ఊరిలోపోరైన తీరునటంచు
తల్లిలోనికిఁ బోవ నల్లన లేచి
లీలగాఁ గృష్ణుండు రోలు నీడ్చుచును
బయటకుఁ గొనిపోయి వాకిట నున్న
మద్దిచెట్లకు దాపి మధ్యగా లాగ
ఫెళ్ళునవిఱిగి యావృక్షముల్ రెండు
ఉరుము లురిమినట్లు ఊర్విపైఁగూలె.
ఇరువురు యక్షు లాతరువులందుండి
వచ్చి మ్రొక్కులుపెట్టి బాలకృష్ణునకు
శాపవిముక్తులై చని రింతలోనె
ఆశబ్ద మాలించి యంద రేతెంచి
బాలు లేవమ్మ యీరోలుఁగట్టుదురె
పడలేదు నయ మిది బాలుపై ననుచు
దృష్టినిదీయించి కృష్ణు మూర్కొనిరి.

## విశ్వరూపము

బలరామకృష్ణు లాబాలురిద్దఱును
పెరిగి యొక్కింతగా పెద్దవారైరి.
ఇద్దఱు జంటగా నేగు చెల్లపుడు
ఆరుదెంతు రింటికి నాటల నాడి
బలరాముఁ డొకనాఁడు పరుగున వచ్చి
తల్లియశోదను త్వరగ రాఁ బిలిచి

"ఎన్ని చెప్పినగూడ విన్నాడు కాదు
మన్నుఁ దిన్నాడమ్మ చిన్నికృష్ణయ్య"
యని చెప్పునంతలో "తినలే"దటంచు
పరువున వెనుకనే వచ్చి కృష్ణుండు
చూడుమమ్మైనచో చూడు మటంచు
తల్లికిఁ జూపగా తననోరు తెఱచి
పరమాద్భుతమ్మయి వెలుగొందె నామె
తాను గోగోపికల్ ధరణి సర్వమ్ము
బ్రహ్మండమెల్ల ఆబాలుని నోట
వెలయుచుండుట గని విభ్రాంతి నొంది
"కలయొ యీమాయయో కాక యిదేమి
బాలకుం డెంత యీ బాలుని నోట
బ్రహ్మండమంతయు పరమాద్భుతముగ
వెలయుచుండె నితండు విష్ణువే యనుచు
తలఁచి సన్నుతిఁ జేయు తల్లియశోద
యొడిలోన దూకెను బుడుతకృష్ణుఁడు
ఏమియు తానెద నెరుఁగని యట్లు
తనయుని ముద్దాడి తల్లియశోద
మరల నీసంసారమాయలో మునిగె.
పరమఋషీంద్రులున్ భావింపలేని
విష్ణుని మహనీయ విశ్వరూపమ్ము
కనులపండువుగాగ కాంచి యశోద

ధన్యురాలయ్యెను తల్లియై వారికి.

కృష్ణుఁడు మరల తానెప్పటియట్లు
బలరాముతో గోపబాలురతోడ
గోవత్సములతోడ గోవులతోడ
అడవులఁ దిరుగుచు నాటలాడుచును
నోరూరగా చల్ది లారగించుచును
వన నదీతీరాల వన్య శాద్వలుల
గిరిదరీ కుహారాల క్రీడించుచుండె.

కంసుఁడు రాక్షసుల నంపుట

వ్రేపల్లెయందున బెరుగుచు నున్న
కృష్ణుని యద్భుతకృత్యము లెల్ల
ఆనోట నానోట నంతటఁ బ్రాకె
కంసుఁ డాలించి యాకథల నన్నిటిని
కృష్ణుఁడే తనపాలి మృత్యు వటంచు
బాలకృష్ణుని బట్టి పరిమార్చు టొకటె
తనకు శ్రేయముగాగ తలఁచి చిత్తమున
తనభృత్యులై యున్న దైత్యవర్గమును
తగురీతి బోధించి వారిని జెప్పి
పంపెను వరుసగా బాలుని పైకి.

శ్రీకృష్ణుఁ డెప్పటి రీతిగా వనుల
గోగోపకులతోడ కూడియుండంగ

అటనట డాగుచు నతిరహస్యముగ
బాలకృష్ణుని బట్టి వధియించుకొఱకు
వచ్చి రాదైత్యులు వారొక్క రొకరె.
వచ్చినవారిని వచ్చిన క్షణమె
యేచి యుక్కడగించె కృష్ణుఁ డొక్కండె.
భాసురలీలగా బలదర్ప మెసఁగ.
బకరూపమున వచ్చె నొకబకాసురుడు
ముక్కుఁజీల్చుచు కృష్ణుఁ డుక్కణఁగించె.
ధేనువై యరుదెంచె ధేనుకాసురుఁడు
గొంతుక నులిపెట్టి కుంభినిఁ గూల్చె
శకటాకృతిని వచ్చె శకటాసురుండు
కాలితోఁ దన్ని ముక్కలుగాఁగఁ జేసె
వృత్రుఁడు సుడిగాలి వీచుచు రాగ
పిడికిట బంధించి పీనుంగుఁ జేసె.
ఆ బలశక్తుల కద్భుత మ్మంది
రాక్షసతతినుండి రక్షించె మమ్ము
కృష్ణుడటంచును కీర్తనల్ సలిపి
ప్రమద మందిరి గోపబాలకు లెల్ల.

### నందాది గోపకులు బృందక రుగుట

దైత్యు లీరీతిగా దౌష్ట్యముల్ సలిపి
బాలకృష్ణుని పైకి వచ్చుచుండుటయు

తెలియనివమాయగా దీనికి తోడు
వ్రేపల్లెలో కడువిపరీత మగుచు
ఉత్పాతములు పుట్టుచుండుట చూచి
నందుఁ డాదిగ పెద్ద లందఱుఁ గూడి
గోవత్సములతోడ గోవులతోడ
తమనివాసము లెల్ల తరలించి వేగ
వెడలిరి బృందకు వ్రేపల్లె వీడి.
బృందావన మ్మొకసుందరసీమ
పచ్చికబయళులు పచ్చని చెట్లు
యమునా నదీతీర విమలోదకములు
ఇసుకతిన్నెలు నవ్యకుసుమకుంజములు
మెల్ల మెల్లనవీచు మృదుసమీరములు
గో గోపకులకది కోటిస్వర్గాలు.

### శ్రీకృష్ణుని మురళీగానము

మోహనమూర్తి యాముద్దుకృష్ణునకు
కరములందుండును మురళి యెల్లపుడు
గోగోపకులగూడి కోమల వనుల
నాడుచు శ్రీకృష్ణుఁ డతిసుందరముగ
కాలిపైఁ గాలూని లీలగా నిలచి
వంశమ్ము పూరింప వనమెల్ల నిండి
తీయనిపాటలు తేనెలు గురియు

ముద్దుకృష్ణునివంశి మ్రోగిన యంత
గానమాధురు లందు లీనమైనట్లు
గనుపించుచుండు నా కాననమ్మెల్ల
పశుపులు దరిజేరు పక్షులు వినను
చల్లనిగాలులు మెల్లగా వీచు
పూవులు వికసించి తావులఁ జిమ్మ
తమ స్నేహితునిపాట తమితోడ వినుచు
పరవశు లగుదురు బాలు రెల్లరను.

### అఘాసుర వత్సాసురులు

బలరామకృష్ణుల పయిని కంసునకు
పగతీర కింకను పంపుచు నుండె
దుష్టుల వారిని దునుమాడుకొఱకు
వనములం దొకనాఁడు వటతరుచ్ఛాయకు
గోపకులొక్కెడ కూడియుండంగ
అరుదెంచి చిలువయై యట కఘాసురుఁడు
కబళించె నందఱిన్ కాయమ్ము పెంచి
వారితోఁ బాటుగ బాలకృష్ణుండు
మ్రింగుడువోయి యామేటిపామునకు
పాముశరీరము పట్టనియట్లు
పెరిగి పర్వతమంత పెనుబాముఁ జీల్చి
బయటకుఁ గొనివచ్చె బాలు రందరిని

వత్సమై యొకనాఁడు వత్సాసురుండు
గోవులందుఁ జేరి కొమ్ములఁ జిమ్మి
చిందరవందర చేయుచునుండ
ఆదుష్టచేష్టల నరసి వేవేగ
రెండుకొమ్ములఁ బట్టి పృథివిపైఁ గొట్టి
వధియించెఁ గృష్ణుండు వాని నచ్చటనె.

ప్రలంబుఁడు

గోపకుల్ జట్లుగాఁ గూడి వేడుకగ
యమునయొడ్డునఁ జేరి యాడుచుండఁగ
అచ్చోటికి ప్రలంబుఁ డనెడు రాక్షసుఁడు
బాలుఁడై యాటలో పాల్గొనవచ్చి
బలరాము బుజముల పైనెక్కి పెద్ద
బరువుగా నగుచును బాధించు చుండ
బలరాముఁడును వాని వంచన నెఱిఁగి
ఒక గ్రుద్దుతో వాని యుక్కడగించె.

బ్రహ్మ శ్రీకృష్ణుని శక్తి పరీక్షించుట

శ్రీకృష్ణు నద్భుతచేష్ట లాలించి
కృష్ణునిశక్తి బరీక్షింపఁ గోరి
ఆకస్మికమ్ముగ నబ్జభవుండు
దరిని కృష్ణుఁడు లేని తరుణమ్ముఁ జూచి

గుప్తమ్ముగా దాచె గోగోపకులను
వత్సముల్ గోవులు బాలకులెల్ల
రింతలో వీరండ లేమయి రనుచు
శ్రీకృష్ణుఁ డాత్మలోఁ జింతించి మిగుల
తోచకేమియు మది యోచించి తుదకు
ఇదియెల్ల చతురాస్యకృత్యమం చెఱిఁగి,
"వత్సమ్ములనుదాచి బాలుర దాచి
వంచింపఁ బనిలేదు బ్రహ్మ" కటంచు
బ్రహ్మకు చక్కని పాఠమ్ము నేర్ప
తక్షణమ్మే మాత్ర తానెసర్వముగ
బాలురు గోవులు వత్సమ్ములగుచు
బహురూపములుదాల్చి బాలకృష్ణుండె
ఎవరెట్టులుందురో యవని నారీతి
అట్టులే తానుండి యన్ని వేళలను
గడపెను వత్సరకాలమ్ము నంత
దీనుఁడై బ్రహ్మయు దిగివచ్చి భువికి
యొగ్గుఁ జేసితినంచు కృష్ణుని వేడి
వెడలెను గోగోపబృందమ్ము వీడి.

కాళీయమర్దనము

అడవియం దొక్కనాఁ డాటలనాడి
దాహమై గోపకుల్ దాపున నున్న

కాళియమడుగులోఁ గల నీరుఁ ద్రావి
యసువులు విడచి రావిసపునీటికిని
కాళియుఁ డనియెడు ఘనసర్ప మొకఁటి
తనభార్యలనుఁగూడి దర్పమ్ము మీఱ
కాపురమ్ముండె నాకాసారమందు
తానెరాజుగ మదితలపోసికొనుచు;
కలుష మొనర్చె నాజలముల నాతఁ
డచటికి రాకుండ నన్యులెవ్వరును.

శ్రీకృష్ణుఁ డిదియెల్ల చిత్తాననెఱిఁగి
బాలకు లందఱి బ్రతికించి మరల
కాళియనాగుని గర్వమడంప
నడుమును బిగగట్టి మడుగులో దూఁకె
గుభిలుగుభిల్లున గుండముల్ తిరిగి
కొండయెత్తున లేచె కొలనిలో జలము.
మనుజుఁ డొక్కఁడు తనమడుగులోనికిని
దూఁకెను తనయాజ్ఞ లేకుండ ననుచు
కాళియసర్పము ఖస్సున లేచి
కృష్ణుని మెడబట్టి యీడ్చె లోపలకు
ఊరివారెల్లరు చేరి యచ్చటకు
కృష్ణునిగానక నెల్లెడ వెదకి
కాటేసి మ్రింగెను కాళియుఁ డనుచు

విలపింపసాగిరి కొలను తీరమున
శ్రీకృష్ణు డంతట చేతులతోడ
కాళీయుపడగలు గట్టిగ బట్టి
వేగమ్మె బయటకు వెలువడివచ్చి
కాళియఫణి ఫణాజాలమ్ము మీద
కేళీవినోదుఁడై లీలగా నిలచె
చూచువా రెల్లరు చోద్యమందంగ.
భీకరాకృతితోడ విషము లు గ్రక్కు
గాళియుం గనుగొని కంపమ్ము నంది
నందాదు లడలిరి డెందమ్ము లందు
నిర్భయుం డయి పాము నెత్తిపై నిలచి
శ్రీకృష్ణుఁ డొక్కింత నృత్యమ్ము సలిపి
పడగలు చితుకంగ పడపడఁ ద్రొక్కి
పటుశక్తియుత వేగ పదతాడనముల
బలమెల్ల నశియించి ప్రాభవమ్మెడలి
యుక్కిరిబిక్కిరై యుగ్రసర్పమ్ము
నెత్తురుల్ గ్రక్కుచు నీటిలోఁ బడియె
కాళియు భార్యలు కడుదీన లగుచు
కృష్ణునిఁ బ్రార్థింప కృష్ణుఁ డాలించి
"మడుగును విడనాడి కడలిలోపలకు
పొలతులతోఁగూడి పొమ్ము నీ"వనుచు
కరుణాంతరంగుఁడై కాళియున్ విడచె.

కార్చిచ్చు

క్రమ్మరుచుండగా గోపబాలకులు
కానలో నొకనాఁడు కార్చిచ్చు రేగి
చుట్టుముట్టగ వారు చూచిభీతిల్లి
కృష్ణ కృష్ణాయని కెవ్వన నేడ్వ
భయము లేదనివచ్చి బాలకృష్ణుఁడు
ధైర్యమ్ముతో నేగి దావానలమ్ము
నణచెను చూపరు లద్భుతమ్మంద.
శ్రీకృష్ణు సాహసకృత్యమ్ము లరసి
మమ్ము రక్షింపగా మహి నున్నయట్టి
కేవలదైవమీ కృష్ణుఁ డటంచు
బృందావననివాసు లెల్లరు గూడ
భావింపసాగిరి భక్తి మీఱంగ.

శ్రీకృష్ణుని వేణుగానము – గోపికలు

బృందావనమ్మున వెన్నెలరేల
యమునాతటమ్మున కరిగి కృష్ణుండు
మురళి మ్రోయింపగా ధరణినెల్లెడల
తీయమల్ విరియును తేనెలు గురియు
నల్లనికృష్ణుండు నగుమోమువాఁడు
లీల త్రిభంగిగా కాలూని నిలచి
గానకళాపూర్ణ కమనీయవిభవ
విలసితమూర్తియై యలరారు వేళ

ఎంతమాధుర్య మాకృష్ణునిపాట
ఎంతలావణ్య మా కృష్ణునిరూపు
ఆరూపమందున్న అందమ్మె వేఱు
ఆపాటయందున్న తీపియే వేఱు
మృదులాధరమ్ముపై కదలి యుప్పొంగి
సన్నసన్నగసాగి షడ్జము ధ్వనిని
ప్రవహించు మోహాన వంశీరవమ్ము
యమునానదీ తరంగాలోల మగుచు
మలయానిలమ్ముల మెలఁగి మలంగి
ఎచట మార్మ్రోగునో యెచటికేగెడినో
ఏగుండె సందునో యెందు పర్విడునో
ఆపాట వినినంత గోపికాంగనలు
జారెడుసిగలతో జారుపయ్యెదల
జలజలరాలెడు తలపూలతోడ
సదమల సత్ప్రేమ హృదయులై వేగ
పరువిడి వత్తు రా మురళీవినోదు
పాదాలచెంతనే పడియుండు కొఱకు.
కోమలహృదయ లాగోపకాంతలకు
అఖిలగుణాతీత మానందరాశి
జ్ఞానరసార్ణవ మా నవ్యవాణి
కోటివీణలపైని కోటితీగలుగ
మురళియై విశ్వమ్ము మ్రోగిన యటుల

కృష్ణుఁడే సర్వమై హృదయమ్ము లందు
లీనమైపోవు రాగానమ్ము లోన.

సకలచరాచర సంతతిన్ కదపి
కరఁగించు రమణీయ మురళీరవమ్ము
శ్రీకృష్ణుపెదవుల చిందిన మధువు
ప్రేమ పొంగులువారు కృష్ణభావమ్ము
విశ్వదర్శన మది విశ్వగానమ్ము
విశ్వకల్యాణైక విమలజీవనము.
ఆది యంతము లేని యధ్యాత్మవిభవ
చింతనామృతపాన చిత్తులు వారు;
గానరసామృత జ్ఞానార వింద
విశ్వమోహన దివ్యవిగ్రహుం డతఁడు,
తద్రసాస్వాదన ధ్యానానురక్తి
మరగి మత్తిల్లిన మధుపముల్ వారు
దీపితప్రేమసుల్ గోపికాంగనలు.

### గోపికావస్త్రాపహరణము

గోపిక లొకనాఁడు కోరిక మీఱ
మఱుజన్మమం దైన పరమాత్ము దయను
భర్తగా కృష్ణునే పడయుట కొఱకు
వ్రతము సల్పుచు తమవస్త్రముల్ విడచి.
యమునానదిని స్నానమాడుచు నుండ

కృష్ణుఁ డావస్త్రమ్ము లెల్లను దాచి
మురళి మ్రోయించు చేమెఱుఁగనియటుల
చెట్టుపై కూర్చుండి చిరునవ్వు చుండె.
శ్రీకృష్ణు నల్లరి చెయిదమ్ము నరసి
బయటకురా లేక పలుకంగ లేక
సిగ్గున గోపికల్ శిరములు వాల్చి
చేతులు గుండెలఁ జేర్చి మ్రొక్కుచును
"తగదు నీకీపని తగదు శ్రీకృష్ణ
మామానముం గాచి మమ్ము రక్షించి
మాచీర లి"మ్మని మఱిమఱి వేడ,
"వ్రతముసల్పెడు వేళ వాహినియందు
నగ్నమ్ముగా మీరు స్నానమ్ము లేల
బయటకు వచ్చి మీవస్త్రముల్ గొనుడు
మీవాడనే" యని మేలమ్ము లాడి
వసనముల్ క్రిందికి విసరె కృష్ణుండు
ఆ గోపకాంతల యాత్మలం దపుడు
కృష్ణుఁడే దైవమ్ము కృష్ణుఁడే వారు
స్త్రీపుమాకృతుల కతీతమై వెలుగు
పరమాత్మ చింతనా పరతంత్ర లగుచు
మనసులు నిండిన మధురప్రేమమున
తనువులు మఱచుచు ధరణినే మఱచి
వస్త్రముల్ గొనుటకు బయటకు వచ్చి

గోపవనితంబినుల్ కూర్మిలింపార
ఎడనెడ వెదకి రా కృష్ణునికొఱకు
బాలకృష్ణుఁడు లేడు వంశియు లేదు
కనుపింపఁ డెందును కనుచూపుమేఱ.

బ్రాహ్మణస్త్రీలు

యమునాతటమునందు యజ్ఞమొకండు
విప్రులొనర్చి రా విప్రులసతులు
నిర్మలప్రేమతో నిష్కామనియతి
శ్రీకృష్ణునే తమహృదయమ్ములందు
నిలుపుచు పూజలు సలుపు చుటెంగి
గోపబాలురఁగూడి కూర్మితో నటకు
శ్రీకృష్ణుఁ డేగి సంతృప్తితోఁ దనకు
వారలిచ్చిన యన్నపానముల్ గుడిచి
వారిభక్తికి మెచ్చి వారికెల్లరకు
సద్గతుల్ కలిగించె సత్కృపతోడ.

నందాదులను రక్షించుట

నందుండు యమునలో స్నానమ్ము చేయ
నడుగగా నొక్కనాఁ డాప్తులఁ గూడి
వరుణభృత్యుఁ డొకండు బలిమిమై బట్టి
బంధించె నందు నావాహినియందు,

కృష్ణుఁ డీవృత్తాంత మెఱిఁగి వేగమ్మె
వినయుఁడై వరుణుని కనుఁగొని వేడి
నందుని విడిపించి బృందకు వచ్చె,

విద్యాధరుఁ డొకండు పెనుబిల్వ యగుచు
బాటలో నందునిఁ బట్టనుంకింప
వాని కా సర్పరూపమ్మునుఁ బాపి
నందుని విడిపించి బృందకుఁ బంపె.

వరిష్టాసురుఁడు

శ్రీకృష్ణు నెట్లైన చేరి వధింప
కంసునిపంపున కడువేగ వచ్చి
ఆబోతుగా నరిష్టాసురుం డొకఁడు
బృందావనమ్మున చిందులు ద్రొక్కి
సకలసంక్షోభమ్ము సలుపుచునుండ
వానికొమ్ములు బట్టి పడగొట్టి త్రొక్కి
పిడికిటిపోటుతో పొడిచి కృష్ణుండు
చంపె నాదైత్యుని సాహసమ్మెసఁగ.

శంఖచూడుడు

గోపికల్ కొందఱు కూడియుండంగ
బీరమ్మున కుబేరభృత్యుఁ డొకండు
శంఖచూడుఁడు గోపసతులనుబట్టి

కొనిపోవుచుండగా వెనుకనే యేగి
పటుశక్తితో బాహుబంధమ్ములందు
శంఖచూడుని బట్టి చావంగ మోది
వానివద్దగలట్టి మానితమణిని
కానుకగాఁ గొనివచ్చి కడుప్రీతితోడ
బలరామున కొసంగె బాలకృష్ణుండు.

గోవర్ధనము

వానలు గురియించి పాడిపంటలను
ధరణికొసంగెడు దైవమ్మటంచు
ఏటేట పూజల నింద్రదేవునకు
గొల్లవారొనరింతు రుల్లాస మెసఁగ
అట్టులే నందాదు లాయేడుగూడ
యత్నింపగాఁ గృష్ణుఁ డాతంక పఱచి
ప్రకృతిసిద్ధమ్ము లీవర్షసంపదలు
దేవేంద్రుఘనత యిం దావంత లేదు
ప్రకృతిరూపమ్ములె పరమదైవములు
మనప్రక్కనున్నట్టి మహితదైవమ్ము
గోవర్ధనాద్రిని కుతుక మింపార
అర్చింత మందఱు నరుదేరుఁ డనుచు
నట కేగి కృష్ణుఁ డాయద్రిపై నిలచె.
నందాదులేగి యా నగమున కెఱఁగి

పూజ లర్పింప నాపురుషహూతు మఱచి
ఇంద్రుఁడు కోపించి యేడుదినాలు
బృందను గురియించె పెనురాళ్లవాన
నిలుచుట కొకయింత స్థలమైన లేక
ఆయూరి వారెల్ల రల్లాడుచుండ
ఏడేండ్లబాలుఁడు కృష్ణుఁ డాగిరిని
ఒకచేతితో నెత్తి యూరివారలను
గోవత్సములతోడ గోవులతోడ
రప్పించి గిరిక్రింద రక్షణ నొసఁగె.
గర్వభంగ మ్మంది గడగడ వణకి
కృష్ణుని కడకేగి కేల్మోడ్చి మ్రొక్కి
వానలు మాన్పించి వాసవుఁ డరిగె
కృష్ణునిమహిమను కీర్తించి రెలమి
బృందావననివాసు లందఱుఁ జేరి.

## రాసలీలలు

అది శరత్కాల మా మృదులకౌముదులు
బృందావనికి క్రొత్తయందమ్ము తెచ్చె
ఏమూలనుండియో కృష్ణునిమురళి
మ్రోయుచున్నది విశ్వమోహనగీతి
ఒక్కఁడే కృష్ణుండు, ఒక్కటే మురళి
మురళీరవ మ్మేగి మూలమూలలకు

బృందావనమ్మునం దింటింటిలోన
కోటిగుండెలయందు కోటిరాగముల
వర్షించె నిర్మల ప్రణయామృతమ్ము.

ఒకప్రక్క వెన్నెల లుఱికివెట్టుచుండ
మురళి పిల్చుచునుండె మఱియొకప్రక్క
పరవశమ్మున గొల్లపడుచు లెల్లరును
తమభర్తలను వీడి తనయుల వీడి
తమగృహమ్ములు వీడి తనువులు మఱచి
యెచటనుండెను కృష్ణుఁ డెచ్చట ననుచు
చీరజారి యొకర్తె సిగజారి యొకతె
తడబాటువడి కోకముడిజారి యొకతె
యమునానదీతీర విమలసీమలను
మురళి నూదుచునున్న మోహనమూర్తి
చిన్నారికృష్ణుని చేరి రందఱును.
ఆనాఁడు కృష్ణునియందమే వేఱు
ఆనాఁడు కృష్ణునిగానమే వేఱు
విశ్వాత్మకుఁ డతండు విశ్వప్రియుండు
అందఱి యెదలయం దన్నికృష్ణులుగ
కనుపించె నప్పు డాకన్నయ్య యొకఁడె
కృష్ణుని కౌగిలి కత్తి ముద్దాడి
ఒకరొక్కరే వచ్చి యొయ్యారమొలుక

వారుగా కృష్ణుండు, వారె కృష్ణుఁడుగ
తమిమీఱి గోపికల్ తన్మయులైరి.

మురళీవినోదుఁ డామోహనమూర్తి
సురుచిరాకారుఁ డాశోభనమూర్తి
చల్లని నవ్వుల నల్లని వాఁడు
ఒక్కొక్క గోపిక కొక్కకృష్ణుఁ డగుచు
మధ్యగా వారికి మరల తానొకఁడై
వేఱొక కృష్ణుఁడై వేణు వూదుచును
కరము కరమ్మునఁ గలిపి యందముగ
పద్మమ్మువలె గూడి వర్తులాకృతిని
రాసలీలలసల్పి భాసమానముగ
గోపకిశోరుఁ డా గోపకామినుల
జతగూడి దరిజేర్చి సరసమాడుచును
అది గానమా కాదు, అది లాస్యమేమొ
అది లాస్యమా కాదు అదిప్రేమ యేమొ.

గానలాస్యకళార్ద్రి కమనీయగతుల
విరిసె బృందావనిన్ ప్రేమామృతములు
గోపికాకృష్ణుల కువలయ మ్మెట్టి
యవధులు లేనట్టి యానంద జలధి
నిష్కామ మయ్యది నిర్వికారమ్ము
పావన పరమాత్మ భావమ్ము లోన

ఆత్మ లీనమ్మైన యనురాగ మద్ది
హృదయమ్ములందున కృష్ణునే నిలిపి
బహిరంతరమ్ముల వసుధ నెల్లెడల
కృష్ణునే చూచుచు కృష్ణునే తలఁచి
తన్మయత్వము నంది తాదాత్మ్య మంది
రమియించి కృష్ణానురాగమ్ము లోన
క్రీడించి క్రీడించి కృష్ణతత్త్వమున
అతులిత మ్మవ్యయ మ్మాధ్యాత్మికమ్ము
ఆనందమయమగు అనుభూతియందు
ఉన్మత్తలై భామ లున్నంతలోన
మాయమయ్యెను వేణుమాధవుం డచట.

### గోపికా విరహము

బాలకృష్ణుఁడు తమప్రాణనాథుండు
రాసలీలాలోల రమణీయమూర్తి
తమప్రక్కనుండెను తమమధ్య నుండె
ఇంతలో శ్రీకృష్ణుఁ డేమయిపోయె
మతిపోయె నట్లయ్యె సతుల కెల్లరకు
చిన్నకృష్ణుఁడు లేని చెలువు నీచమ్ము
బాలకృష్ణుఁడు లేని బ్రతుకు వ్యర్థమ్ము
హృదయేశుఁడైన శ్రీకృష్ణునికొఱకు
విరహాలై గోపికల్ విలపించి తుదకు

వెదకసాగిరి సర్వబృందావనమ్ము

ప్రాణమ్ము ప్రాణమా బాలకృష్ణుండు
కృష్ణుండె మాకిల హృదయేశ్వరుండు
ఎచ్చటడాగినాఁ డెవరు ముచ్చిలిరి.
హృదయానకద్ది మమ్మింతటి దనుక
ఆడించినాడమ్మ పాడించినాడు
చూడవే పున్నాగ చూడవే పొన్న
చూడవే మల్లియా చూడవే తల్లి
రావమ్మ మాధవీ రావె చంపకమ
రావె మందారమా రావమ్మ బృంద
రావమ్మ గోరింట రారె మావెంట
నల్లని వాడమ్మ నగుమోము వాడు
కరుణాంతరంగుఁడు కమలలోచనుఁడు
మా మానములుగొన్న మన్మథుం డతఁడు
పూపుటీరములార పూగుత్తులార
లేదుగా మీచల్వనీడల యందు
కరుణించిచెప్పరే కావరే మమ్ము;
కొమ్మనుగూడెనో కోసెనోపూలు
చూడవే యినివాని జాడలు చెలియ
ఇటుబోయి యటుబోయి యెటుడాగినాడొ
చూడరే కృష్ణుని చూడరే యనుచు

ఆకుఆకున జూచి అడుగడ్గుఁ జూచి
బృందావనమ్మున విరిబాట లెల్ల
వెదకుచు ఖిన్నలై విసిగి వేసారి
మనము పాపుల మింక కనుపడ డతడు
మన మనోనాథుఁడు మనకృష్ణుఁ డనుచు
ఇసుకతిన్నెలఁ జేరి కృష్ణునే కోరి
ప్రార్థించి రాగోపభామిను లంత
చల్లనిగాలులు మెల్లగా వీచె
పూవులతావులు పొలుపుగా వచ్చె
శీతశీకరముల చిందించె యమున
చలువవెన్నెల లల్లె వెలుగుపందిరులు
చెలువమ్ములొలుకు నాశృంగారవనుల
ప్రణయార్ద్రమూర్తు లాపడతు లందరును
కృష్ణునే తలఁచుచు హృదయమ్ములందు
కనుమూసి మమతతో కనువిప్పు లోన
వల్లవీవల్లభుం డుల్లాస మలర
కూర్చుండె నొప్పుగా గోపకిశోరు
డానందమూర్తియై యతివలమధ్య
ప్రేమించువారల హృదయమ్ములందె
కృష్ణుండు నివసించు కృష్ణుండు కలడు.

## కంసవధ

ఆత్మలోఁ గంసుని కనవరతమ్ము
కృష్ణుని తలఁపులే రేయింబవళ్ళు
పంపిన దైత్యులు పంపిన యట్లె
హతులైరి కృష్ణుని హస్తమ్ములందు
మీఁదనే పడినట్లు మిన్నెల్ల విఱిగి
కంసుని హృదయమ్ము కంపించిపోయె
ఇంతలో నారదుం డేతెంచి యటకు
వచియించె కంసుని వద్ద నీరీతి
"నీహస్తములనుండి నింగిపై కెగసి
పలికె యశోదకు కలిగిన శిశువు
నిన్నుఁ జంపెడువారు నిరుపమబలులు
బలరామకృష్ణులు వసుదేవుసుతులు
పెరుగుచునుండిరి సురుచిరాకృతుల
నందగోపునియింట బృందావనాన
వారె సాహసులయి వధియించినారు
నీవుపంపిన దైత్య నివహమ్ము" ననుచు
కంసుఁ డామాట లాకర్ణించి మరల
బలరామకృష్ణుల వధియించు కొఱకు
పంపెను విక్రమప్రాభవులైన
వ్యోమ కేశు లనెడి యుగ్రరాక్షసుల,

బలరామకృష్ణుల బలసమృద్ధికి
మడసిరి వారును మఱునాడె వెడలి.

కృష్ణుని మహిమమ్ము కృష్ణునికీర్తి
అతిశయించు కొలంది యంతకంతకును
కంపమ్ము మెండయ్యె కంసుని మదిని
కృష్ణుఁ డజేయుఁడు పృథివినటన్న
భావమేదియొ కూడ బాధించఁ దొడఁగె.
బలరామకృష్ణుల పరిమార్చుకొఱకు
కలదొక్కటే యూహ కంసునిమదిని
"మంచిమాటలతోడ మధురకుఁ బిలచి
బలరామకృష్ణుల వధియింపవలయు
నంతకన్నను దారి యగుపడలేదు."
మధురానగరియందు మహితోత్సవములు
జరుగుచున్నట్టుల చక్కగ నుడివి
వారినిఁ దోడ్కొని వడిగ రమ్మనుచు
అక్రూరు నట కంపె వరదమ్ము నిచ్చి
అక్రూరుఁ డాత్మలో హరిభక్తిపరుడు
కృష్ణునిమహిమమ్ము నెఱిఁగినవాడు
కంసుని మదియందుఁ గల చెడ్డతలఁపు
వచియించె కృష్ణునివద్దకు నేగి.
తరుణ మేతెంచె నాదురితాత్ముఁ డైన

కంసుని వధియింపఁ గలుగుట కనుచు
బలరామకృష్ణులు పయనమ్మైరి.
ఉత్సవమ్ములఁ జూచు నుత్సాహమొదవ
పాల్వెన్న పెరుగులు బండ్ల కెత్తించి
నందాదులునుగూడ నడచి రావెనుక.

అక్రూరుఁడని యొకండరుదెంచి యిటకు
మధురానగరి కదె మన బాలకృష్ణు
గొనిపోవుచున్నాడు కనుగొంటె రమ్మ
ఎంతటి క్రూరుఁడో యితఁ డికమీద
మధురలో కాంతలు మన బాలకృష్ణు
మరల రానిత్తురే మనవద్ద కనుచు
విలపించి యాగోపలలితాంగులెల్ల
అక్రూరురథ మట నగుపించు వఱకు
వేయికన్నులతోడ వీక్షించినారు.

అక్రూరుఁ డొకచోట నరదమ్ము డిగ్గి
యమునానదిని స్నానమాడుచు నుండ
ఆనదీజలములం దద్భుత మ్మెసఁగ
బలరామకృష్ణుల లలితరూపములు
చూచి యచ్చెరువంది లేచి యాతండు
మరల రథమ్ముపై నరసి వారలనె.

ఇదియేమి చిత్రమం చెడద యోచించి
కృష్ణునే తలచుచు హృదయమ్ము నందు
మరల నానదియందు మగ్నుఁడై నంత
కాంచె నాజలముల కనులపండువుగ
ఫణసహస్రముతోడ భాసిల్లుచున్న
శేషతల్పమునందు శ్రీలక్ష్మిఁగూడి
భక్తులుగావించు ప్రస్తుతుల్ గొనెడు
శంఖ చక్ర గదాబ్జ సంశోభితుండు
శ్రీవత్స కౌస్తుభ శ్రీవైజయంతు
లలరు దేహమువాని శ్యామసుందరుని
ఆవిష్ణురూపమ్ము నక్రూరుఁ డరసి

"శ్రీహరి ! గోవింద శ్రీశ్రీనివాస !
వందనమిదె దేవ! వైకుంఠవాస!
దేవాదిదేవ ఓదివ్యప్రభావ!
సర్వలోకాధార ! సర్వేశ కృష్ణ!
మానివర్యులుగూడ కానంగ లేని
నీదివ్యరూపమ్ము నెమ్మి జూపించి
ధరణిపై నన్నిట ధన్యుఁ జేసితివి
నీలోన నున్న దీ నిఖిలజగమ్ము
నిన్ను వర్ణింపగా నేనెంతవాడ
నీపాదదాసుఁడ నిఖిలేశ" యనుచు

ప్రార్థించి నదినుండి బయటకు వచ్చి
భక్తితో కృష్ణుని పాదాల వ్రాలె
"నేనుచూచిన దెల్ల నీమహాత్మ్యమ్మొ
శ్రీవాసుదేవ యో శ్రీకృష్ణ" యనుచు

మఱునాఁడె చేరిరి మధురకు వారు
లీలగా నచ్చోట బాలకృష్ణుండు
రథముపై చనుచుండ రాజమార్గమున
"నందయశోదల అందాలబిడ్డ
మురళి నూదెడు చిన్నముద్దుకృష్ణుండు
వీఁడటే రాసమ్ము లాడెడువాడు
ఇతఁడటే గోపికాహృదయనాథుండు
ఎంతచక్కని బాలుఁ డీతఁడోయమ్మ
ఎంతపుణ్యాత్మలో బృందలో స్త్రీలు
రారమ్మ చూడరే రారె శీఘ్రముగ
యనుచు నామధురలో నంగనలెల్ల
మేడలనుండియు మిద్దెలనుండి
దృష్టినిసాగిన దన్క కృష్ణునిపైపై
మనసారచూచిరి మధురదృక్కులను

బలరామకృష్ణులు వచ్చినంతటనె
వారినిబంధించి ప్రాణముల్ దీసి

దేవకిన్ భర్తతో దివికిఁ బంపించి
ఉగ్రసేనునిగూడ యుసురులు దీసి
వసుధనెల్లను తానె పాలింతు ననుచు
కంసుండు కనుచుండె కలల నెన్నిటినో.

కంసుని రజకుడు

రామకృష్ణులు బోవు రాజమార్గమున
రజకుఁ డొక్కడు తమరాజువస్త్రములు
కొనియేగుచుండగా తనకొక్క వలువ
నిమ్మని కోరెను కృష్ణు డాతనిని
"రాజవస్త్రములందు రక్తి మీకేల
పశువులమేపెడి పాడికాపులకు
వెన్నలుమెక్కెడి వెఱ్ఱిగొల్లలకు
తగవిట్టి బట్టలు తాల్పంగననుచు
కృష్ణు నారజకుడు కేడించినంత
రయమున కృష్ణుండు రథమును డిగ్గి
రజకుని పరిమార్చి రాజవస్త్రములు
పంచె నచ్చోటనే బాటసారులకు.

కుబ్జ

గంధకల్పమ్ముల కడునేర్పుతోడ
గూర్చు కంసునిదాసి కుబ్జయొకర్తు
రాజమార్గమునందు రమణతో నేగు

కృష్ణుని మెచ్చుచు ప్రేమించి చూచె
కృష్ణుఁ డాకుబ్జపై కృపమీఱ వచ్చి
తనకరస్పర్శచే ననురాగమెసఁగ
ఆమె వికృతరూప మంతయు మాన్పి
అందాలరాశిగా నలరింపఁ జేసె.

## కువలయాపీడము

బలరామకృష్ణులు వచ్చినంతటనె
వారినిద్దఱిఁ బట్టి పరిమార్చుకొఱకు
క్రూరుఁడై కంసుడు గుమ్మమ్ము కడనె
పెట్టెను కువలయాపీడమన్ కరిని.
ఆబాలురను జూచి యామత్తగజము
పాదముల్ ధట్టించి వసుధ కంపింప
పరవళ్ళు ద్రొక్కుచు పైఁబడబోవ
ఉగ్రులై యాబాలు రుర్విపై కురికి
కరిదంతముల నట్టె పెరికి యావలకు
కరితుండమును బట్టి బరబర నీడ్చి
చంపిరి నేలపై చావంగ మోది
వెఱగంది చూడ నాపురజనులచట.

## ధనుర్భంగము

వారలు చనుచున్న దారిలో నున్న
ఆయుధశాలకు నరిగి కృష్ణుండు

పదుగురైనను పట్టి పైకెత్త లేని
కంసునిధనువును కరమున బట్టి
విఱిచె ఫెళ్ళున మబ్బు లురిమినయట్లు
కేలునబట్టి యాకృష్ణుఁ డొక్కండె
చాపమున్ విఱిచిన శబ్దమాలించి
కంపించిపోయెను కంసునిగుండె.

చాణూర ముష్టికులు

బలరామకృష్ణులు పట్టణమ్మునకు
అరుదెంచిరో లేదొ అక్రూరువెంట
కువలయాపీడమ్ము కూలిపోయినది
ధనువు రెండునుఁబోలె తునయలై విఱిగె
కంసునిగుండెలు కాలినట్లయ్యె
కంసు డుగ్రుండయి కడుమత్సరమున
రామకృష్ణుల వేగ రప్పించిసభకు
మొఱకులు చాణూరముష్టికు లనెడు
వీరమల్లుల బిల్చి వారిపైఁ బంపె.
బాలురెక్కడ, మహాపర్వతాకృతులు
మల్లు లెక్కడటంచు మదులందు వగచి
భగవంతుఁ దలఁచిరి ప్రజలు భీతిల్లి
శ్రీరామకృష్ణుల క్షేమమ్ము కొఱకు
వంచనజేసి యీబాలు రిద్దఱిని

ఉత్సవమ్మని పిల్చి యసురులదీయ
కంసుఁడెంచె నటంచు కనుల నీర్వెట్టి
మాటాడఁ జాలక మఱిమఱి వగచి
ప్రార్థించుచుండిరి భగవానుఁ దలఁచి
నందాదిగోపకుల్ డెందమ్ములందు.
పదఘట్టనమ్ముల వసుధకంపింప
తొడలప్పళించుచు కడుభీకరముగ
చాణూరముష్టికుల్ చనుదెంచినారు
రామకృష్ణులతోడ రణముసేయుటకు
భయమింతయును లేక పటుసాహసమున
రంగమధ్యమునకు రయమున వచ్చి
పెనగిరి బాలు రా వీరులతోడ
మొనసి భీకరమైన ముష్టియుద్ధమున
దెబ్బకుదీటైన దెబ్బ తీయుచును
విభ్రాంతులై ప్రజల్ వీక్షించుచుండ
భయదమై యారీతి వారలమధ్య
యుద్ధమ్ముసాగిన యొకకొంతవడికి
బాహుబలోదగ్ర పాటవమ్మొసఁగ
కృష్ణుండు చాణూరుఁ గ్రీడగా నెత్తి
గిరగిర ద్రిప్పుచు ధరణిపైఁ గొట్టె.
ముష్టితో రాముడు ముష్టికున్ బొడిచి
నేలపైఁ బడగొట్టి కాలితో ద్రొక్క

నెత్తురుల్ గ్రక్కుచు నేలపై వ్రాలి
మడసిరి కంసుని మల్లు లిద్దఱును.

కనుగొని వెఱపుతో కంసుఁ డంతయును
వేలెడంతయు లేని బాలురు వీరు
చూడగా పదియేండ్లు కూడను లేవు
తనముందు నింతటి పనియొనర్చెదు రె
వీరి సాహసమెంత వీరెంత యనుచు
సింహాసనమునుండి చెంగున దూకి
ఖడ్గమ్ము చేబూని కడుభీకరముగ
కనుల నిప్పులు రాల కంసుండు వచ్చె
కృష్ణునితల నొకవ్రేటునఁ ద్రుంప,
కంసుని భీకరాకారమ్ము నరసి
నిలిచిరి సభ్యులు నిశ్చేష్టు లగుచు

గమనించి కృష్ణుఁ డా కంసుని తలపు
గరుడుడు త్రాచుపై నురుకు చందమున
కంసుపై దూకి యాకత్తిని లాగి
బలిమిమై కంసుని తలపట్టి యీడ్చి
నరికి ప్రోవులుపెట్టె శిరము మొండెమ్ము
దుష్టరాక్షసులను తోడు చేసికొని
ప్రజలను బాధించు పాపచిత్తుండు
కంసుని పీడలు కడముట్టెననుచు

సంతసమందిరి సభ్యులందఱును
పరమాత్మకృపచేత బాలులిద్దఱును
క్రూరుఁడౌ కంసునిబారియందుండి
బయటకు సుఖముగా వచ్చినందులకు
డెందమూరట జెందె నందగోపునకు

కంసుని తమ్ములు ఖడ్గముల్ బూని
వధియింప వచ్చిరి బాలులిద్దఱిని
బలరాముఁ డంతట బలమైన యినుప
గుదియను చేఁబూని క్రుద్ధుఁడై వచ్చి
కంసునితమ్ముల కడతేర్చె నొకడె.

దేవకీ వసు దేవులు

పరువున బాలురు చెఱసాల కేగి
తలుపులు తెఱపించి తల్లిదండ్రులకు
ప్రణతులర్పించిరి భక్తి మీఱంగ
పుట్టిన నిముసమ్మె పొరుగూరి కేగి
నేటికి వచ్చిన నినుఁగను జూచి
పొలిండ్లు చేసె నాపడతి దేవకికి
ముద్దాడి ముద్దాడి ముద్దులకృష్ణు
నురముపైఁ దాల్చుచు మురిసె నాతల్లి
వసుదేవదేవకల్ బాలుర నెత్తి

కన్నుల నశ్రువుల్ కాల్వలై పార
మఱిమఱి జూచిరి మనసు తీరంగ
ఆశీస్సులొసంగిరి యాదర మ్మొసంగ

కృష్ణుడంతట నేగి ప్రియముమీఱంగ
కారాగృహమునందు గాసిల్లుచున్న
కంసునితండ్రిని కడునీతిపరుని
ఉగ్రసేనునిదెచ్చి యుల్లాసమలర
మధురకు రాజుగా మరల నేమించె.
కంసుని ఘాతుకకార్యమ్ములకును
భయపడి దిశలకు పరువిడినట్టి
అంధక దాశార్హ యదువృష్ణి కకుర
కులజుల నెల్లర పిలిచి కృష్ణుండు
వారిస్థానమ్ములు వారికిప్పించె.

కంసుని భయములు హింస లడంగె
బలరామకృష్ణుల ప్రాభవమ్మెరి
దేదీప్యమైవెల్గె దివ్యతేజమ్ము
కృష్ణునిమహిమము కీర్తించి మిగుల
కురిపించి రమరులు విరులవానలను.

## గు రు కు ల వా స ము

బలరామకృష్ణులు లలితసద్గుణులు
విజయవిహారు లాపీరబాలకులు

తల్లిదండ్రులతోడ నుల్లాసమెసఁగ
గడపిరి ప్రీతితో కాలమ్ముకొంత
వసుదేవుఁ డంతట బంధుమిత్రులను
గురు పురోహితులను కూర్మిమై పిలచి
సర్వసమ్మతముగా శాస్త్రోక్తసరణి
నొనరించె బాలుర కుపనయనముల
సర్వసమర్థుడు సర్వజ్ఞుఁ డెంత
అతిశయప్రాభవుం డయినను గూడ
సద్విద్యలను సదాచారపద్ధతుల
నాచార్యుకడఁ జేరి అభ్యసించనిదె
జీవితలక్ష్యమ్ము సిద్ధించ దనుచు
బలరామకృష్ణులన్ వసుదేవుఁ డెలమి
కాశీపురమ్మున కాపురమున్న
సాందీపుఁడను గొప్పశాస్త్రజ్ఞునొద్ద
నప్పగించెను విద్య లభ్యసించుటకు
బలశాలులము మహాప్రతిభుల మనుచు
విఱ్ఱవీగక కడువినయభావమున
గురువును పూజించి గురుసేవఁ జేసి
బలరామకృష్ణులు పడసిరి మిగుల
స్వల్పకాలములోనె సర్వవిద్యలను
ప్రతిభతో నలరు నాబాలురఁ జూచి
సాందీపుఁ డత్యంతసంతోష మందె

సంద్రమ్ములో మున్గి చనిపోయినట్టి
కొడుకును జూడఁగా గురువువాంఛింప
కాలునొద్దకు నేగి బాలులిద్దఱును
గురువు కుమారుని తిరిగి తోడ్తెచ్చి
కొమరొప్ప నిచ్చిరి గురుదక్షిణగ
బలరామకృష్ణులు బలయశోధనులు
తనశిష్యులైనట్టి ధన్యత కలరి
శాస్త్రపాఠము లెల్ల సంపూర్తిఁజేసి
సాందీపుఁ డత్యంతసమ్మోద మ్మెసఁగ
ఆబాలకుల నంపె నాశీస్సు లొసఁగి.

## జరాసంధుఁడు

మామ కంసునికిని మగధకు రాజు
శౌర్యవంతుఁడు జరాసంధుఁడన్ నృపతి
అల్లునిచావున కాత్మలో వగచి
సైన్యముల్ సమకూర్చి సమయమ్ముఁజూచి
బలరామకృష్ణుల పరిమార్చుకొఱకు
దండెత్తె మధురపై దర్పమ్ముదోడ.
దివినుండి రథములు దివ్యాయుధమ్ము
లేతెంచె బలరామకృష్ణులకొఱకు
సాహసమ్మున జరాసంధు నోడించి
బయటకు తోలిరి బాలురిద్దఱును.

పగవీడకుండ నా బాలురపైన
సైన్యమ్ముతో జరాసంధుఁడు మరల
వచ్చెను దండెత్తి పదునేడుసార్లు
పదునేడుసార్లును పరిభవ మంది
మరలెను వెంటనే మగధ కాతండు.
పదునెన్మిదవసారి పగబూని మరల
వీరాగ్రణియు మహాక్రూరుఁడు నైన
కాలయవనునితో కలసి దండెత్తి
చనుదెంచె నాజరాసంధుండు మధుర
రెండుప్రక్కలనుండి భండనమ్మునకు
మాటిమాటికి నిట్లు మధురాపురమ్ము
దుండగుల్ జరిపెడు దండయాత్రలకు
పాలగుచుండుట భావించి మదిని
రామకృష్ణులు ప్రజాక్షేమమ్ము నరసి
మధురానగరిలోని మనుజుల నెల్ల
ద్వారకానగరికి తరలించినారు
ప్రజలకెల్లర కిట్లు రక్షణ నొసఁగి
బలరామకృష్ణులున్ ద్వారకాపురికి
పయనమై చనుచుండ వారల వెనుక
సరగున నా జరాసంధుఁడే తెంచి
తఱుమసాగెను సైన్యతండమ్ముతోడ
ప్రబలుఁడై తఱుముచు రామకృష్ణులను

బాటలో నొక గిరిప్రాంతమ్మునందు
ముచికుందు డను నొకముని నెదిరించి
కాలధర్మమునందె కాలయవనుఁడు.

ధర జరాసంధుల పరిమార్చుకొఱకు
పాండురాజసుతుండు బాహుదర్పోగ్ర
బలశాలి భీముఁడు కలడంచు నెఱిఁగి
కాలపరిస్థితుల్ గాంచి కృష్ణుండు
అన్నతో నటనున్న యద్రిపై కెక్కి
యరిగెను ద్వారక కటువైపు దుమికి
ఆపర్వతమ్మున కగ్నిముట్టించి
బలరామకృష్ణు లావహ్నిలో గ్రుగ్గి
మరణించిరనుచును మనమునునం దెంచి
చనెను వెన్కకు జరాసంధుండు తిరిగి.

రుక్మిణీ కళ్యాణము

భీష్మకుం డను నొకవృద్ధేశ్వరుండు
అవనినేలె విదర్భయందుండి మున్ను
ఆత్మజుల్ కల రేవు రతనికి వారి
కడగొట్టుచెల్లెలు కమనీయగాత్రి
రుక్మిణి యనియెడు రుచిరాంగి కలదు.
అందాలరాశి యాయన్నులమిన్న

బాల్యమ్మునుండియు బాలకృష్ణునికి
హృదయమ్మునర్పించి ప్రేమించుచుండె
వయసుతోపాటామె ప్రణయమ్ముకూడ
వికసించి నానాట వృద్ధికాజొచ్చె
ద్వారకకడనుండి తనపురమ్మునకు
వచ్చిన యాత్రికప్రజలను బిలచి
భక్తితో వినుచుండు పలుమారు లడిగి
కృష్ణునికీర్తియు కృష్ణునికథలు
కృష్ణునే భర్తగా హృదయానఁ దలఁచి
నోములు నోచుచు నీమమ్ముతోడ
దేవిగారికి మ్రొక్కి దినదిన మగిగి
గడపుచుండె దినాలు కాంతరుక్మిణియు
రుక్మిణియందమ్ము రుక్మిణిగుణము
లాలించి శ్రీకృష్ణుఁ డాకన్యయందె
తలఁపులు వలపులు నిలిపె నెమ్మదిని.

త్రిభువనసుందరి దివ్యస్వరూప
రుచిరయావని యైన రుక్మిణియందె
నృపతులందఱి యాశ నిలుచుట నెఱిగి
బాలిక రుక్మిణి పరిణయమ్మునకు
తగిన యత్నమ్ములు తలపెట్టె రాజు
బంధువుల్ రుక్మిణిభావమ్ము నెఱిఁగి

ఈమెకు శ్రీకృష్ణుఁ డీమె కృష్ణునకు
తగినవా రనుచును తలపోసి మిగుల
సంతసమ్మందిరి స్వాంతమ్ము లందు
కాని, వారలమాట కాదని వచ్చి
రుక్మినాఁ బరగెడు రుక్మిణియన్న
తండ్రి కేవేవియో తగురీతిఁ జెప్పి
చేదిభూమీశుడు శిశుపాలునకును
పిల్లనిచ్చెద మంచు వేడుక మీఱ
సకలసన్నాహముల్ సలిపె వేగముగ
అఖిలరాజన్యుల కాహ్వానమంపె
పెండిలివేడుకల్ వీక్షించుకొఱకు.
ప్రేమించు పెట్టేఁగియు కృష్ణుని తాను
శిశుపాలునకొసంగ శీఘ్రమే యన్న
కావించునేర్పాట్లు గాంచి రుక్మిణియు
తనసోదరు డొనర్చు పనికి దుఃఖించి
తదుపరి యొక్కింత ధైర్యమ్మునూని
పరులెఱుంగని యట్లు బహురహస్యముగ
విప్రునొక్కనిఁ బిల్చి వేగమ్మె పంపె
కృష్ణునికొకవార్త నిచ్చి యీరీతి.

"నాహృదయేశ్వర ! నందకుమార !
నీమీదప్రేమతో నీమమ్ము తోడ

నిన్నె నమ్మితినమ్మి నిన్నె కొల్చుచును
వేచియున్నానిట వేయికన్నులను
మాయన్న నీపయి మత్సర మ్మూని
శిశుపాలుఁ డనియెడు చేదిరాజైన
యొకనీచునకు నన్ను నొసగెదననుచు
సకలయత్నమ్ములు సాగించుచుండె.
ఎటులమన్నింతువో యెట్లుచూచెదవో
రెండురోజుల కిక పెండిలి ప్రొద్దు
గౌరిపూజకు నేను చేరిన వేళ
తరుణమ్ము వేచి నీయరదమ్మునందు
కొనిపొమ్ము నన్నీవు కొంపొమ్ము దేవ!
ప్రణయబాంధవ ! నీకు ప్రణతు" లటంచు.
బ్రాహ్మణుండేగి యావార్త నీయంగ
బాగాక యని కృష్ణుఁ డాలించి నవ్వె.

"ఏ తెంచె సుముహూర్త మెల్లిలగ్నమ్ము
రాజన్య లెందఱో రమ్య వేషముల
శిశుపాలుతోఁగూడి చేరిరందఱును
శ్రీకృష్ణు డరుదెంచు రీతి కన్పడదు.
ఏల, విప్రుండేగి యింకను రాడు
విప్రుఁ డచ్చోటికి వెడలెనో లేదొ
అలసి మార్గమ్మునం దాగెనో యేమొ,

ఏరీతి నెంచెనో కృష్ణుఁ డీవార్త
నప్పులపాలానో నాభ్రాతు” కనుచు
డెందాన రుక్మిణి కొందల మ్మొందె.
అంతలో బ్రాహ్మణుం డరుదెంచి నుడివె
“శ్రీరుక్మిణీదేవి! చింతింప కమ్మ,
శ్రీకృష్ణుఁ డిటవచ్చు రేపటిదినమె
విని హర్షమందె నీ విన్నప” మనుచు
భూసురుమాటకు పులకించి తనువు
శ్రీకృష్ణుఁడేమేమి చెప్పె భూదేవ!
మరలచెప్పు మటంచు మరల నానుడువె
వినుచు రుక్మిణి లేచి విప్రసత్తముని
గౌరవించి యొసంగె కానుక లెన్నొఁటినో.

నృపతులెల్లరు వేడ్క నేతెంచినారు
రుక్మిణిపెండ్లికై రుచిరోత్సవములు
జరిగె విదర్భలో సలలితరీతి
గౌరిఁ గొల్వగ నలంకారముల్ జేసి
పంపిరి బాలికన్ పడతు లందఱును
భక్తితో రుక్మిణి పార్వతి కెఱఁగి
”మాహేశ్వరీ, నిత్యమంగళగౌరి
జగదంబ, శర్వాణి శంభునిరాణి
అమ్మలఁగన్నట్టి అమ్మవు నీవు

నెమ్మనమ్మున తల్లి నిన్ను నీశ్వరుని
నమ్మితినో యమ్మ మిమ్ము నిద్దఱిని
కరుణింపవే తల్లి ! కల్పకవల్లి
శ్రీకృష్ణమూర్తి నాహృదయాధినేత
మమ్ము నేకము జేసి మన్నింపు మమ్మ
పార్వతీ నీకివే ప్రణతు" లటంచు
ప్రార్థించుచుండఁగా పరమాద్భుతముగ
ఎట్లెగుదెంచెనో యేమొ కృష్ణుండు
రథముపై కెక్కించి రమణి రుక్మిణిని
ద్వారకానగరమ్ము దారినిఁ బట్టె
ఔరౌర ! యెంతట యాగడ మిద్ది
రాజకుమారిని రథముపైఁ బెట్టి
గొల్లకృష్ణుం డదె కొనిపోవుచుండె
పట్టుఁడు కొట్టుఁడు బంధింపుఁ డనుచు
చనుదేర తనవెన్క సకలరాజులును
రుక్మియు మిక్కిలి రోషమ్ముతోడ
వెన్నునిరథమును వెంటాడఁ జొచ్చె.
కృష్ణుఁ డొంటిగ నేగె నేమౌనో యనుచు
కృష్ణునిసాయమై యేతెంచె వెనుక
బలముల చేకూర్చి బలరామమూర్తి
కృష్ణుపైఁ బడఁబోవు రిపుతతిం జూచి
బలరాముఁ డుగ్రుఁడై వారిపై కురికి

వెనుకకు తరిమెను పీచమడంచి.

కత్తిని చేబూని కడుసాహసమున
క్రోధపూరితుఁ డయి రుక్మియు వచ్చి
కృష్ణుని రథముపై కెగురుచుండంగ
కృష్ణుఁ డాతని కాలు కేలును బట్టి
అవని మీఁదకు నీడ్చి యాకత్తి లాగి
కురులు మీసములును గొఱిగించి పంపె
నీయవజ్ఞయె చాలు నీతని కనుచు.
బలములతోఁ గూడి బలరాముఁ డట్లు
తగిన సహాయమ్ము తన కొనరింప
చైద్యుని రుక్మిని సాళ్వాదినృపుల
సమరమ్మునం గెల్చి సాహస మ్మెసఁగ
రుక్మిణితోఁ గూడి రుచిరోత్సవమున
విజయుఁడై కృష్ణుఁడు విచ్చేసె తిరిగి
తోరంపు మంగళతూర్యమ్ము లెసగ
రుక్మిణీకృష్ణుల రుచిరకళ్యాణ
వైభవ మ్మలరెను ద్వారకయందు
వైకుంఠమే దిగి వచ్చిన యట్లు
విశ్వకళ్యాణమ్మె విలసిల్లి నట్లు
సమ్మదప్రదమయి జనులకెల్లరకు.

ప్రద్యుమ్నుఁడు

కోమలి రుక్మిణింగూడి ద్వారకను
ఆనందమూర్తియై యనురాగ మొప్ప
కాలమ్ము కృష్ణుండు గడపుచుండంగ
మన్మథునంశను మంజులతనుఁడు
ప్రద్యుమ్నుఁ డుదయించె పడతి రుక్మిణికి
వెన్నునిపై నున్న ద్వేషమ్ము కొలఁది
పుట్టినక్షణమె యాపుత్రుసిఁ బట్టి
పాదోధిజలములఁ బడవైచె వేగ
శంబరుండనెడు రాక్షసవీరుఁ డొకడు
దనుజునిమాయచే తనయుఁ డారీతి
మాయమైనందుకు మదిని దుఃఖించి
బంధుపులండఱున్ వచ్చి యోదార్ప
దైవనిర్ణయమును తప్పరాదనుచు
ఒక్కింత రుక్మిణి యూరట నందె.

వార్ధిలోఁ బడినట్టి బాలుని జూచి
మ్రింగిన దొక గండుమీనమ్ము వచ్చి
అటగొన్ని దినముల కాపెద్ద చేప
జలములందున చిక్కె జాలరివలకు
ఆమత్స్యముం జూచి యాశ్చర్యమంది

కాన్కగానిచ్చిరి కడువేడ్క మీఱ
శంబరాసురునకు జాలరుల్ దెచ్చి
చేపను కోయగా చిన్నబిడ్డండు
బయటకు రాఁజూచి ప్రమదమ్ము నంది
పెంచుచునుండె నా వీరదానవుడు.

చనవుగా పెరుగుచు శంబరు నింట
పెద్దవాడయి సర్వవిద్యల నేర్చి
యౌవనుండయి మంచియందగాఁ డగుచు
ప్రద్యుమ్నుఁ డతిబలప్రాభవుఁ డయ్యె
మన్మథుండే యిట్లు మఱుజన్మ మందు
ప్రద్యుమ్నుఁ డగుచును ప్రభవించు టెఱిఁగి
మన్మథునర్ధాంగి మాఱురూపమున
శంబరునింటికి చనుదెంచి రతియు
సైరంధ్రిగా చేరి నేరుపుమీఱ
ప్రద్యుమ్నుతో ప్రేమభావాన నుండె
చారులు నుడువగా శంబరాసురుఁడు
గ్రహియించి వారల ప్రణయచేష్టలను
తనయంతిపురమున ననుచిత మ్మిట్లు
జరుగుట కాగ్రహపరవశుం డగుచు
ఆయుధమ్ముల బూని యట్టహాసమున
వధియింప నేగెను ప్రద్యుమ్నుపైకి

ప్రేమతో తనవద్ద పెరిగిన యట్టి
బాలుఁ డంచును మది భావింపఁబోక
శంబరుఁ డొనరించు చర్యలన్నిఁటిని
వెనుకవైపుననుండి కనిపెట్టుచున్న
ప్రద్యుమ్నుఁడే ముందు పరువెత్తి వచ్చి
శంబరుపైదూకి సాహసమ్మొసఁగ
మెడఁబట్టి పుడమిపై బడగొట్టి త్రొక్కి
రక్తముల్ గ్రక్కించి ప్రాణముల్ దీసి
రతిఁగూడి యానందమతిశయింపంగ
పయనమై వచ్చెను ద్వారకాపురికి
ఈలోన నారదుం డేగి ద్వారకకు
నడచిన కథయెల్ల నుడివె రుక్మిణికి
పుట్టినవెంటనే పోయినసుతుఁడు
విజయాభిరాముఁడై వెలఁదినిఁ గూడి
వచ్చినందుల కతిప్రమదమ్మునంది
ప్రేమతో దరిఁజేర్చి కృష్ణరుక్మిణులు
"ప్రఖ్యాతితో మీరు వర్ధిల్లు" డనుచు
నాశీస్సుల నొసంగి రత్యాదరమున
ముదమార సర్వమ్ము ముగిసినందులకు
ద్వారకావాసులు బంధువులెల్ల
పరమహర్షమ్మును బడసిరానాడు

## శ్యమంతకమణి కథ

సూర్యనిభక్తుండై సూర్యోదయమున
భానుని పూజించి ప్రార్థనల్ సలుపు
ప్రతిదినమ్మందు సత్రాజిత్ప్రభుండు
నృపతి సత్రాజిత్తు నిష్ఠకు మెచ్చి
మహిత శ్యమంతకమణి నొక్కదాని
సూర్యుఁడొసంగె నాక్షోణినాథునకు
బాలసూర్యప్రభా పటలితో వెలిగి
ప్రతిదినమ్మున స్వర్ణరాసుల గురిసి
సమకూర్చు నామణి సకలసౌఖ్యములు
ఒక్కనాఁ డామణి నొప్పుగా దాల్చి
ద్వారకకేగె సత్రాజిత్తు రాజు
దివ్యకాంతులతోడ దీపించుచున్న
ఆమణి మహిమకు నాశ్చర్యమంది
ఆమణి నిమ్మని యడిగె కృష్ణుండు
కృష్ణునకామణి నీయకుండగనె
తనదారినేగె సత్రాజిత్తు తిరిగి

ఆరాజుసోదరుం డామణిం దాల్చి
అడవికి నేగగా నటనొక సింహ
మతనిని వధియించి యామణిం గొనియె.
మణితోడ సింహమ్ము చనుచుండఁ జూచి

చంపి యాసింహమున్ జాంబవంతుండు
మణినిఁగొంపోయెను తనగుహాస్థలికి.

మణిదాల్చి తమ్ముఁడు వనభూమి కేఁగి
మృతిఁగన్న వార్త నానృపతి యెఱింగి
కృష్ణుఁడే తనతమ్ము నీరీతిఁ జంపి
అపహరించెను మణి ననుచు నిందలను
నృపతి సత్రాజిత్తు కృష్ణునిపై మోపె
కృష్ణు డాయపనింద నెదసైప లేక
వనికి సత్రాజిత్తు ననుజుండు వెడలి
మణినిగోల్పోయిన మాట నెఱింగి
తానె స్వయమ్ముగా కానల కేగి
వనులందు నాతఁడు వధియింపఁ బడిన
జాడలఁ గనుగొని చనిచని తుదకు
జాంబవంతుని గుహాస్థలమునం దతుల
ఘృణులతో వెలుగు నామణిని తాఁగాంచి
జాంబవంతుని ఘోరసమరాన గెల్చి
మణిని సత్రాజిత్తు కొనరంగ నిచ్చె.
ఆలోచనము లేక అపవాదునిట్లు
శ్రీకృష్ణుపై మోపి చేసిన యట్టి
తనతప్పునెఱిఁగి సత్రాజిత్తు వేగ
సిగ్గున చనుదెంచి శ్రీకృష్ణు కడకు

క్షమియింపు డని వేడి సత్కృతుల్ సలిపి
సత్యభామను మహాసౌందర్యవతిని
తనసుతన్ కృష్ణుని కొనరంగ నిచ్చి
కానుకలు గొని తెచ్చి కడువైభవముగ
పెండిలి గావించె విభవ మేపార.

శ్రీకృష్ణు సద్గుణ శీలసంపదను
కృష్ణునిశౌర్యమున్ కీర్తించి మిగుల
సంతోషమున వచ్చి జాంబవంతుండు
సుమకోమలిని తనసుత జాంబవతిని
శ్రీకృష్ణునకొసంగి చేసె నచ్చోట
సురుచిరశోభతో పరిణయోత్సవము.

పరమసంతోషాన బంధువు లలర
శ్రీకృష్ణుఁ డావెన్క ప్రీతిదలిర్ప
పరిణయమ్మాడెను వైభవ మ్మెసగ
మేలుగా కాళింది మిత్రవిందలను
లక్షణన్, భద్రను, లలి నాగ్నజితిని
ఈరీతి శ్రీకృష్ణుఁ డెలమి మీఱంగ
పావనచరితలు భవ్యాత్మలైన
పడతు లెన్మంద్రతో ద్వారకయందు
కాలమ్ము సుఖముగా గడపుచునుండె
ధరణిపై స్థిరముగా ధర్మమున్ నిలుప

ప్రభవమ్ము నందిన వాసుదేవుండు
శ్రీకృష్ణమూర్తికి క్షితిని వీరిట్లు
పట్టపుదేవులై ప్రఖ్యాతిఁ గొనిరి.

నరకాసురవధ

విష్ణుదేవుఁడు మున్ను పృథ్వీతలాన
ధరియించిన వరాహ సుసుచిరాకృతిని
గాంచి భూదేవియుఁ గామించి పడసె
నరకాసురుండను నిరుపమబలుని
ప్రాగ్జ్యోతిషమ్మను పట్టణమందు
రాజుగా నాతఁడు రాజ్యమ్ము నేలె
వైష్ణవాస్త్రము గొని విష్ణువు వలన
తనసాటి వీరులు ధరణి లేరనిన
దర్పాతిశయముతో ధరనెల్లఁ దిరిగి
బలిమిమై గైకొని వరుణుఛత్రమ్ము
అమరుల మణిపర్వతము సంగ్రహించి
అదితికుండలముల నపహరించియును
ప్రజలను బాధించి పలువితమ్ములుగ
అంతతో నాపక అనుచితకృతులు
దురితచింతనుడైన నరకాసురుండు
సకలరాజన్యులన్ సమరాన గెల్చి
బంధించియుంచెను పదునాఱువేలు

రాజకన్యల తనరాజసౌధమున
వినినమాత్రమున నీ దనుజునిపేరు
పారిపోఁదొడఁగిరి ప్రజలు భీతిల్లి

క్షితి నంతకంతకు మితిమీఱుచున్న
నరకాసురు డొనర్చు దురితమ్ము లరసి
ఇంద్రుఁడు మొఱవెట్టె కృష్ణునితోడ
ధరణి నీబాధలు తప్పుటకొఱకు.
నరకాసురుని వేగ పరిమార్చుటొకటె
కరణీయ మని పూని శరచాపములను
సత్యయు తనవెంట చనుదెంచుచుండ
గరుడవాహన మెక్కి యరిగె కృష్ణుండు

ప్రాగ్జ్యోతిషమ్మున ద్వారమ్ము కడనె
ప్రబల రాక్షససైన్య పరివృతు లగుచు
ఆయుధమ్ముల దాల్చి యట్టహాసమున
ఘన మురాసురుడాది దనుజనాయకులు
కృష్ణుని కడ్డుగా నేతెంచి పోర,
దుర్వార నిరుపమ దోర్దర్పమడర
భయదకార్ముక మెత్తి బాణాగ్ని గురిసి
వధియించె కృష్ణుండు వారినందఱిని
నీరజాక్షుని ముందు నిలువగ లేక
సర్వరాక్షస సేన సమయుటఁ జూచి

పటుతీవ్ర సమర కోపాటోప మమర
శస్త్రాస్త్రములు బూని శక్తినిఁ బూని
వికటాట్టహాసుఁడై భీకరాకృతిని
నడచెను కృష్ణునిపై నరకాసురుండు
సప్తాబ్ధులు కలంగి జగమె వణంకు
ఘోరయుద్ధమ్మయ్యె వారి కిద్దఱకు
సకలభీకరముగా చాలకాలమ్ము
అనిలోన శ్రీకృష్ణుఁ డలయుట జూచి
అబలయయ్యును విల్లునమ్ములఁ బూని
వీరరసావేశ విలసితాకృతిని
రణదేవతయు వోలె రథముపై నిలచి
నిరుపమధృతితోడ నరకు నెదిర్చె
సమముగా సత్యయు సమరమ్మొనర్చె
అనురాగమునఁ జూచి హరిని మెప్పించి
అమ్ముజల్లుల వైచి అరిని నొప్పించి
అనురాగమలరగా నాగ్రహమ్మడర
హరిజూచి పరుజూచి యనిసేసె నామె
చూచి శ్రీకృష్ణుఁడే చోద్యమ్ము నంద
శ్రీకృష్ణుఁ డలసిన చిహ్నమ్ము లరసి
నరకాసురుం డొక యురుశక్తిఁ బూని
కృష్ణునిపై నేయ నెద నెంచుచుండ
నరకుని దుర్దర్ప మరసి వేవేగ

కృష్ణుఁడు చక్రమ్ము కేలను బూని
నరకెను త్రుటిలోన నరకుని శిరము
ధరణిపైఁ గూలె నానరకుండు చచ్చి
శ్రీకృష్ణుఁ డంతట ప్రియము దీపింప
నరకుఁ డొనర్చిన దురితమ్ము వలన
చెఱసాలలో క్రమ్గి దురపిల్లుచున్న
వనితల నోదార్చి వారినందఱిని
విడిపించి వారిచే వినుతుల నందె
ఆరీతి కృష్ణునిచే నాదరమ్మంది
ధన్యమ్ములైనట్లు తలఁచి జన్మములు
భక్తితో వచ్చి యావనిత లందఱును
శ్రీకృష్ణుఁ గొలిచిరి హృదయమ్ము లిచ్చి.

సుతుఁడైన నరకుని మృతికి దుఃఖించి
భూదేవి కృష్ణుని పాదాల వ్రాలి
ప్రార్థింప కృష్ణుఁడు ప్రాగ్జ్యోతిషమున
నరకునిపుత్రుని నరపతిఁ జేసి
భూదేవి నంతట నోదార్చి పంపె
దేవేంద్రుఁడును ముఖ్యదేవతల్ వచ్చి
తమమొఱ లాలించి దైత్యుని జంపి
ప్రజలను కరుణతో రక్షించినట్టి

కృష్ణుని మిక్కిలి కీర్తించి చనిరి
నరకుని బాధలు నశియించి ధరణి
ప్రజలెల్ల పొందిరి పరమహర్షమును.

## పారిజాతాపహరణము

నారదుం డొకనాఁడు నాకమ్మునుండి
నందనవనమునం దందమ్ము లొలుకు
పారిజాతసుమమ్ము భక్తితోఁ దెచ్చి
కృష్ణుఁడు రుక్మిణిగృహమునం దుండ
కృష్ణున కొసఁగెను ప్రీతి దలిర్ప
రుచిరసద్గుణవతి రుక్మిణీసతికి
కృష్ణుఁ డాపూవును ప్రేమతో నిచ్చె
బహుమహాత్మ్యముగల పారిజాతమ్ము
తనవద్ద చేరిన తరుణమ్మునుండి
రుక్మిణిసంపద రుక్మిణికీర్తి
పదిరెట్లు వృద్ధియై భాసిల్లఁ దొడఁగె

దేవమునీంద్రుఁడు దివ్యపుష్పమును
కృష్ణునికిడుటయు కృష్ణుండు తిరిగి
పూవును రుక్మిణీదేవి కిచ్చుటయు
చెలులు శీఘ్రమ్మేగి చెప్పగా సత్య
"అనురాగమందున అందమ్ము నందు

సవతులందఱిలోన సరిపోల్చి చూడ
మిన్నయై తానుండ నెన్నఁ డీరీతి
పెద్దగా రుక్మిణిన్ ప్రేమించి తనకు
అవమాన మొనరించి నందుల కలిగి
కినుకతో తనకోప గృహమున కరిగె.

నారదుఁ డిచ్చిన పారిజాతమును
కృష్ణుండు రుక్మిణి కిచ్చినందులకు
సత్యకు కోపమ్ము జనియించు టెఱిఁగి
సత్యయింటికి నేగి స్వయముగా కృష్ణు
డామె నూరార్పగా యత్నించు లోన
పారిజాతకుసుమ వాసనల్ క్రమ్మ
కృష్ణుఁ డేతెంచిన రీతిఁ గన్పెట్టి
హేళనకై కృష్ణుఁ డేతెంచె ననుచు
ఈర్ష్యతో డెందాన హెచ్చిన వగను
సరళసుందర గళస్వరముతో సత్య
వెక్కి వెక్కేడ్చె నావెన్నుని ముందు.

సత్య కోపమ్మును సమయింప జేయ
కృష్ణుండు సత్యను ప్రియముగాఁ జేరి
పరమాదరమ్మున బ్రతిమాలుచున్న
నయగార మొప్పగా నటనసేయుచును
ప్రియభాషణమ్ముల వినిపించె నిట్లు

"నలినాక్షి నీమీఁద నాకున్నయట్టి
అనురాగ మెఱుఁగవో ఆత్మలో నీవు
ఒక్క పూవదియేల నువిదరో నీకు
దేవేంద్రుఁ డెదురైన కావర మ్మడఁచి
అమరవనమ్మునం దలరారుచున్న
పారిజాతమ్మును వేరుతో పెఱికి
మొక్కనంతటని నీముద్దుతీరంగ
నాటింతు నీసౌధవాటికయందు
కోపమ్ము మానవే కుసుమాంగి" యనఁగ
సత్యభామయు మది సంతసమ్మంది
కాంతునియొడిలోన కరగిపోయినది.

సత్యభామనుగూడి సమ్మదమ్మెసఁగ
పయనమై మఱునాఁడె పక్షీంద్రు నెక్కి
అమరావతికి శీఘ్ర మరిగె కృష్ణుండు
నరకాసురునినుండి తిరిగి గైకొనిన
అదితికుండలముల నదితి కర్పించి
నందనవని కేగి యందందు తిరిగి
పారిజాతము సత్యభామకుఁ జూపి
వర్ణించి తత్తరువైభవ మెల్ల
వెన్నుఁ డా మొక్కను పెఱుకబోవంగ
అడ్డగించిరి వచ్చి యచటికాపరులు
అమరేంద్రుఁడును వచ్చె నావార్త నెఱిఁగి

తగదు శ్రీకృష్ణ యీతప్పు నీకనుచు
వాదముల్ పెరుగుచు వారలమధ్య
మాట నచ్చట పెనుపోరుగా తుదకు
అమరేంద్రుఁతో బాటు అమరసైన్యముల
అలుకమై శ్రీకృష్ణుఁ డావలఁ ద్రోలి
భద్రమ్ముగాఁ దెచ్చి పారిజాతమును
సత్యభామామణి సౌధాంగణమున
నాటించె నెంతయో నయగారమొప్ప.

## సత్యాగర్వభంగము

వాంఛించినంతనే వాకిటి నిట్లు
సకలసంపదలను సౌఖ్యమ్ము లొసఁగు
పారిజాతము వచ్చె భర్త లోఁబడెను
తనయంతవారింక ధరణి లేరనుచు
కడు హెచ్చె సత్యకు గర్వాతిశయము
స్వాంతమ్మునం దెంచి సత్యగర్వమ్ము
నారదుం డొకనాఁడు నయమున వచ్చి
సత్యభామను జూచి చతురవాక్యముల
"పారిజాతముచేత పదిరెట్లు దేవి !
భాసించె నీకీర్తి భాగ్యమ్ము లెల్ల
నీభాగ్యసంపదల్ నిత్యమై నిలచి
పృథివిపై నింకను పెరిగి వర్ధిల్ల

పతిని పూజయొనర్చు వ్రతమొండు కలదు.
నీవు పాతివ్రత్య నిర్మలమహిమ
జగమునందున సర్వజనులకు దెలియ
పారిజాతమొసంగు భాగ్యమ్ముతోడ
కృష్ణుని తులఁదూచి ప్రీతిదలిర్ప
ఆ ధనమంతయు నర్థుల కిచ్చి
నిలుపుకొమ్మా దేవి నీకీర్తి" యనుచు
నారదుం డరిగె నా నారదుమాట
కత్యంతసంతోష మందుచు సత్య
అందఱిలో తనకాధిక్య మొదవి
పృథివిపై తనకీర్తి వృద్ధియౌ ననిన
ఆశతో మొదలిడె నావ్రతక్రమము
సత్వరమ్ముగఁ బిల్చి సవతు లందఱిని

తనకున్న భాగ్యమ్ము తనకున్న ధనము
తనకున్న సర్వమ్ము త్రాసునఁ బోసి
యెంతతూచినగాని కృష్ణునివైపె
మొగ్గు జూపుచునుండె ముల్లు మిక్కిలిగ
యత్నమ్ము లెల్లను వ్యర్థమై యిట్లు
గుండెలు జల్లన కుములుచు లోన
ఊరకుండెను సత్య యుల్లమ్మునందు
తన కేదియును వేఱు దారి కనబడక

ఇంతలో రుక్మిణి యేతెంచి యటకు
భక్తితో కృష్ణుని ప్రార్థించి మదిని
భర్త పాదములకు బ్రణమిల్లి లేచి
ధనరాశు లన్నిటిన్ త్రాసునందుండి
తొలగించి యందొక్క తులసీదళమ్ము
నుంచగా నాయూకె యొప్పగా తూగె
నెక్కువబరువయి కృష్ణుని కంటె
అచటివారెల్లర కాశ్చర్యమొదవ.

అతిశయమ్మునకంటె నందమ్ముకంటె
పడతికి భాగ్యమ్ము పతిభక్తి యనుచు
రుక్మిణి పతిభక్తి రూఢిగా నెఱిఁగి
సత్యగర్వమ్మెల్ల సమసె నాక్షణమె.

ఉషా పరిణయము

బలికుమారులలోన బాణుఁడు పెద్ద
వేయిచేతులుగల వీరుఁ డతండు
శివు ననుగ్రహ మంది శివభక్తుఁడైన
యతనికి భయపడి యమరులే వచ్చి
వినయులై సేవల నొనరింతు రెపుడు
జగదేకసుందరి చక్కనిచుక్క
ఉషయను నొకకూతు రున్న దాతనికి

చక్కనిబాలుడు సౌందర్యమూర్తి
భాసురతేజస్వి బలశాలి యైన
యొక్కఁడు స్వప్నమం దుషకుఁ గన్పించి
ముద్దులగురిపించి మోహింపఁ జేసి
మాయమైపోవగా మనసులోఁ గలఁగి
చెలిచిత్రలేఖకు కలయెల్ల నుడివి
బాలునియందమ్ము వర్ణించి యుషయు
సాయమ్ము నెట్లైన చేయుమం చడిగె.

ప్రద్యుమ్నునిసుతుండు బాలవీరుండు
కృష్ణునిమనుమఁడై కీర్తిని గొనిన
అనిరుద్ధుఁ డాబాలుఁ డనుచు గుర్తించి
ఎవ్వరెరుఁగకుండ నేగి ద్వారకకు
ననిరుద్ధుఁ గొనివచ్చి యతిరహస్యముగ
చేర్చె నా యుషకడ చిత్రలేఖయును
అనిరుద్ధుఁ డుషయును ప్రణయమూర్తులుగ
నొకరి కౌగింటిలో నొకరు కరంగి
గడపుచుండగ నుష గర్భమ్ముఁదాల్చె
కావలివారది కనిపెట్టి నుడువ
బాణాసురుఁడు రోషభాషణుం డగుచు
అన్యులెఱుంగని యాయంతిపురికి
చిఱుచీమ కూడను చేరని చోటి

కనిరుద్ధు డెట్లేగె ననుచు కోపించి
కండ్లెఱ్ఱజేయుచు కాలుని వోలె
ననిరుద్ధుఁ జంపగా యత్నించు చుండె.

అనిరుద్ధుఁ గానక నాత్మల వగచి
ద్వారకావాసులు తల్లడ మంద
నారదుం డేతెంచి వారికిఁ జెప్పె
అనిరుద్ధుఁ డుషకడ కరిగియుండుటయు
బాణాసురుని కోపవహ్నులనుండి
అనిరుద్ధుఁ గావగా నదనిది యనుచు
ఆలస్య మొనరింప కణుమాత్ర మైన
బలరామకృష్ణులు బలస మేతముగ
బాణుపై దండెత్తి పట్టివధించి
అనిరుద్ధు నుషతోడ నతివైభవముగ
గొనివచ్చి పరిణయ మొనరించి రపుడు
అనిరుద్ధురాకకు నమితహర్షమును
పొందిరి ద్వారకాపురవాసు లెల్ల.

రాజసూయము

రాజితరీతి నింద్రప్రస్థ పురికి
పాండవు లేతెంచి వారిరాజ్యమును
స్థాపించి ధరణిని ధర్మమార్గమున

చక్కనిబాలుడు సౌందర్యమూర్తి
భాసుర తేజస్వి బలశాలి యైన
యొక్కఁడు స్వప్నమం దుషకుఁ గన్పించి
ముద్దులగురిపించి మోహింపఁ జేసి
మాయమైపోవగా మనసులోఁ గలఁగి
చెలిచిత్రలేఖకు కలయెల్ల నుడివి
బాలునియందమ్ము వర్ణించి యుషయు
సాయమ్ము నెటులైన చేయుమం చడిగె.

ప్రద్యుమ్నునినుతుండు బాలవీరుండు
కృష్ణునిమనుమఁడై కీర్తిని గొనిన
అనిరుద్ధుఁ డాబాలుఁ డనుచు గుర్తించి
ఎవ్వరెరుఁగకుండ నేగి ద్వారకకు
నవిరుద్ధుఁ గొనివచ్చి యతిరహస్యముగ
చేర్చె నా యుషకడ చిత్రలేఖయును
అనిరుద్ధుఁ డుషయును ప్రణయమూర్తులుగ
నొకరి కౌగింటిలో నొకరు కరంగి
గడపుచుండగ నుష గర్భమ్ముఁదాల్చె
కావలివారది కనిపెట్టి నుడువ
బాణాసురుఁడు రోషభాషణుం డగుచు
అన్యులెఱుంగని యాయంతిపురికి
చిఱుచీమ కూడను చేరని చోటి

కనిరుద్ధు డెట్లేగె ననుచు కోపించి
కండ్లెఱ్ఱజేయుచు కాలుని వోలె
ననిరుద్ధుఁ జంపగా యత్నించు చుండె.

అనిరుద్ధుఁ గానక నాత్మల వగచి
ద్వారకావాసులు తల్లడ మంద
నారదుం డేతెంచి వారికిఁ జెప్పె
అనిరుద్ధుఁ డుషకడ కరిగియుండుటయు
బాణాసురుని కోపవహ్నులనుండి
అనిరుద్ధుఁ గావగా నదనిది యనుచు
ఆలస్య మొనరింప కణుమాత్ర మైన
బలరామకృష్ణులు బలస మేతముగ
బాణుపై దండెత్తి పట్టివధించి
అనిరుద్ధు నుషతోడ నతివైభవముగ
గొనివచ్చి పరిణయ మొనరించి రపుడు
అనిరుద్ధురాకకు నమితహార్షమును
పొందిరి ద్వారకాపురవాసు లెల్ల.

## రా జ సూ య ము

రాజితరీతి నింద్రప్రస్థ పురికి
పాండవు లేతెంచి వారిరాజ్యమును
స్థాపించి ధరణిని ధర్మమార్గమున

పాలించుచుండిరి ప్రజల మేలెంచి
సకలసంపద్భాగ్య సౌఖ్యమ్ము లొసఁగు
రాజసూయమ్మను క్రతువు నొనర్ప
సకలసన్నాహముల్ సలిపి ధర్మజుఁడు
వసుధేశులకు సర్వబంధు సంతతికి
నాహ్వానముల నంపి యత్యాదరమున
రామకృష్ణులఁగూడ రప్పించె వేగ
ధర్మజతమ్ములు దర్పమ్ము మీఱ
బయలుదేరిరి భూమిపతులను గెల్చి
కప్పముల్ ధనములు కానుకలు గొనుచు
జన్నమ్మునకు గొప్పజయము సేకూర్ప.

జరాసంధవధ

మధురలో నున్నప్డు మాటిమాటికిని
తనపైకి పలుమార్లు దండెత్తి వచ్చి
చీకాకుపఱచిన చెనటి వర్తనుడు
వైరి జరాసంధు వధియించుకొఱకు.
తరుణమిదేనని తలఁచి కృష్ణుండు
భీమార్జునులతోడ విప్రుల వోలె
మాఱువేషములూని మగధకు వచ్చె
బ్రాహ్మణు లెవ్వరో వచ్చిరటంచు
చనుదెంచి యాజరాసంధుండు చూడ
నతనికి చిత్తమం దాశ్చర్యమొదవ

పటుతీవ్రముగ నిట్లు పలికె కృష్ణుండు
"నీదౌష్ట్యమడపంగ నీచాత్మ! నిన్ను
దునుమాడుటకె మేము చనుదెంచినాము
పోరగా రమ్మిక వీరుడవైన
ఎవరితోనైన మామువ్వురిలో" ననగ
వారిమాటకు కొంతభయమంది మదిని
భీకరాకారుడౌ భీమునితోడ
దిగె జరాసంధుడు తీవ్రయుద్ధమున
భండనమొనరించు కొండలనంగ
మొనసి పోరిరివారు ముష్టియుద్ధమున
అంతకంతకు భీముడత్యుగ్రుడగుచు
జవమున నాజరాసంధుపై దూకి
నేలపైబడగొట్టి కాలితో ద్రొక్కి
రెండుకాళులబట్టి రెండుగా చీల్చి
పారవైచెను వేఱువేఱుగ జేసి.
ఐశ్వర్యమదమత్తుడై విఱ్ఱవీగు
నాజరాసంధుని యతిశయ ముడిగె
అతని కారాగారమందున మ్రగ్గు
వారలెల్లరు వేగ బడసిరి ముక్తి.

## శిశుపాలవధ

ధర్మజుతమ్ములు దర్పాతిశయులు
తిరిగివచ్చిరి నాల్గుదిశలను గెల్చి

విజయులై కానుకలు విరివిగా గొనుచు
ధర్మజుజన్నమ్ము దర్శించుకొఱకు
బంధువుల్ నృపతులు వచ్చి రెల్లరును
ప్రీతితోఁ బూజించి పెద్దలందఱిని
అతిథులందఱికి సత్కృతులను సలిపి
క్రతుదీక్షితుండయ్యె కడగి ధర్మజుఁడు
పరమవిజ్ఞానియు కురువృద్ధుఁడైన
భీష్ముఁడంతట లేచి ప్రియభాషణముల
పలికెను ధర్మజు వైపువీక్షించి
"ఇంతవైభవముగా నేపుదీపించు
యజ్ఞకార్యమ్మువం దన్నివిధాల
దివ్యప్రభావుండు భవ్యవర్తనుఁడు
కృష్ణుఁ డర్హుఁడు గాన ప్రీతిదలిర్ప
యజ్ఞపూరుషునిగ నర్చనల్ ముందు
శ్రీకృష్ణమూర్తికి చేయు" మటంచు
భీష్మునివాక్యముల్ విని సంతసించి
అచ్యుతున్ ధర్మజుఁ డర్చింపఁ బోవ
ఆదినుండియు కృష్ణునం దీర్ష్య గొనిన
చేదిభూపాలుఁడు శిశుపాలు డదరి
దారికడ్డమువచ్చి ధర్మజు నాపి
పెద్దగొంతుకతోడ పెటిలి యార్చుచును
"వెఱ్ఱిభీష్ముని మాట విని ధర్మరాజ !

విజయులై కొన్ని కాలు విరివిగా గొనుచు
ధర్మజుజన్నమ్ము దర్శించుకొఱకు
బంధువుల్ నృపతులు వచ్చి రెల్లరును
ప్రీతితోఁ బూజించి పెద్దలందఱిని
అతిథులందఱికి సత్కృతులను సలిపి
క్రతుదీక్షితుండయ్యె కడగి ధర్మజుఁడు
పరమవిజ్ఞానియు కురువృద్ధుఁ డైన
భీష్ముఁడంతట లేచి ప్రియభాషణముల
పలికెను ధర్మజు వైపువీక్షించి
"ఇంత వైభవముగా నేపుదీపించు
యజ్ఞకార్యమ్మువం దన్నివిధాల
దివ్యప్రభావుండు భవ్యవర్తనుఁడు
కృష్ణుఁ డర్హుఁడు గాన ప్రీతిదలిర్ప
యజ్ఞపూరుషునిగ నర్చనల్ ముందు
శ్రీకృష్ణమూర్తికి చేయు" మటంచు
భీష్మునివాక్యముల్ విని సంతసించి
అచ్యుతున్ ధర్మజుఁ డర్చింపఁ బోవ
ఆదినుండియు కృష్ణునం దీర్ష్య గొనిన
చేదిభూపాలుఁడు శిశుపాలు డదరి
దారికడ్డమువచ్చి ధర్మజు నాపి
పెద్దగొంతుకతోడ పెటిలి యార్చుచును
"వెఱ్ఱిభీష్ముని మాట విని ధర్మరాజ!

వైకుంఠమునయున్న ద్వారపాలకులు
జయుడు విజయుడును శాపమూలమున
పుడమియందు మూడవసారి పుట్టుకనంది
దైత్యులై శిశుపాలదంతవక్త్రులుగ
కృష్ణుచే హతులయి యేగిరి మరల
వైకుంఠ నగరికి వైకుంఠుఁ గొలువ.
శిశుపాలు ననుచరుల్ సేనాధిపతులు
యజ్ఞకార్యమ్మున కడ్డుగా వచ్చి
పాడుచేయఁగ నెంచు పాపాత్ము లెల్ల
చచ్చిరి కృష్ణుని చక్రసంహతుల
సంక్షోభ మెల్లను సమసి పూర్ణముగ
ధర్మజుఁ డొనరింపఁ దలఁచినయట్టి
రాజసూయము సాగె రమణీయరీతి
తగుశాస్త్రవిధులను దానధర్మముల
క్షితిమీదనింతటి క్రతువు లేదనఁగ
శ్రీకృష్ణునర్చించి తృప్తిగా మదికి
పెద్దలదీవనల్ ప్రీతితో బడసి
ధన్యుఁడై యలరెను ధర్మనందనుఁడు.

పౌండ్రక వాసుదేవుఁడు

పూర్వమున కరూశ భూభాగ మేలు
పౌండ్రకుం డనియెడు వసుధాధినేత
వాసుదేవాఖ్యుఁడై పలుగుచు నుండె

మదమత్తుఁ డతిశయమలినాత్ముఁ డతఁడు
శ్రీకృష్ణునిం బోలి చేతులయందు
చక్రమున్ గదయును శంఖ పద్మములు
కౌస్తుభమ్మునుబోలు కంఠహారమును
దాలిచి చరియించు దర్పమ్ముతోడ
వాసుదేవుఁడ నేనె వసుధపై ననుచు.

ఒకనాఁడు శ్రీకృష్ణుఁ డూర లేనపుడు
పౌండ్రకుం డరుదెంచి ద్వారకాపురికి
"వసుధ నేనొకఁడనే వాసుదేవుఁడను
కృష్ణునిఁగూడను కీర్తింతు రేల
వాసుదేవుఁ డటంచు వర్ణించి మిగుల
గడిపోచకు గాని గదయు చక్రమును
దొరవోలె దాలిచి తిరుగు నాతండు
బలమున నాముందు నిలువలే కాతఁ"
డనుచేమొ బీరమ్ము లాడుచుండంగ
సాహసమ్మెసగంగ సాత్యకి వచ్చి
ద్వారకనుండి యాపౌండ్రకున్ తరిమె.
పరిభవమ్మందిన పౌండ్రకుం డంత
స్నేహితుండైన కాశీరాజు కడకు
చనుదెంచి యాతని సాయమ్ము కోరి
కృష్ణున కొకవార్త నీరీతిఁ బంపె

"వసుధపై నేనుండ వాసుదేవుఁడను
నావలె వేసమున్ నటనతోఁ దాల్చి
వాసుదేవుఁడ నంచు పటుదర్ప మలర
తిరుగుచుంటివి కృష్ణఁ ధరణిపై నీవు
వాసుదేవుఁ డొకండె వరలును గాని
యెప్పుడైన వసుధపై నిరువు రుండెదరె
సైరింపజాల నీసాహస మ్మింక
నీచిహ్నములతోడ నీపేరుఁ గూడ
తొలగింపు వెంటనే తొలఁగింప కున్న
నిలువనీయను నిన్ను నేలపై" ననుచు-
ఆవార్త శ్రీకృష్ణుఁ డాలించి నవ్వి
మితిమీరె నీతని యతిశయ మ్మనుచు
బలరాముతోఁ దూకి ప్రాభవమ్మెసఁగ
బలసముద్ధతి నేగె పౌండ్రకు పైకి
చక్రమున్ దాలిచి చండతేజమున
నరుదెంచు శ్రీకృష్ణుఁ నరసి నంతటనె
భయమున పౌండ్రకవాసుదేవుండు
కలగుండువడిపోయి కంపించిపోయి
కొఱగాక తనపేరు బిరుదుచిన్నెలును
శౌరిపంపించిన చక్రసంహతికి
నిలువజాలక నొకనిముసమ్ము గూడ
అనుచర తతితోడ నసువులబాసి

కుప్పగా కూలెను కుంభిని మీద
కృష్ణుచే తనతండ్రి మృతిజెందు టరసి
అగ్నిని బ్రార్థించి యగ్నిశక్తులను
శ్రీకృష్ణుపైకి కాశీరాజు సుతుడు
పంపగా నాశక్తి వ్యర్థమై పోయి
కాలి బూడిద యయ్యె కాశీపురమ్మె
కృష్ణుఁ డంపిన చక్రకీలల యందు.

### కుచేలుఁడు

కృష్ణుని మిక్కిలి ప్రేమించునట్టి
బాల్యమిత్రుండైన బ్రాహ్మణుఁ డొకఁడు
కలఁడు కుచేలుఁడు కడుపేదవాడు
వేదాంతవేత్తయు విజ్ఞాని యతఁడు
తనకున్నదానినే తిని తృప్తినంది
ధ్యానముంచునుగాని దైవమ్ము నండె
యాచింపగా నేగ డన్యులకడకు
ఉన్నది చాలక కన్నసంతతికి
సంపాదనయు లేక సకలకష్టముల
నతఁడును భార్యయు నతిదీనులగుచు
పడుచుందు రపుడప్డు పస్తులుండుచును
"అమ్మ! ఆకలి" యంచు నటమటలాడు

పిల్లల యార్తిని వీక్షింప లేక
తల్లి యొక్కింతగా ధైర్యమ్ము నూని
భర్త కుచేలుని బ్రార్థించె నిటుల
వినుము ప్రాణేశ నావిన్నప మొకటి
దీనులై యేడ్చుచు తినతిండి లేక
పసిబిడ్డ లెన్నాళ్ళు పస్తుండ గలరు
చూడ లేమిక వీరిగోడును మనము
ద్వారకానగరిలో వాసమ్ము చేయు
కృష్ణుని మంచియు కీర్తిని గూడ
పుడమిపై జనులెల్ల పొగడుచున్నారు
మీకును కృష్ణుఁడు మిత్రుఁ డటంచు
చెప్పుచుందురుగాన తప్పక యిపుడె
పోండొకసారి యాపుణ్యునిఁ జూడ
శ్రీకృష్ణుఁ డాదయాసింధువు మనకు
సాయమేదైనను చేయఁగవచ్చు
ఊరకపోనేల ఉన్నవి యింట
గుప్పెడటుకు లని కొనిపొండటంచు
చిన్నమూటను గట్టి చేతికి నిచ్చి
పంపె కుచేలుని బ్రతిమాలి భార్య
దైవాంశజనితుండు ద్వారకావాసి
యదుకులస్వామియా ఆకృష్ణుఁడేడ

తానేడ యనుచును తలంచి నెమ్మదిని
కృష్ణునిమహిమనే కీర్తించుకొనుచు
తడబడు నడకతో ద్వారక కేగి
శ్రీకృష్ణసౌధమ్ము చేరి యామేడ
యందమ్ము తిలకించి యద్భుత మ్మంది
కక్ష్యాంతరమ్ములు గడచి కుచేలు
డచటనే సందియం బందుచు నిలువ
ద్వారమ్ము వద్దకు వచ్చి నిల్చున్న
బాల్యమిత్రుని జూచి పరువున వచ్చి
కడుఁబ్రీతిఁ గృష్ణుండు కౌగిటఁబూని
ఎన్నాళ్ళకోయి నీవిటకు వచ్చితివి
మానసమ్మున నన్ను మఱచిపోకుండ
మన గురువర్యుఁడు మన గురుకులము
మన యాటపాటలు మన పాఠములును
మనమునఁ దోచెను నిను జూడఁ గానె
నీకుటుంబమునకు నీకును గూడ
కుశలమే గద యిట గూర్చుండు మనుచు
చేయూతనిచ్చి కుచేలుని తనకు
ఉన్న తాసనమున నుపవిష్టుఁ జేసి
చెలిమికాడవు నాకు చిననాటినుండి
తినుటకు నాకేమి తెచ్చితి వనుచు
నతనివీపున నున్న యటుకుల మూట

విప్పి కొన్నిటిఁ దిని ప్రీతితో నవ్వె

కృష్ణుని మర్యాద కెద మెచ్చుకొనుచు
అబ్బురమందుచు నతని ప్రేమకును
కృష్ణునిరూపమ్ము హృదయాన నిలిపి
వెనుకకువచ్చె నా పేదబాపండు
తన కేదయిన సాయ మొనరింపు మనుచు
చెలికాని నర్థించి పలుకాడ లేక.

తనయూరివద్దకు చని కుచేలుండు
తనపూరియింటిని కనుఁగొన లేక
అనుమాన మాడుచు నచటనే నిలిచె
అరుదెంచి యెదురుగా నాతనిభార్య
అర్ఘ్యపాద్యాదుల నర్పించి పతికి
సకలసంపదలున్న సౌధమ్ముకడకు
కొనివచ్చె నతనిని కూరిమిమీఱ
"నాథ! మీరానాడు నన్నుమన్నించి
కృష్ణునికడకు మీరేగిన నాఁడె
మన పూరియిల్లిట్లు మారిన" దనును
అద్భుతమందుచు నాకుచేలుండు
కృష్ణుని మహిమగా నెంచి యంతయును
కృష్ణునే నిరతమ్ము హృదయాన నిలిపి

వైరాగ్యమున తనబ్రతుకెల్ల గడపె
నిష్కామభక్తికి సీతివర్తనకు
విజయమ్ము చేకూరు విశ్వాస మెపుడు
హరిభక్తి చిత్తమం దమరిన చాలు
భక్తులమంచిని పరమాదరమున
కమలాక్షుఁడే చూచి కాపాడుచుండు.

## గ్రహణస్నానము

బలరామకృష్ణులు వసుధపై నిట్లు
దుష్టులోకాకరిని తొలగించుచుండ
పుడమికి బహువిధపుణ్యకాలమ్ము
భాసిల్లునట్లుగా పఱతెంచె నపుడు
సూర్యగ్రహణ పుణ్యశోభన దినము
తగురక్షణల నుంచి ద్వారకాపురిని
పరివారయుతులయి బలరామకృష్ణు
లరిగిరి స్నానార్థ మాసక్తితోడ
పరశురాముని పితృవ్రతములవలన
ప్రథితమైన స్యమంతపంచకస్థలికి
విదురుడున్ భీష్మాదివృద్ధు లెల్లరును
కౌరవుల్ పాండవుల్ ధారుణీశ్వరులు
సనకసనందాది సంయమివరులు
యదువృష్ణి వంశీయు లందఱుగూడ

నరుదెంచిరచ్చటి కాకాలమందె
పుణ్యజలస్నాన పురుషార్థవిధులు
సత్కథాగోష్ఠులు సాధువాదములు
ఆగమాధ్యయనమ్ము లర్చనల్ సలిపి
గడపిరందఱు వారి కాలమ్మునచట
శ్రీకృష్ణుఁ డందఱిన్ చేరి మాటాడి
కూర్మిమై వారల కుశలమ్ము లడిగి
వినయుఁడై పూజించె పెద్దలఁ దఱిని
ఎవరిని పొడగని యిహపరసౌఖ్య
మంద కాంక్షింతురో యవనిపై జనులు
వైకుంఠ నిలయుఁ డా శ్రీకృష్ణు నరిసి
కీర్తించి యాతనికృత్యమ్ము లెల్ల
వర్ణించి యాతని భాసురమహిమ
ఆనందమందిరి యచటి వారెల్ల.

## శ్రీకృష్ణుని సోదరులు

ప్రీతితో బలరామకృష్ణులు మున్ను
మరణమందిన తనగురుపుత్రు నొకని
బ్రతికించి తెచ్చిన పాటవ మ్మెంచి,
జననమందిన మఱుక్షణములోపలనె
బలిమిని కంసుఁడు వధియించి నట్టి
తనసుతు లార్గురిన్ తలఁచి దుఃఖించి

మనసార వారిని మఱి యొకమారు
తిలకింప వాంఛించి దేవకీదేవి
బలరామకృష్ణులఁ బిలచి వచించె
నెటులైన తనకోర్కె నీడేర్పఁ డనుచు.

తాను సృష్టించిన తన్వి భారతినె
భార్యగా చేకొన్న బ్రహ్మను జూచి
పరిహాస మొనరించి బ్రహ్మశాపమును
పొందినట్టి మరీచిపుత్రులే యిట్లు
పుడమిపై దేవకికడుపునఁ బుట్టి
యెఱుగ్రైరి కంసుని కరవాలమునకు
బలిదానవేంద్రుఁడు పాలించుచున్న
సుతలలోకమున కాసుతులేగు టెఱిఁగి
బలరామకృష్ణు లాస్థలమున కరిగి
బలిచేత సన్నుతుల్ వడసి మిక్కిలిగ
తమయన్నలార్గురిన్ దమ వెంటఁ దెచ్చి
తల్లికి చూపించి రుల్లాస మొదవ
గురియయి కంసుని యురుకోపమునకు
జనియించినంతనే చనిపోయి నట్టి
తనయులన్ దేవకి మనసారఁ గాంచి
ముదముతో వారిని ముద్దాడి యెత్తి
పులకించి పోవుచుఁబూనె కౌగిలిని

జననికి హర్షమ్ము జనియింపఁ జేసి
ఆయార్గుడు కుమారు లారీతి నెలమి
యమరలోకమ్మున కరగిరి మరల
దేవకీదేవియు తృప్తి వహించె
కృష్ణునిలీలగా నెంచి సర్వమ్ము.

ఆర్జునుని గర్వభంగము - విప్రునిమృతశిశువులు

ద్వారకయందొక బ్రాహ్మణాగ్రణికి
ప్రభవించుచుండిరి భార్యగర్భమున
మృతిగన్న శిశువులే ప్రతివత్సరమున.
తొమ్మండుగురు పుత్రు లమ్మాడ్కి నేగ
చేతులందొక మృతశిశువును దాల్చి
రాజసౌధముఁ జేరి రాలు కరంగ
విలపింపసాగె నావిప్రునిభార్య
కృష్ణుఁడాదిగ నట నెల్లరు గూడ
ఊరకుండిరి సాయమొనరింప లేక
ఆప్రక్కనేయున్న యర్జునుండామె
దుఃఖమ్మునెట్లైన తొలగింప నెంచి
"భయపడకమ్మ ఓబ్రాహ్మణి యింక
మరణమ్ము మీయింటివిదరిఁ జేర కుండ
కాపాడగల నని గర్వమ్ము తోడ

చాపమ్ము చేఁబూని శరపంక్తి చేత
వారింటిచుట్టు దిగ్బంధంబు జేసె.
ప్రసవించె మరల నా బ్రాహ్మణవనిత
కాని యెవ్వరికిని కనుపడకుండ
మాయమైపోయెను మరణించి శిశువు
తిరిగి యాశిశువును తెచ్చెడి పూన్కి
అతిశయధీరుఁడై యన్నిదిక్కులకు
యమపురికిని గూడ నర్జునుం డరిగి
బాలునిఁ గానక వచ్చెను తిరిగి.
బాలుని రక్షింపఁ బ్రతినను బూని
వ్యర్థుఁడై వచ్చె నీపార్థుఁ డటంచు
పరుషమ్ము లాడె నా బ్రాహ్మణపడుచు
విప్రాంగనయు వచ్చి తిలకింపసాగె.

అచ్యుతుండంతట నర్జునుఁ జూచి
"విధినిర్ణయమె సాగు పృథ్విపై గాని
మన అతిశయములు పనికిరా వెపుడు
రావోయి యర్జున బ్రాహ్మణ సుతుల
గొనివత్తమని పార్థుఁ గొంపోయె వేగ.
తనసుదర్శన దీప్తి దారిచూపింప
పార్థునిఁ దోడ్కొని పశ్చిమదిశకు
బహుదూర మారీతి పయనమై వెడలి

తనస్వరూపమే యయి తనరి వెల్గొంది
పాలసంద్రమున పాపపానుపున
శయనించియున్నట్టి సంకర్షణు నొద్ద
నిలిచి నమస్కృతుల్ సలిపె కృష్ణుండు.
సంకర్షణుండు ప్రసన్నాస్యుఁ డగుచు
వా రిద్దరినిఁ జూచి పరమాదరమున
కృష్ణ! మిమ్మిరువుర నిచటఁ జూచుటకె
కల్పించినాడ నీఘటనమ్ము నేడు
ధర్మవర్తనులును ధన్యులు మీరు
వీక్షింపు డిదె వీరు విప్రునిసుతులు
గొనిపొండటంచును కూర్మితో నిచ్చె.

బాలురఁగొనిపోయి బ్రాహ్మణవరున
కిచ్చెను శ్రీకృష్ణుఁ డెలమి దలిర్ప
కృష్ణునిమహిమగా నెంచి సర్వమ్ము
వినయుఁడై పార్థుఁడు తనగర్వ ముడిగి
వినుతించె కృష్ణునివిఖ్యాతి మిగుల.

### నారదాదిమునులు శ్రీకృష్ణుని స్తుతించుట

పదునెన్మిదిదినాలు వసుధ కంపింప
జరిగిన దారుణ సమరమ్ము ముగిసె
పాండవుల్ గెలిచిరి పాండవాగ్రజుఁడు

ధరణి నేలుటఁజూచి ధర్మ మార్గమున
ఆత్మలో నలరుచు నరిగి ద్వారకకు
బంధుమిత్రులఁ గూడి పరమమోదమున
కాలమ్ము కృష్ణుండు పుట్టిన దాది
కావించియుండిన కార్యమ్ము లెల్ల
పరమాద్భుతమ్ములు పరమరమ్యములు
యుక్తియు రక్తియు యోగసంసక్తి
త్యాగమ్ము దానమ్ము ధర్మవర్తనము
సాహసౌదార్యముల్ సౌజన్యగుణము
దౌష్ట్యసంహరణము ధర్మరక్షణము
అన్నియు నొకచోట నలరారి నట్టి
పరిపూర్ణ సద్గుణపురుషుఁ డతండు
హరియవతారమై యువని జనించె
గోగోప సంతతిన్ గూడి క్రీడించె
మోహనాకారుఁడై మురళి పూరించి
పృథివిపై నింపెను ప్రేమామృతమ్ము
వ్రజకాంతలనుగూడి రాసమ్ములాడె
పుడమిపై దుష్టులన్ పూతన మొదలు
పౌండ్రకువఱకును పరిమార్చె ధృతిని
రాజనీతిని నల్పి రాయబారములు
ధర్మపక్షము నూని ధర్మమ్ము నిలిపె

పాండవేయులఁ గాచె పాంచాలిఁ బ్రోచె
విదురు నక్రూరుని భీష్మాది సకల
సాధుసత్త్వములను సదయుఁడై బ్రోచె
తల్లికి, క్రీడికి తనవైరులకును
విశ్వరూపము జూపి విష్ణువై నిలిచె
యోగీశ్వరుండయి యుద్ధమధ్యమున
ఇహపరసాధన కేకైకపథము
మానవజాతికి మార్గదర్శకము
గీతాప్రబోధముల్ క్రీడికి నుడివె
జాల్ములై చరియించు జనులచే గలుగు
పుడమిబాధలు బాపి భూభార ముడిపె
దివ్యతేజోరాశి దేవదేవుండు
మానుషాకారుడై మహిని చరించె
దేవకిగర్భమ్ము పావనమూర్తి
ఎచ్చట శ్రీకృష్ణు డిలమీద గలఁడొ
అచ్చోట నిత్యమై యలరారుచుండు
శ్రీయును విజయమ్ము ధృతియును కీర్తి
కనివిని యెఱుఁగని కమనీయ నాథ
శ్రీకృష్ణచరిత మీరీతిని జనులు
చెప్పికోసాగిరి చిత్తమ్ము లలర
కృష్ణుని మహనీయ కీర్తులు నిండి
కృష్ణమయమ్మయ్యె పృథివి సర్వమ్ము.

ఎచ్చటఁ జూచిన కృష్ణుని పేరె
పృథివిపై నీరీతి పెంపారుచుండ
కశ్యప నారద గాధిజాగస్త్య
దుర్వాస భృగు కణ్వ తుంబురాత్రేయ
వామదేవ వసిష్ఠ వాలఖిల్యాది
యతివరు లెల్ల నత్యాసక్తి మీఱ
ద్వారకన్ కృష్ణుని దర్శనభాగ్య
మందఁ గాంక్షించుచు నరుదెంచి కనిరి
కనుదోయి విందుగ తనివి తీరంగ

కనకరత్నకిరీటు కౌస్తుభాభరణు
అరవిందలోచను నాజానుబాహు
జలధరశ్యాముని చంద్రికాహాసు
కాంచనమయచేలు కరుణాలవాలు
ఆశ్రితావనశీలు నాయుధహస్తు
రుక్మిణీ నయనాబ్జ రుచిరార్క తేజు
లోకైకరక్షకు శ్రీకృష్ణు నచట.

శ్రీకృష్ణుఁ డెదురేగి ఋషులకు మ్రొక్కి
అర్ఘ్యపాద్యాదుల నర్చన లొసఁగి
కూర్చుండఁగాఁ జేసి కుశలమ్ము లడిగి
"ఇందఱు మహానీయు లేతెంచినారు
ధరణిపై నాజన్మ ధన్యమై తనర

ప్రమదమందితిని మీరాశకు మదిని
సెలవిందు నేఁజేయవలసిన" దనఁగ
మునులెల్లరును లేచి వినయభావమున
"శ్రీపతీ! సర్వేశ! శ్రీకృష్ణదేవ!
భవవినాశకనామ వైకుంఠ ధామ
సర్వాత్మ సర్వేశ సర్వమ్ము నీవె
దుష్టశిక్షణమును శిష్టరక్షణను
అవనిపై పుట్టిన హరివి నీవయ్య
లోకకళ్యార్థ మేకైకదీక్ష
నీవొనర్చిన పనుల్ నిఖిలపూజ్యములు
వర్ణనాతీతముల్ వసుధ నేరికిని
శ్రీకృష్ణ నీధర్మకృత్యమ్ము లెల్ల
జగతికి శాశ్వతశాంతిసౌఖ్యముల
నిచ్చుచుండునుగాక యెల్లవేళలను
ఇంతకంటెనుకోర్కె లేముండు మాకు
నీదర్శనవిశేష నిస్తులభాగ్య
మహిమకంటెను లేదు మాకు వేఱొండు
సుచిర భవదీయ కరుణాకటాక్ష
ధారామృతముకంటె ధన్యత లేదు
ధన్యులమైతిమి ధరణి నిన్జూచి
సెలవిమ్ము మాకిక శ్రీరమాకాంత
పోయివచ్చెద మయ్య పుండరీకాక్ష !

అని సన్నుతులు సల్పి ఆయతీశ్వరులు
కీర్తించి కీర్తించి కృష్ణుని మహిమ
అరిగిరి కృష్ణునే యాత్మలన్నిలిపి
సతతమ్ము బహుజనహితమె వాంఛించి
చరియించు ఋషుల సచ్చరితమ్ము మదిని
పొగడుచు వారికి పూజ లర్పించి
వినయుఁడై కృష్ణుఁడు వీడ్కోలొసంగె.

ద్వివిదుఁడు

నరకాసురుని మిత్రవరులలో నొకఁడు
ద్వివిదుఁడు వానరవీరవర్యుండు
కృష్ణుపై పగఁబూని కృష్ణుఁడున్నట్టి
ఆవర్తదేశమం దగచాట్లు గొలిపి
రమణీయుతుండయి రైవతగిరిని
బలరాముఁ డున్నట్టి ప్రాంతాన కేగి
పెకలించుకొనివచ్చి వృక్షముల్ శిలలు
వారిపై విసరుచు వారికండలకి
చిక్కులుగలిగించి చీకాకుపెట్టి
యుద్ధమొనర్పగా నుత్సాహియగుచు
బలరాముతోడనే తలపడె తుదకు.
బలరాముఁ డాగ్రహాపరవశుం డగుచు
తన హలాయుధమెత్తి క్షణము కాలమున

ద్వివిదుని తల నొకవ్రేటున డుల్చె.

## సాంబుని వివాహము

జాంబవతిసుతుండు సాంబుడు వేడ్క
నరుదెంచి యొకనాడు హస్తినాపురికి
దుర్యోధనుని కూర్మిదుహిత లక్ష్మణను
చూచి మోహించి యాసుందరితోడ
పయనమై చనుచుండ ద్వారకవైపు
కౌరవవీరులు కాంచి యాతనిని
"క్షితిమీద యాదవుల్ మితిమీఱు చుండె
రెంతటి యాగడ మ్మెంతసాహసము
కృష్ణునిపుత్రుఁడే యీతఁ డౌగాక
రారాజుపుత్రిక నీరీతి సాంబుఁ
డెత్తుకపోవునే యెదభీతి లేక
చావమోదెద మికపోవనిచ్చెదమె"
యనుచు నల్వురుగూడి యడ్డమ్మువచ్చి
శరములు గుప్పించి సాంబు బంధించి
కినుకతో వెనుకకుఁ గొనివచ్చినారు.

నారదుఁ డీసమాచారమ్ము నెల్ల
ద్వారకాపురి కేగి వచియించి నంత
ఆగ్రహోద్దీప్తులై యాదవు లంద
ఱాయుధమ్ములఁబూని హస్తినాపురికి

బయలుదేరిరి బలప్రాభవమ్మొసఁగ
సాంబుని విడిపించి సతితోడ వేగ
కొనిరాగ ద్వారక కనురాగ మొదవ.
వారియార్భటులను బలరాముఁ డరసి
కౌరవవరులతో కలహ మీపనికి
మంచిదిగాదని మదిలోన నెంచి
సర్వయాదవులను శాంతింపఁ జేసి
హస్తమందున తనహాలమును బూని
హాస్తిన కరుదెంచి యాత డొక్కెండె
అతివినయమ్మున ధృతరాష్ట్ర పతికి
వార్తావహుల కిచ్చి వార్త నంపించె
"ఇదియుగ్రసేనుని ముదలగా నెంచి
కడువేగ సాంబునికాంతతోఁ గూడ
ద్వారకకంపుట ధర్మ మటంచు."

కౌరవు లెల్లరా కబురునాలించి
"అనుచిత మ్మొనరించు పనియె కాకుండ
ఆజ్ఞలిచ్చెదరె యీ యాదవు లనుచు
బలరాము వాక్యముల్ పాటించరైరి.
కౌరవుల్ దుర్ణయపూరతు లగుట
చూచి వేఱొకదారి తోచక మదిని

బలరాముఁడలుకవై బాహుయుగ్మమున
హలము పైకెత్తి యాహస్తినాపురము
నొకపెద్దపెళగా పెకలించి త్రవ్వి
గంగానదీనీర గర్భమ్ము నందు
త్రోయుఁబూనగఁ జూచి దుర్యోధనుండు
భక్తితో బలరాము పాదాల వ్రాలి
రక్షింపుఁడని చాల ప్రార్థనల్ సలిపి
తగినసత్కృతులిచ్చి తనకూతునిచ్చి
పంపెను సాంబుని బలరాము కడకు
అత్యంతకరుణతో హస్తినన్ వీడి
బలరాముఁ డరుదెంచి వైభవ మ్మలర
జరిపించె ద్వారకన్ సాంబునిపెండ్లి
ఆకారణముచేత హస్తినాపురము
సకల మూగంగ వైపొక ప్రక్క కొరిగి
నేఁటికి నటులనే నిలిచియుండినది.

బలరాముని తీర్థయాత్రలు

పాండవుల్ కౌరవుల్ బలములఁ గూర్చి
రాజ్యమ్ముకొఱకయి రణము నొనర్చ
చేరియుండిరి కురుక్షేత్రమ్మునందు
పాండుపుత్రులు ధర్మవర్తను లగుట
పాండవపక్షమ్ము వహియించి యేగ

పార్థసారథి యయి వాసుదేవుండు.
సర్వసముండును శాంతిప్రియుండు
బలరాముఁ డెవ్వరి పక్షమున్ గొనక
అన్నదమ్ముల కేల రణమిట్టు లనుచు
చింతించి మిక్కిలి చేతమ్ము నందు
తనమాట నెవ్వరున్ వినరని తోచి
క్షేత్రముల్ తీర్థముల్ సేవింప నరిగె.

పొంతనే యున్నట్టి పుణ్యప్రభాస
తీర్థమ్ము మొదలుగా దేశమం దున్న
సకలపుణ్యస్థల సంవాసి యగుచు
జాహ్నవి మున్నగు సకలవాహినుల
జపతపమ్ము లొనర్చి స్నానముల్ జేసి
పితృ, దేవపూజలు ప్రీతితో సలిపి
జలతర్పణమ్ముల శ్రద్ధగా నొసఁగి
మునికులమ్మున కెల్ల ముఖ్యమైయులరు
నైమిశారణ్య పుణ్యాశ్రమమ్ములకు
నేతెంచె బలరాము డాతత ప్రీతి
బలరాము రాకకు పరమహర్షమున
ఎదురేగి యచ్చటి ఋషిచంద్రులెల్ల
ప్రస్తుతుల్ సలిపి సుస్వాగతమ్మిడిరి.
శౌనకాది మునీంద్రసత్తముల్ వచ్చి

వారితపోవన పరిసరమ్ములను
పల్వలుం డను క్రూరపలరాశి యొకఁడు
చేయుచున్నట్టి దుశ్చేష్టల నెల్ల
చెప్పి యారాక్షసున్ శిక్షింపుఁ డనఁగ
బలరాముఁ డలుకతో పల్వలుం డున్న
వనమున కరుదెంచి వానితోఁ బోరి
ఘోరరణమ్మునఁ గూల్చి యాతనిని
హర్షమ్ము చేకూర్చె నచటివారలకు.

నైమిశ కానన సీమలందున్న
సకలఋషీంద్రుల సమ్మతి వడసి
ఒకమహాయజ్ఞమ్ము నొనరించి యచట
దేవతాతతులకు తృప్తిఁ గావించి,
అర్థిజనమ్ముల కామోదమెసఁగ
గోధన ధాన్యాది కోటివస్తువుల
పుష్కలమ్ముగ నిచ్చె భూరిదానములు
అవనియందున్న యతివరు లెల్ల
వినయులై యేతెంచి వీడ్కొలొసంగ
బలరాముఁ డటనుండి పయనమై యేగి
ప్రథితమగు మహేంద్రపర్వతమందు
యోగియై ఘనతపమ్మొనరించుచున్న
పరశురామునిఁ గని భక్తిఁ బూజించి

దక్షిణ దేశాన తనరారుచున్న
తీర్థరాజములను తిలకించు కోర్కె
నతివేడ్కె నరుదెంచె నాంధ్రభూములకు
కృష్ణానదీస్నాన తృప్తినిఁ బొంది
సప్తగోదావరీ జలములఁ దోగి
శ్రీగిరి వేంకట సింహాచలాది
పర్వతాలయముల భక్తి దర్శించి
సత్తపోవన వనస్థలులనుఁ జూచి
సేవించి కావేరి సేతువున్ జూచి
విలసితోజ్జ్వలకీర్తి బలరామమూర్తి
అరుదెంచె వేగమ్మె తిరిగి ద్వారకకు.

భువి నాదిశేషుని యవతారమైన
దివ్యప్రభావుండు దేవతామూర్తి
ఆదర్శచారిత్రుఁ డతులితబలుఁడు
రోహిణీవసుదేవ రుచిరమూర్తులకు
జననమందిన ఘనసద్యశోధనుఁడు
హరియైన కృష్ణున కగ్రజన్ముండు
ప్రాభవోపేతుఁ డాబలరామదేవు
డెచటి కేతెంచిన నచటివారెల్ల
ఆదరాతిథ్యమ్ము లర్చనలొసఁగి
పంపి రాతనిఖ్యాతి ప్రస్తుతిఁ జేసి.

బలరామదేవుని పావనగాథ
చదివిన వినినను జనులెల్లరకు
సంపత్కరము శాంతిసౌఖ్యప్రదమ్ము.

బలరాముఁ డారీతి ద్వారకాపురికి
యాత్రలు ముగియించి అరుదెంచు సరికి
పాండవకౌరవ భండనమ్మందు
కౌరవబల మోడి గాంగేయు డాది
వీరులెల్లరు గూలి పోరిలో తుదకు
భీమదుర్యోధనుల్ పెనగుట యెఱిఁగి
వారినివారింప బలరాముఁ డరిగి
చెప్పఁజూచెనుగాని, చెవియొగ్గకుండ
పోరాడదొడఁగి రావీరులిద్దఱును
ఎవరికర్మము వారిదేయంచు తిరిగి
బాలరాము డేగెను ద్వారకాపురికి.

# శ్రీమహాభాగవతము

## ఏకాదశ స్కంధము

### యాదవకుల ముసలము

కురువంశజుఁడు హస్తిపురికి రారాజు
దుర్యోధనుం డతిదుర్నయుం డగుచు
దాయాదులైనట్టి ధర్మజాదులకు
సూదిమోపినయంత క్షోణియు నీక
వారిని పలుపాట్ల పాల్జేసి తుదకు
సంధియత్నమునకై చనుదెంచి నట్టి
వాసుదేవుని గూడ బంధింపఁ జూచి
తానె యేలగనెంచె ధరణి సర్వమ్ము
గత్యంతరము లేక కదనమ్ము సేయ
వచ్చిరి వారితో పాండవుల్ తుదకు.
ధర్మవర్తనులైన ధర్మజాదులకు
కృష్ణుండు సాయమై గెలిపించి నాడు
ఆయుద్ధసమయమ్మునందె పార్థునకు
కృష్ణుండు ప్రీతితో గీతోపదేశ
తత్త్వమున్ దెలిపి ఈధరణి నెల్లరకు
మార్గదర్శక ధర్మమార్గమ్ము జూపె
కౌరవపాండవ ఘోరయుద్ధమున

మడసి రక్షోహిణుల్ మహిభార ముడిగె
కాని యాదవులెల్ల గర్వాంధు లగుచు
చరియించుచుండుట నరసి కృష్ణుండు
త్వరగ వీరికికూడ ధరణిపై కీడు
తప్పదటంచును తలఁచె నెమ్మదిని.
ద్వారకవద్ద పిండారక క్షేత్ర
మాటలాడుటకయి యాదవు లరిగి
అచ్చట తిరిగెడు యతులను గాంచి
హేళనఁ గావింప నెంచివేగముగ
గర్భిణిగానున్న కాంతచందమున
నమరించి సాంబున కాడువేసమ్ము
"ఏబిడ్డపుట్టునో యెఱిఁగింపుఁ" డనిరి
మునులును వారలమోసమ్ము నెఱిఁగి
"ముసలమ్ము పుట్టి యీముదితగర్భమున
చంపు మిమ్మిక"నంచు శపియించి చనిరి.
వెంటనేవారికి వెఱపుగొల్పుచును
జనియించె ముసలమ్ము సాంబున కపుడు.

మునులవాక్యమునకు మనముల వెఱచి
ముసలమువలన నేముప్పు రాకుండ
కాల్చి భస్మముజేసి కడలిలోఁ గలిపి
రాముసలమ్మును యాదవులెల్ల.

కడలితరంగాల ఘట్టనవలన
భస్మమంతయు చేరి వార్థితీరమున
పెరిగెను తుంగగా పెద్దమొత్తునకు
పోడసూపె ద్వారకాపురమునం దపుడు
పలువిపత్తులు చాలభయము గొల్పుచును
కృష్ణుని యుపదేశ మెంచి యాదవులు
వెడలిరి ద్వారకన్ వీడి వేవేగ
దిగులొందుచు ప్రభాసతీర్థమ్ము కడకు.
యాదవుల్ వారల యనుచితకృత్యులు
మానక నిత్యము మద్యముం ద్రావి
క్రిందుమీదెరుగని క్రీడల మునిగి
పోరాడఁదొడగిరి వారిలో వారె.
మద్యపాన విశేష మత్తులై తుదకు
వరుసవావియు లేక వెఱపింత లేక
తనయుఁడు తండ్రిని తమ్ము లన్నలను
జలనిధితీరాన బలముగా పెరుగు
తుంగను పెకలించి దుందుడు కొప్ప
ఒకరినొక్కరు పట్టి యుక్కుమీఱంగ
చావమోదుచు వారు సమసిరెల్లరును.

మున్నిటియందు నాముసలపు ముక్క

దొరకగా దానిని మెఱుగు బాణముగ
చేసి ముదమ్మున చెంత నుంచుకొని
చనె కిరాతుఁ డొకండు వనికి వేటలకు.

బలరామకృష్ణుల నిర్యాణము

దుష్టశిక్షణకును శిష్టరక్షణకు
క్షితిమీద కృపతోడ శేషుడు హరియు
అవతారమందిన ప్రవిమలయశులు;
బలరామకృష్ణులు పరమపావనులు
లాలిత బహుదివ్య లీలావిశేష
మానుషాకారులు మహితవర్తనులు
ధర్మరక్షణకయి ధరణీతలాన
కృష్ణుఁడు చేసిన కృత్యమ్ములెల్ల
ఆశ్చర్యకరము లత్యద్భుతమ్ములును
పుడమి వారలపని పూర్తియైనట్లు
బలరామకృష్ణులు భావించి రెదల
బలరాముఁ డొకనాడు జలధితీరమున
ధ్యానయోగమ్మున తన్మయుఁడగుచు
ఆత్మను పరమాత్మ యందుంచి చేరె
ప్రాణమ్ము బిగబట్టి పరమపదమ్ము
యాదవుల్ మరణించి రన్నయు చనియె

ధారుణీతలమున తనపని తీరె
శ్రీకృష్ణుఁ డిట్లెంచి చిత్తానఁ దలఁచి
వనికి తానొంటిగా పయనమై యేగె.
దిక్కుల వెలిగించు దివ్యతేజస్వి
శిరమున పింఛమ్ము చెలుఁవొందువాఁడు
శ్రీవత్సచిహ్నుండు శ్రితవత్సలుండు
పీనవక్షుండును పీతాంబరుండు
సరసిజనేత్రుండు శ్యామసుందరుఁడు
గళమున సుమమాల కరమున మురళి
చిరునవ్వు నవ్వుచు శ్రీకృష్ణమూర్తి
కాలిపై కాలూని కదుపుచు వ్రేలు
శయనించె నొకతరుచ్ఛాయలో నొదిగి
కదలెడు కృష్ణుని కాలునిఁ జూచి
మృగముశిరమ్మని హృదయాన తలఁచి
అచట దవ్వుల నున్న యాకిరాతుండు
ముసలపు ముక్కను ములికిగా గలుగు
వాడియమ్మున కృష్ణుపాదమ్ము నేసె
మృగముకయి కిరాతు డేగి యచ్చోట
బాణహతుండయి పడియున్న కృష్ణు
చూచి నిశ్చేష్టుఁడై క్షోభించిపోయి
"అయ్యయో నాస్వామి కపరాధమిచట

ఎంతచేసితినయ్య ఎంతచేసితిని
కనుగవగప్పిన కావరమ్మెడర

## శ్రీకృష్ణ నిర్యాణము

లేడని యేసితి వాడిబాణమున
ఇంతకంటెను పాప మెందేని కలదె
పాపులందున మహాపాపిని నేను
కరుణ కనర్హు డీకలుషచిత్తుండు
శిక్షింపుడీదె నాదు శిరము నిచ్చితిని
కరుణ జూపకు”డంచు కడుదూరమునకు
విసిరివేయుచు దన విల్లునమ్ములను
పడె కిరాతుడు కృష్ణు పాదమ్ము లందు.
“లెమ్ముకిరాతుడ లెమ్మోయి నీవు
నే ననుకొనినదే నీవొనర్చితివి
పుణ్యలోకములకు పోయెద”వనుచు
నాదరమ్మునకృష్ణు డనిపె నాతనిని.

వెదకి కృష్ణునకయి విపిన మెల్లెడల
నాతని సారథి యరుదెంచి యటకు
బాణ హతుండయి పడియున్న కృష్ణు
నరసి మూర్ఛితుడయి యావెన్క లేచి
నిలుచుండె నట్టులే నిశ్చేష్టు డగుచు,

సారథిన్ కనుగొని సరసిజాక్షుండు
కనుగవ యందున కరుణ తొల్కాడ
"సారథీ! నాపని జగమున ముగిసె
పొమ్మోయి నీవింక పోయి ద్వారకకు
ఎఱిఁగింపు మీవార్త నెల్లవారికిని
పొందుము సుఖములు పొమ్మంచు" పలికె.
కృష్ణుని తేజమ్ము విష్ణునాకృతిని
దేదీప్యమానమై దిశలందు వెలిఁగె
శంఖచక్రమ్ములు శార్ఙ్గ పద్మములు
గరుఁడుడున్ వచ్చె నాహరిని గొల్వంగ
పాలితాద్భుత దివ్యలీలావిశేష
మహనీయ సుందర మధురరూపమ్ము
జ్ఞానరసాపూర్ణ సంపన్నబోజ్ఞ
సాధువంశీరవ సమ్మోహనమ్ము
ధర్మరక్షణకళా తాత్త్వికోదార
సాధుగీతాబోధ సంజీవనమ్ము
కృష్ణావతారమ్ము పృథివిపై ముగిసె
శాశ్వతమ్ముగ నిల్చె జగతినెల్లెడల
విశ్వకల్యాణమ్ము విశ్వదర్శనము
ప్రేమపూరమ్ము శ్రీకృష్ణతత్త్వమ్ము.

శంభుండు బ్రహ్మయు సర్వదేవతలు

ఋషివర్యులును వచ్చి కృష్ణునకెఱఁగి
భక్తరక్షక దేవ భవ్యప్రభావ
పాహి పాహియటంచు ప్రణతు లర్పించి
భాగవతోత్తముల్ పరమవైష్ణవులు
వేచియున్నారు నిన్ వీక్షించుకొఱకు
వేంచేయు మిక నీదు విమలవాసమ్ము
వైకుంఠమున కని ప్రార్థించినారు.
ఈశరీరమ్ముతో కృష్ణున కింక
పనియేమియును లేదు వసుధాతలాన
కమలమ్ములను బోలు కనులనుమూసి
శ్రీకృష్ణుడరిగెను వైకుంఠమునకు
శ్రీకృష్ణ నిర్యాణ వృత్తాంతమెల్ల
దూరదూరములకు చేరె శీఘ్రమ్మె
శోకమ్ము దుఃఖమ్ము చీకటి తప్ప
ద్వారకానగరిలో వేఱొండు లేదు.
బలరామకృష్ణులు వైకుంఠలోక
మరిగినారను వార్త నాలించినంత
సైపజాలక మది సంతాపభరము
వసుదేవ దేవకుల్ పడతి రోహిణియు
ప్రాణముల్ విడనాడి స్వర్గతింజనిరి
మృతిగన్న పతులతో చితులందుజేరి
యరిగిరి వారితో యాదవాంగనలు.

క్షితిని కృష్ణుఁడు లేని బ్రతుకేల ననుచు
మర్త్యదేహమ్ముల మహిమీఁద వీడి
కృష్ణుఁ గలసిరి కృష్ణుని సతులు.
శ్రీకృష్ణుఁ డున్నట్టి గృహమొండుతక్క
ద్వారక సర్వమ్ము వార్ధిని మునిఁగె.

శ్రీకృష్ణదేవుని క్షేమమ్ము నరయ
అన్న ధర్మజు డంప నర్జునుఁ డేఁగి
దివ్యప్రభావుండు దేవదేవుండు
శ్రీకృష్ణుఁ డిక లేడు పృథ్వినటంచు
దుఃఖించి దుఃఖించి తుదకర్జునుండు
స్వర్యాతులైనట్టి బంధుసంతతికి
శ్రద్ధతోఁ జేయించి శ్రాద్ధకర్మములు
ద్వారకన్ మిగిలిన వారి తోడ్కొనుచు
హస్తినాపురమున కరుగుచుండంగ
బాటలో దొంగలు పార్థు నోడించి
వారిసొమ్ములనెల్ల బలిమిమై గొనిరి
దివ్యాస్త్రయుతుఁడును దేవసముండు
పరమేశు మెప్పించి పాశుపతమ్ము
పొందిన సాహసపురుషుఁ డర్జునుని
బాటసారుల దోచి బ్రతుకు చోరులకు
వీరిడియై యోడి వెన్నియనేల

కృష్ణుని తోడనే యేగె నాశక్తి.

అశ్రువుల్ గార్చుచు నరుదెంచినట్టి
పార్థుని గనుగొని పాండవాగ్రజుఁడు
శ్రీకృష్ణదేవుని మృతివార్త నెఱిఁగి
తమబాంధవుండును తమచెలికాడు
తమకు సర్వస్వమై తనరిన యట్టి
శ్రీకృష్ణమూర్తికై చింతిచి మిగుల
మాటాడఁజాలక మహిని మూర్ఛిల్లె
హస్తినాపురమెల్ల యల్లాడిపోయె.
శోకమగ్నమ్మయి క్షోభించిపోయె.

పాపనిర్మథనుండు భక్తావనుండు
వైకుంఠవాసుండు వాసుదేవుండు
ధరణిపైఁ దాల్చిన తనువు త్యజించి
కృష్ణుఁడేగిననాఁడె పృథివిని వీడి
కలుషసంభరితమై క్రాలుకాలమ్ము
కలియుగ మ్మిలలోన కాలుబెట్టినది.

# శ్రీ మహాభాగవతము

## ద్వాదశ స్కంధము

### పరీక్షిత్తు మరణము

నరనాథ నీవిష్టు నావల్ల వినిన
పావన చరిత మీభాగవతమ్ము
కృష్ణుని నామమ్ము కృష్ణుని మహిమ
మదిలోనఁ దలచిన చదివిన వినిన
శ్రీయును విజయమ్ము ధృతియును కీర్తి
తథ్యమ్ము గాగల్గు ధరణి వాసులకు.

శ్రీశుకుం డిట్లు పరీక్షిత్తునకును
పరమ పురాణమ్ము భాగవతమ్ము
వినిపించి మఱియును వినుమని మిగుల
ముదమున బోధించె తుదిమాటలిట్లు
"అన్యదుర్లభమైన హరిగాథ లెల్ల
ధరణీశ యాలించి ధన్యుఁడైనావు
మునిశాపమున మృతి చనుదెంచు ననుచు
చింతనొందకు మిక స్వాంతమ్మునందు
చావు తప్పదు ధాత్రి జనులకెల్లరకు
ఆత్మనిత్యము గాన నన్యమ్ము మఱచి

సర్వమయుండును సర్వేశుఁడైన
హరిమీఁదనే నిల్పు మాత్మను నీవు
కష్టముల్ సుఖములు కలిమి లేములును
చావైన బ్రతుకైన సమముగాఁ దోచు
సర్వేశ్వరుని పాదసాయుజ్య మబ్బు
హరి యనుగ్రహముచే నవనిపై నీకు
కలుగదు జన్మమ్ము కైవల్యమబ్బు"
అత్యాదరమ్మున నాద్యంత మిట్లు
పుణ్యభాగవతమును బోధించినట్టి
ముని యుపదేశముల్ విని పరీక్షిత్తు
చిత్తమ్మునందున శ్రీహరిన్ నిలిపి
దేహమే యెఱుఁగని స్థితి యందు మునిగి
బ్రహ్మభూతుండయ్యె పరమాత్మ నెఱిగె
మునికుమారుని శాప మూలాన నొక్క
బ్రాహ్మణుం డిచ్చిన ఫలము రూపమున
తక్షకాహియు వచ్చి ధరణీశు గరువ
దేహమ్ము విడనాడి దివికేగె రాజు.

స ర్ప యా గ ము

ధర్మపాలకుఁడును దైవభక్తుండు
ధర్మాత్ముఁడగు కీర్తి ధరణిపైఁ గొనిన

తండ్రి పరీక్షిత్తు ధరమీద నిట్లు
సర్పదష్టుండయి చనిపోవు టెఱిగి
ఆతని పుత్రుండై యవని పాలించు
జనమేజయుండు కోప చలితాత్ముండగుచు
భూమిపై నికమీద పాములేకుండ
సలుప సంకల్పించి సర్పయాగమున
చంపుచు నుండెను సర్పసంతతుల
ఆయజ్ఞ హోమమందరు దెంచి వరుస
నాహుతి యగుచుండె నన్ని సర్పములు
ధరణి నింతటి హింస తగదని యెంచి
ఋషులెల్లరును వచ్చి నృపతిని జూచి
"సర్పకులము నెల్ల సమయింపఁ జేయు
నింతటి హింస నీకేల నో రాజ
విధియట్టులుండె నీపితృదేవు మృతికి
పగనేల దానికై పాములపైని
సృష్టిలో భాగ మీ జీవులు గూడ
బ్రతుక నర్హమ్ము లీవసుధాతలాన
గాన నీయాగమున్ మాను" మనంగ
మునుల వాక్యములను మనమునం దుంచి
సర్పయాగము మాని జనమేజయుండు
ధర్మతత్పరుండయి తండ్రిని బోలి
రాజ్యమ్ము పాలించె ప్రజల మేలెంచి

## వృకాసురుఁడు

వృకుఁడను దానవుం డొకఁడు పూర్వమ్ము
భవునిచే వరములు పడయఁ దలంచి
కఠినతపమ్మును గావించి తుదకు
అగ్నిలోఁ దనతల నాహుతి సేయ
నుంకించుచుండగా హోమాగ్ని నుండి
భవుఁడు ప్రత్యక్షమై వచ్చి యొసంగె
వృకుడు వాంఛించిన రీతిగా వరము
"ఎవ్వని తలమీద వృకుఁడు హస్తమ్ము
నుంచునో యాతఁ డా యుత్తరక్షణమె
భస్మమై నసుధనై పడిపోవు నటుల
దురితవర్తనుఁడును దుష్టుఁడౌ వృకుఁడు
పరమేశుఁ డొసగిన వరముచేఁ దానె
అవని సర్వమ్ములు నాశతో మదిని
వరశక్తి నొక్కమా రరయఁ దలంచి
ఎదురుగా నున్నట్టి ఈశ్వరు తలనె
తనహస్త ముంచగా చనుదెంచుచుండ
పరువెత్తె దిశలకు భయపడి శివుఁడు
అభవుఁ డెచ్చటికేగ నచటికే వేగ
వృకుఁడు భీకరుఁడయి వెంటాడుచుండ
తప్పించుకొనియెడు దారి కన్పడక
శ్రీకంఠు డేగెను వైకుంఠమునకు

శ్రీపతి యంతట వృకునాపి నిలపి
"భూతపిశాచాధి నేత యీశివుని
వృకుఁడ నమ్మెదవేల వెఱ్ఱివై యిట్లు
నీవరమహిమను నీకండ్ల ముందె
ధరణిపై పరికింపఁ దలచితివేని
నీతలమీఁదనే నీచేయినుంచు
మావెన్క నభవుపై కరుగు" మనంగ
మూర్ఖుఁడా వృకుఁడట్లె మూర్ధమ్మునందు
తనచేయి తానుంచుకొని భస్మమయ్యె
నారాయణుని యుక్తి కారణమ్మగుచు
శివునికి వచ్చిన చేటుతొలంగె
వృకునివల్ల భయమ్ము పృథివి నణంగె
ప్రజలు హర్షింపగా వసుధాతలాన
దేవతల్ గురిసిరి పూవులవాన.

## త్రిమూర్తులు

దివ్య సరస్వతీ తీరమ్మునందు
మునులంద ఱొకయజ్ఞ మొనరించుచుండి
హరి హర బ్రహ్మల యందెవ్వ రధిక
శాంతస్వభావుఁడో స్వామి యటంచు
వాదించుకొని తమవాదముల్ తెగక
భృగువు నంపిరి నిజంబెఱుగంగ దలచి

భృగుఁడేగి బ్రహ్మను వీక్షించి ముందు
పరుషమ్ముగా నేదొ పలుకంగఁ బోవ
భృగుని ప్రవర్తన కెద కోపమంది
పంపెను బయటకు బ్రహ్మ యాభృగుని
ఈశ్వరు నొద్ద కాభృగుఁ డేగి యట్లె
గౌరవమ్మింతయుఁ గావింపకెట్టి
మర్యాదయును లేక మాటాడఁబోవ
చేతిశూలము నెత్తి శివుడు రౌద్రమున
పొడవబోవగ మునిపుంగవుం డంత
వైకుంఠమున కేగి వైకుంఠమందు
శ్రీదేవి యంకాన శిరమునువాల్చి
పన్నగశయనుఁడౌ పద్మాక్షుఁ జూచి
ఇంతటి యతిశయ మేల నీకనుచు
పద్మాక్షు గుండెపై పదమెత్తి తన్నె.
భృగువు చేసిన పని కిసుమంత గూడ
కోపభావమ్మును చూపింప బోక
పద్మాక్షుఁ డతనికి స్వాగత మ్మొసఁగి
చిఱునవ్వు మోమున చెంగలింపంగ
"నేను ధన్యుఁడ నైతి నీరాకవలన
నాకాయమును దాకి నీకాలు నొచ్చె
నోయని పాదమ్ములొత్తె నామునికి.
శాంతస్వభావుఁడు సౌజన్యుఁ డైన

విష్ణునిస్తుతియించి భృగుడేగి వేగ
నెఱిఁగించె మునుల కా హరి శాంతగుణము.

మా ర్కం డే యుఁ డు

కలఁడు పూర్వమ్మొక ఘనతపశ్శాలి
అవని మార్కండేయుఁ డనుమునీంద్రుండు
మృత్యువున్ గెలిచిన ఋషిచంద్రుఁ డతడు.
అతని తపమ్మున కచ్చెరువంది
నరుడు నారాయణుం డిరువురు గూడ
ప్రత్యక్షమైనంత వారికి మ్రొక్కి
అంజలి ఘటియించి యామునీశ్వరుఁడు
"ధన్యుఁడనైతి మీదర్శనమబ్బి
దివ్యప్రభావులు దేవతల్ మీరు
నరుల నెల్లరఁబ్రోచు కరుణాత్ము లరయ
వరములందును భోగ భాగ్యమ్ములందు
వసుధపై నాకెట్టి వాంఛలు లేవు.
హరి యోగమాయ నేనరయ దలంతు
కరుణతో నాకోర్కె నెఱవేర్పుఁ" డనఁగ
ఔగాక యని ముని నాశీర్వదించి
నరుఁడు నారాయణుం డరిగిరి ప్రీతి,

మునిచంద్రుఁ డంతట తనయాశ్రమమున
తన తపోదీక్షలో తన్మయుడయ్యె

ఆకస్మికమ్ముగా నఖిల విశ్వమ్ము
సంక్షుబ్ధమై సర్వసంకుల మ్మగుచు
పిడుగులు మెఱపులు భీకరధ్వనులు
పెనుగాలి వానతో బీభత్స మయ్యె
ఉప్పెన లుప్పొంగి యుర్వి మునింగి
యేకార్ణవమ్మయ్యె లోకమ్ములెల్ల.
ఎటుఁబోవుటకు గూడ నెడము నారయక
ఆయర్ణవమ్ములో నంగుష్ఠ మంత
వసుధ యావసుధపై వటవృక్షమొకటి
వటపత్ర మందున బాలుఁడొకండు
శయనించుటయు జూచి చకితుఁడై మదిని
బాలుని దరిఁజేరి పరికించుచుండ
పరవశుండయి మౌని బాలుని యొక్క
యుదరమ్ములోనికి నొప్పుగా నేగి
లోచనోత్సవముగా చూచె నచ్చోట
పూర్వము తానున్న పుణ్యాశ్రమమ్ము
పుడమి యంతయు సర్వభువనసంచయము
సూర్యచంద్రుల తోడ చుక్కలతోడ
కాంతిమంతమ్మయి కడు ప్రకాశించు
అఖిల విశ్వమ్ము నత్యాశ్చర్య మొదవ
ఆదిమధ్యాంతమ్ము లరయగా రాని
ఆ బాలు నుదరమ్మునందుండి పయికి

మునియు రాజూచిన క్షణము లోపలనె
మాయమై సర్వమ్ము మానియె మిగిలె
నెప్పటి రీతిగ నేకాంత మందు
ధ్యానమగ్నుండయి తన యాశ్రమమున.
మానియు వెంటనే మదిలో నెఱింగె
తిలకించినది జలప్రళయ మటంచు
సృష్టి స్థితి వినాశ చేష్టితమ్ములకు
నాధారకారణ మ్మైనట్టి హరియె
ఉజ్జ్వలాకారుడై యోగరూపమున
వటపత్రశాయియౌ బాలుఁ డటంచు
హరియోగమాయ తా నారీతి నచట
పరికింప గలిగిన భాగ్యసంపదకు
మనసులో నలరుచు మానియు మరల
ధ్యానమగ్నుండయ్యె తనయాశ్రమమున

గౌరియు శివుడు నా దారి నేగుచును
మౌని మార్కండేయు మహిమ నెఱింగి
యాతని కనుగొను నభిలాష తోడ
చనుదెంచి రచటికి; మునియు మేల్కాంచి
వారిరాకకు పొంది పరమాద్భుతమ్ము
శిరము వాలిచి మ్రొక్కి చేతులుమోడ్చి

"ఈశ్వరి యీయమ్మ ఈశ్వరుం డీవు,
అతి దయాన్వితులు మీ రాదిదంపతులు
లోకరక్షణ కళాప్రాకటమతులు
దయజూచితిరి నన్ను, ధన్యుఁడనైతి
కరుణావిలాస యో కైలాసవాస
కలదు నా కొక్కటి కాంక్ష చిత్తమున
భక్తితో నిత్యమ్ము పరమాత్మయందె
చిత్తమ్ము లగ్నమ్ము జేసి ధ్యానించు
బలమీయు డిదిచాలు వసుధపై ననుచు
ప్రార్థించె వారల పాదమ్ము లంటి
పరమేశుఁ డాతని భక్తికి మెచ్చి
మానికులాగ్రణీ మహిమీద నీవు
పరమభక్తుఁ డవును చిరంజీవి వగుచు
బ్రహ్మభావన మహాభాగ్యమ్ము నంది
వర్ధిల్లుమువుగాక వసుధపై ననుచు
నాశీస్సుల నొసంగి యామునీంద్రునకు
భవుఁ డేగె తనసతి పార్వతిం గూడి.
భక్తశిఖామణి బ్రహ్మతేజస్వి
ప్రథితయశుండు మార్కండేయ మౌని
జీవించి యున్నాడు క్షితిని నేఁటికిని.

## కలికాలము

కృష్ణుఁ డేగిన నాఁడె పృథ్విని వీడి
కలియుగ మ్మిలలోన కాలుబెట్టినది
కలుషమ్ము దోష సంకలితమ్ము నగుచు
కలికాల జీవనక్రమ మంతకంత
పాపభూయిష్ఠమై పఱగుచు నుండు
ప్రజ లసంఖ్యాకులై ప్రభవింతు రవని
పాడిపంటలు తగ్గు భాగ్యమ్ము లణఁగు
సన్నగిల్లును సర్వ శాస్త్రోక్త విధులు
కులధర్మము లడుగు గుణములు చెడును
బలమున్న వానిదే పాలనమ్మగుచు
అవినీతి పాలగు నవనీతలమ్ము
విపరీతమైనట్టి విషయసౌఖ్యముల
నాశక్తి జూపుచు నాత్మధర్మమును
మఱచి చరింతురు మహిమీద ప్రజలు
సహజీవనమ్మును శాంతిసౌఖ్యములు
దూరమై యన్యోన్య వైరమ్ముతోడ
మారణాస్త్రిలతో పోరు చుండెదరు
తీవ్రమ్ముగా జనుల్ దేశాల మధ్య
జూద చోర వ్యాధి సంక్లేశ విషమ
దీర్ఘరోగములతో త్రిప్పలు పడుచు
తుద కన్నవస్త్రిముల్ దొరకక భువిని

ప్రజలు నానావిధ బాధలందెదరు.

ప్రజల దుర్గతిబాప భగవానుఁడంత
కరుణించి జనియించు కల్కిరూపమున
భూమిపై శంబళ గ్రామమ్ము నందు
విష్ణుయశుం డను విప్రునియింట
జనియించి కల్కియు చండతేజమున
దేవదత్తమ్మను దివ్యాశ్వమెక్కి
కత్తిని చేబూని గాలించి భువిని
దుష్టులశిక్షించి శిష్టులఁ బ్రోచి
ధర్మమున్ నిలిపి సత్కార్యముల్ నెఱపి
సకల సంపదలును శాంతి సౌఖ్యములు
ప్రజల కొసంగెడి పావనమ్మైన
సత్యయుగమ్మును స్థాపించు భువిని.

ఫలశ్రుతి

శ్రీవిష్ణుచరిత మీశ్రీభాగవతము
ఇల పురాణములయం దిదియె శ్రేష్టమ్ము
ఊహా కసాధ్య మీయుత్తమమైన
గ్రంథమ్ము నందున్న ప్రాశస్త్యమహిమ

పరమాత్మపై నుండ వలసిన యట్టి
భక్తితో బాటుగా ప్రజల కెల్లరకు
చిత్తవికాసమ్ము జీవనసిద్ధి
సాంఘిక క్షేమమ్ము సమకూర్చు నీతి
సర్వమీ పావన శాస్త్రమ్మునందు
రాజిల్లు చుండెను ప్రజ నుద్ధరింప.

శ్రీవిష్ణుదేవుడే క్షితిని జన్మించి
మానవాకారుఁడై మహిని చరించి
నియతజీవనమందు నిత్యవృత్తులను
శాశ్వతానందమ్ము సమకూర్చునట్టి
ధర్మమార్గము జూపి ధరణీతలాన
మార్గదర్శకుఁడయ్యె మనుజ సంతతికి.

భాగవతగ్రంథ పాఠమ్ము లందు
కలవెన్నియో పుణ్యగాథలున్ కథలు,
ఒకనిది జ్ఞాన మింకొకనిది భక్తి
ఒకనిది సత్కర్మ యోగప్రశస్తి
ఒకనిది సత్య మింకొకని దహింస
ఒకనిది నియమ మింకొకనిది నీతి
ఒకనిది వితరణ మ్మొకనిది దీక్ష
ఒకనిది త్యాగ మింకొకనిది తపము

ఒకనిది పాలన మ్మొకనిది సేవ
ఒకనిది సౌజన్య మొకనిది కరుణ
జీవిత లక్ష్యమ్ము సిద్ధింపఁజేయు
పావన పథము లీభవ్యసత్కథలు
ఇహాపర సాధన లిందున్న వెల్ల
పృథివికి మేల్గూర్చు పృథులధర్మములు
శాంతిసౌఖ్యములిచ్చి సంపద లిచ్చి
సత్కర్మ పథమిచ్చి జ్ఞానమ్ము నిచ్చి
శాశ్వత హరిపద సాయుజ్య మిచ్చి
భువినున్న మనుజుని పుణ్యదేవతగ
మార్చగల్గినవి యీమహితధర్మములె.
కలియుగ వాసుల కల్పవృక్షమ్ము
పావనమైన యీభాగవతమును
జనులెల్ల నిత్యమ్ము సద్భక్తితోడ
చదువుచు వినుచును చదివి చెప్పుచును
కామితార్థము లంది కళ్యాణమంది
శ్రీయును విజయమ్ము శ్రేయమ్ము నంది
వర్ధిల్లుదురు గాక వసుధాతలాన.

# గద్య

ఇది శ్రీభారతీ కరుణాకటాక్ష లబ్ధకవితావిశేష హారితస
గోత్ర పవిత్ర సర్రాజార్య రత్నమాంబాపుత్ర కవి
భూషణ కవిశేఖర బిరుదాంచిత బుధజనవిధేయ
సుబ్బారాయ నామధేయ ప్రణీతంబైన
శ్రీ మహాభాగవతము నందు
ద్వాదశ స్కంధము
సర్వము-సంపూర్ణము.

ఓమ్ తత్ సత్

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 34 | 12 | వరహావతారము | వరాహావతారము |
| 44 | 17 | మర్యాడ | మర్యాద |
| 45 | 3 | క్షయింప | క్షమింప |
| 92 | 9 | నుసాయముల | నుపాయముల |
| 130 | పేజీ నంబరు | 230 | 130 |
| 132 | ,, | 162 | 132 |
| 286 | ,, | 786 | 286 |
| 152 | 12 | క్షెమరాజ్యమ్ము | క్షేమరాజ్యమ్ము |
| 162 | 12 | శూర్సణఖ | శూర్పణఖ |
| 164 | 1 | యాయలేడి | మాయలేడి |
| 208 | 18 | కతితమై | కతీతమై |
| 238 | 19 | వెదుక | వెనుక |
| 274 | 7 | మిమ్మెరుపుర | మిమ్మెరువుర |
| 287 | 3 | మునలము | ముసలము |

# శ్రీ కొండేపూడి సుబ్బారావు రచనలు

## ము ద్రి త ము లు

1. కావ్యాంజలి : క్రౌను 16+82 పుటలు వెల రు. 3-50
   రమణీయ ఖండకావ్య సంపుటి
2. గీతామృతము : డెమీ. 36+328 పుటలు 15-00
   18 అధ్యా. శ్లోకములు వానికి సులభశైలి
   తెలుగు పద్యములు, తాత్పర్యములు.
3. గీతాసంగ్రహము : డెమీ. 48 పుటలు 2-00
   భగవద్గీత 18 అధ్యా. సారము. వచనము
4. సర్వేశ్వరస్తవము : డెమ్మీ. 32 పుటలు 1-50
   ప్రార్థన పద్యశతకము
5. శ్రీవేంకటేశ్వరకర్ణామృతము : క్రౌను 72 పుటలు
   పద్యకావ్యము 4-00
6. శ్రీ సూర్యనారాయణశతకము : క్రౌను
   36 పుటలు 2-00

## సులభశైలి ద్విపదకావ్యములు

శ్రీమద్రామాయణము : క్రౌ. 24+300 రు. 12-00
శ్రీ ఉత్తరరామాయణము : క్రౌ. 16+128 5-00
. శ్రీమహాభారతము : క్రౌ. 16+142 5-00
I. శ్రీమద్భాగవతము : క్రౌ. 16+312 12-00

మొత్తముగా కొనువారికి ప్రతులసంఖ్యనుబట్టి
తగిన డిస్కౌంటు లభించును.